# సోమదేవభట్టు

# కథాసరిత్సాగరం

అనువాదం:

## డా॥ విద్వాన్ విశ్వం




తొమ్మిదవ సంపుటము

ప్రచురణ:
శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ, ఐ. ఏ. ఎస్.
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1985

# మనవి

సోమదేవభట్టు సంస్కృతంలో బృహత్కథానుసారంగా రచించిన కథాసరిత్సాగరాన్ని పన్నెండు సంపుటాలుగా మేము ప్రచురించ సంకల్పించడం పాఠకులకు సువిదితం. దీనిని సుష్ఠుగా సుమనోహరంగా తెనుగు చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం ప్రధాన సంపాదకులు డా॥ విద్వాన్ విశ్వం గారిని వేరుగా ప్రశంసించ నక్కరలేదు. వారెంతో శ్రమించి ఈ ఉద్గ్రంథాన్ని పూర్తి చేసినారు.

ఇప్పటికి ఎనిమిది సంపుటాల ముద్రణ పూర్తి అయినది. ఇది అందులో తొమ్మిదవ సంపుటం. ఇదంతా బేతాళ పంచవింశతిక అనే ఒక ప్రత్యేక భాగంగా ఉన్నది. ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాలను ప్రతిబింబించే సాహిత్యాన్ని సర్వజన సులభం చేసే కార్యక్రమాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వారు చేపట్టి నిర్వహిస్తుండడం పాఠకులకు తెలియనిది కాదు. త్వరలోనే మిగత మూడు భాగాలను కూడా ప్రచురించి ఈ గ్రంథాన్ని సమగ్రంగా సహృదయులకు అందించ గలమని, మా కృషి అతి త్వరలోనే ఫలించ గలదని విశ్వసిస్తున్నాము. ఈ మహో ద్యమానికి సహకరిస్తున్న వారందరికీ మా కృతజ్ఞతలు.

ఎస్. లక్ష్మీనారాయణ, ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

తిరుపతి,
28-3-1985

# ఒక మాట

కథాసరిత్సాగరం తొమ్మిదో సంపుటం మీ ముందుంచగలుగు తున్నందుకు ఎంతో ఆనందిస్తున్నాను. సుదీర్ఘంగా ఉన్న పన్నెండవ శశాంకవతీ లంబకాన్ని మూడు ఖండాలుగాచేసి ఇస్తున్నామని క్రిందటి సంపుటంలోనే తెలియ జేసినాము. ఇది అందులో రెండవ ఖండం— బేతాళ పంచవింశతిక. బేతాళ పంచవింశతి కథలనే పేర ప్రత్యేక గ్రంథాలుగా కూడా వెలసిన పుస్తకాలు కొన్ని ఉన్నవి. మిగతాకథ లన్నిటివలెనే ఇవికూడా అనేక రూపాంతరాలు ధరించి ప్రాచుర్యం పొంది నవి. ఈ ఇరవై ఐదు కథలు ఒక ఖండంగానే ఉన్నవి గనుక వాటిని ఈ తొమ్మిదవ సంపుటంగా అనువదించినాను. ఇంతలి కథలన్ని సాహసో పేతమైన, అద్భుతమైన కథావస్తువుతో పాఠకుల హృదయాలను సుళు వుగా ఆకర్షించగలవని భావిస్తున్నాను.

త్వరలోనే మిగతా మూడు సంపుటాలు వెలువడి ఈ గ్రంథం పరి పూర్తి చెందుతుందని విశ్వసిస్తున్నాను. ఈ గ్రంథముద్రణలో, ప్రచు రణలో సాయపడుతున్న వారందరికీ కృతజ్ఞుడను, ముఖ్యంగా తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి ఎస్. లక్ష్మీనారాయణగారు ఈ విషయంలో చూపుతున్న శ్రద్ధాసక్తులే ఈ గ్రంథ ప్రచురణ ఇంత త్వరగా వరుసగా సాగుతున్నందుకు ముఖ్యకారణం. వారికి నా ధన్యవాదాలు.

28-3-1985

—విశ్వం

## విషయ సూచిక

# 12. శశాంకవతీ లంబకం

# కథా సరిత్సాగరం

## 12. శశాంకవతీ లంబకం

### ద్వితీయ ఖండం

### "బేతాళ పంచ వింశతిక"

# 12. శశాంకవతీ లంబకం

ఇదం గురు గిరీంద్రజా
  ప్రణయ మందరాందోలనాత్
పురా కిల కథామృతం
  హరముఖాంబుధే రుద్గతమ్,
ప్రసహ్యా సరయంతి యే
  విగతవిఘ్న లబ్ధర్ధయో
ధురం దధతి వైబుధం
  భువి. భవ ప్రసాదేన తే.

పూర్వం పార్వతీ ప్రణయ మందరమథనంతో హరముఖాబ్ధి నుండి ఈ కథామృతం ఆవిష్కృత మైనది. పట్టుదలతో ఈ సుధను ఎవరు పానం చేస్తారో వారు శివానుగ్రహం వల్ల నిర్విఘ్న సిద్ధులను పొంది దివ్యపదమును చేరగలరు.

# అష్టవంతరంగం

నృత్యం చేస్తుండగా తన కరాఘాతం వల్ల రాలి పడుతున్న చుక్కలు ఆకసం నుంచి కురుస్తున్న పుష్పవృష్టివలె ఉన్న ఆ విఘ్నేశ్వరునకు జయమగుగాక!

మృగాంకదత్తుడు ఆ రాత్రి అక్కడే గడపినాడు. తెల్లవారగనే ఆ కాననం నుంచి ప్రచండశక్తి మొదలైన సచివులతో పాటూ బయలుదేరి శశాంకవతి కోసం, తిరిగీ ఉజ్జయినీ నగరంవేపు వెడుతూ, మిగిలిన తన మిత్రులను అన్వేషిస్తూ నడక సాగించినాడు.

పోతూపోతూ దారిలో విక్రమ కేసరిని చూచినాడు. అతి వికృతరూపుడైన ఒక పురుషుడు ఆ మంత్రిని ఆకసంలో కొని పోతున్నాడు. సంభ్రమంతో ఇతర మంత్రులకు అతనిని చూపుతుండగా ఆ మంత్రి గగనం నుంచి ఆ సమీపంలోనే దిగినాడు. ఆ పురుషుని భుజస్కంధం నుంచి క్రిందికి దిగి అతను మృగాంకదత్తుని సమీపించి కనులనీరు నిండగా ఆయన పాదాలను పట్టుకున్నాడు. అతనిని చూడడంతో సంతోషించిన మృగాంకదత్తుడు మిత్రుని కౌగిలించుకున్నాడు.

అలాగే మంత్రు లందరూ క్రమంగా అతనిని ఆలింగనం చేసుకున్నారు. తాను తలచుకున్నప్పుడు తిరిగిరమ్మని చెప్పి ఆ వికృతపురుషుని విక్రమకేసరి పంపివేసినాడు.

ఆ తర్వాత మృగాంకదత్తుడు అతనిని కూర్చుండ బెట్టుకుని కుతూహలంతో ప్రశ్నించినాడు. విక్రమకేసరి వనంలో తన ఉదంతా న్నంతటినీ చెప్పసాగినాడు.

## విక్రమకేసరి కథ

— ఆ విధంగా నాగశాపంతో మీకు దూరమై నేను అడవిలో తిరుగుతూ మీ కోసమై వెదుకుతూ ఎన్నో దినాలు గడిపివేసినాను. ఆ తర్వాత ఇలా అనుకున్నాను. "ఎలాగూ వారందరూ తప్ప కుండా ఉజ్జయినికే వెళ్ళవలసి ఉన్నది గనుక నేను కూడా అక్క డికే వెడతాను" అని నిశ్చయించుకొని ఆ పట్నంవేపు బయలు దేరినాను.

అక్కడి సమీపంలో ఉన్న బ్రహ్మస్థలం అనే గ్రామానికి క్రమంగా చేరుకున్నాను. ఒక బావి గట్టున ఉన్న చెట్టు క్రింద కూర్చున్నాను. అప్పుడక్కడికి పాముకరచి ఆర్తుడైన ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చి నాతో ఇట్లన్నాడు:

"కుమారా! ఇక్కడ కూర్చోవద్దు. నీకూ నా గతే పడుతుంది. ఇక్కడ ఒక మహాసర్పమున్నది. అది రోగార్తుడనైన నన్ను కరచినది. ఈ మహావాపిలో పడి శరీరత్యాగం చేయాలని నేను ప్రయత్నిస్తున్నాను."

ఈ మాటలువిని జాలితో దేహత్యాగం చేయవద్దని ఆయనను నివారించి, విష విద్యతో ఆ విప్రుని విషాన్ని తీసివేసినాను. అంతట ఆ విప్రుడు ఆదరంతో నా సంగతిని నన్నడిగి నాపై ప్రీతి చెంది ఈ విధంగా అన్నాడు:

"ఓ వీరుడా! నా ప్రాణాలను నీవు కాపాడినావు. కాబట్టి మా తండ్రి నాకు ఉపదేశించిన బేతాళ సాధన మంత్రాన్ని నీ కుపదే శిస్తాను. నీ వంటి సత్త్వశాలురకు సిద్ధిని సమకూర్చడంలో ఉప యుక్తమైన దీ మంత్రం. మా వంటి పిరికివారం దీనిని ఏంచేసుకో గలం?"

అప్పు డాయనతో నే నిట్లన్నాను. "మా ప్రభువు మృగాంక దత్తునికి దూరమైన నేను మాత్రం ఈ బేతాళునితో చేసుకోగల దేమున్నది?"

ఆ మాటవిని ఆ విప్రుడు నవ్వి తిరిగీ నాతో ఇట్లన్నాడు: "బేతాళునిద్వారా అన్ని కోరికలు తీరగలవని నీకు తెలియదా? బేతాళ ప్రసాదం వల్ల విద్యాధరైశ్వర్యాన్ని త్రివిక్రమసేను డనే భూపాలుడు పూర్వం పొందలేదా? ఇప్పు డా కథను చెప్తాను విను:

## త్రివిక్రమసేనుని కథ

గోదావరీ తీరంలో ప్రతిష్ఠాన మనే దేశం కలదు. అక్కడ విక్రమసేన కుమారుడు, మహేంద్ర పరాక్రముడు కలడు. ఆయన పేరు త్రివిక్రమసేనుడు. అతని కీర్తి ప్రఖ్యాతులు విశ్వ విఖ్యాతాలు. తాను కొలువుండగా ప్రతిరోజూ ఆ భూపతి సేవార్థమై శాంతిశీలుడను పేరుగల ఒక భిక్షువు ఒక పండును తెచ్చేవాడు; ఇచ్చేవాడు.

ఆ రాజుకూడా దానిని తీసుకొని తన ప్రక్కనే ఉన్న కోశా గారాధికారి చేతికి ఇచ్చివేసేవాడు. ఈ విధంగా పదేళ్ళు జరిగి పోయినవి. తర్వాత ఒకనాడు రాజునకు యథాప్రకారం ఆ భిక్షువు పండు నిచ్చి వెళ్ళి పోయినాడు.

దైవాత్తూ ఆ ఫలాన్ని తీసుకున్న రాజు, రక్షకులనుంచి తప్పించుకొని వచ్చిన క్రీడామర్కట పోతానికి దానిని ఇచ్చినాడు. ఆ కోతిపిల్ల దానిని తినబోగా దాని మధ్యలోనుంచి అనర్ఘమైన ఉత్తమ రత్నమొకటి బయటపడినది. అదిచూచి భాండాగారాధి పతిని రాజు ప్రశ్నించినాడు. ఈ భిక్షువు తెచ్చిఇచ్చిన పళ్ళ

నన్నింటినీ ప్రతిరోజూ నేను నీకు ఇచ్చేవాడిని కదా! నీ కిచ్చిన వాటి నన్నింటినీ ఎక్కడ దాస్తూ వస్తున్నావు?''

ఆ మాటవిని కోశాధ్యక్షుడు భయపడుతూ ఇలా విన్నవించినాడు: "వాటిని నేను కోయకుండా గవాక్షంనుంచీ రత్నాగారం లోనికి పారవేస్తూ వచ్చినాను. తాము ఆదేశిస్తే ఆగారాన్ని తెరిచి వెదకుతాను."

ఆ మాటకు రాజు అనుమతింపగా అతను వెంటనే వెళ్ళి తిరిగివచ్చి ప్రభువుతో ఇలా విన్నవించుకున్నాడు: "దేవా! కుళ్ళిపోయిన పళ్ళుమాత్రం అక్కడ కనబడలేదు. మహాప్రకాశవంతాలైన రత్నాలరాశి ఒకటిమాత్రం కనబడినది." ఆ మాటవిని ఆ మణులనిచ్చిన కోశరక్షకుని కర్తవ్య నిర్వహణకు సంతోషించినాడు. మరునాడు యథాప్రకారంగా వచ్చిన ఆ భిక్షువుతో రాజు ఇలా అన్నాడు:

"ఓ భిక్షూ! ప్రతిరోజూ ఇంత ధన వ్యయంతో నన్ను సేవిస్తున్నావెందుకు? నీ వా విషయం తెలియ జెప్పకపోతే నే నీ ఫలాన్ని గ్రహింపను." ఆ మాటకు ఆ భిక్షువు రాజునకు ఏకాంతంలో ఇలా విన్నవించినాడు.

"వీర సహాయాపేక్షమైన మంత్రసాధన మొకటి నేను చేయవలసి ఉన్నది. నీవు ఉత్తమ వీరుడవు. ఇందులో నాకు సహాయపడవలసినదిగా కోరుతున్నాను.'' ఆ మాటకు ఆ భూపతి "అలాగే" నని అంగీకరించినాడు. అందుకు సంతోషించిన శాంతిశీలుడు తన ఇంటికి వెళ్ళిపోయినాడు.

ఆ తర్వాత కృష్ణ చతుర్దశి రాగా భిక్షువుకోరిన కోరికను జ్ఞాపకం తెచ్చుకొని, అతని ప్రార్థనను నెరవేర్చుటకై మహాసత్త్వుడైన రాజు నిశ్చయించు కున్నాడు.

సాయంకాలం నల్లని బట్టలు కట్టుకొని తమాలపుష్పశేఖ రుడై ఖడ్గం చేత ధరించి, ఎవరికీ తెలియకుండా రాజధానినుంచి బయలుదేరి శ్మశానం చేరుకున్నాడు.

అదంతా చిమ్మచీకటి కమ్మి నల్లగా ఉన్నది. అక్కడక్కడా కాష్ఠాలు ఉగ్రనేత్రాలవలె మండుతుండగా చూడడానికి దారుణంగా ఉన్నది. అనేక నరకంకాళ కపాలాస్థులతో నిండి ఉన్నది. సంబర పడుతూ గుంపులుగా చేరిన ఉన్నత బేతాళురతో పరివేష్టితమై ఉన్నది. గంభీరమూ భీషణమూ అయి భైరవుని అనురూప మువలె కానవస్తున్నది. ఎటుచూచినా నక్కల కూతలతో నిండి ఉన్నది.

ఇలాంటి ఆ శ్మశానంలోనికి నిర్భయంగా రాజు ప్రవేశించి నాడు. వెతుకుతూ పోయి ఒక మర్రి చెట్టుక్రింద ఆ భిక్షువును చూచినాడు. అతను మండల న్యాసాన్ని కావిస్తున్నాడు. అతణ్ణి సమీపించి రాజు "ఓ భిక్షూ! ఇదో నేను వచ్చాను. నన్నేం చేయ మంటావో చెప్పు?" అని అడిగినాడు.

అదివిని ఆ రాజును చూచి సంతుష్టుడైన భిక్షువు ఇలా అన్నాడు: "నా మీద అనుగ్రహం ఉంటే ఓ రాజా! నీ విచ్చటి నుండి దక్షిణాభి ముఖుడవై వెళ్ళు. కొంతదూరం వెళ్ళిన తర్వాత ఒకే ఒక అశోక వృక్షం ఒక చోట ఉంటుంది. ఆ చెట్టునకు చని పోయిన ఒక పురుషుడు వ్రేలాడు తుంటాడు. అక్కడికి వెళ్ళి ఆ శవాన్ని నీవు తీసుకొని రావలసింది. అదే నాకు నీవు చేయవలసిన సహాయం." ఆ మాటవిని సత్య సంగరుడైన ఆ రాజు అక్కడి నుంచి దక్షిణ దిశగా వెళ్ళినాడు.

ఎటు చూచినా వెలుగుతున్న కాష్ఠాగ్నులతో దారి చూచు కుంటూ ఆ చీకటిలోనే ఎలాగో ఆ అశోక వృక్షాన్ని చేరినాడు. ఆ

కొమ్మలన్నీ చితాధూమ దగ్ధాలై కమురుకంపు కొడుతున్నవి. ఆ చెట్టునకు వ్రేలాడుతున్న భూతశవం వంటి శవాన్ని చూచినాడు. ఆ చెట్టుమీదికెక్కి దానికి కట్టిన తాడును కోసివేసి, భూమి మీద పడవేసినాడు. అది పడీ పడగానే హఠాత్తుగా ఏదో బాధపడుతున్నట్టు ఆక్రందనం చేసినది. అప్పుడాయన జాలిపడి ఇంకా ప్రాణమున్న దేమో అని భావించి చెట్టుమీదినుంచి క్రిందికి దిగి, అతను తడివి చూడగా ఆ శవం అట్టహాసం చేసినది. అప్పుడాయన ఇదేదో బేతాళాధిష్ఠితమైన శవ మనుకొని నిర్భయంగా "నవ్వుతావెందుకు? పోదాం పద?" మని అన్నాడు.

ఈ మాట అనగా ఆ బేతాళావిష్టమైన శవం నేల మీద కన్పించలేదు. తిరిగీ అది చెట్టునకే వేలాడుతున్నది. అప్పుడాయన చెట్టుపైకి తిరిగీ ఎక్కి మెల్లగా క్రిందికి దించినాడు. వీరుల చిత్తం వజ్రానికంటే కఠినమైనది కదా! మౌనంగా ఆ బేతాళయుతమైన శవాన్ని తన భుజంపైన వేసుకుని ఆ త్రివిక్రమసేన మహారాజు ముందుకు కాలుచాపినాడు.

ఆయనలా వెడుతుండగా ఆయన భుజంమీద శవంలోని బేతాళుడు ఇట్లా అన్నాడు. "రాజా! పథశ్రమ తగ్గించి నీకు వినోదం కల్పించుటకై ఒక కథ చెప్తాను విను —

## 1వ కథ

మహేశ్వర నివాస భూమి అయిన వారాణసి అనే పట్టణం కలదు. కైలాసగిరిస్థలివలె పుణ్యజన సేవితమైన దా నగరం. దాని ఉపకంఠంలో మహాజల సంయుతమైన స్వర్గంగ హారయష్టివలె భాసిస్తుంది. ప్రతాపవహ్నితో ప్రతిపక్ష కుల కాననాలను

అక్కడ బాగా తాగి పడిపోయి ఉన్న రాజకుమారి జఘనంపై శూలంతో వాతవేసి ఆమె ఆభరణాలను తీసుకొని తిరిగి స్నేహితునివద్దకు వచ్చివేసినాడు.

ఆ ఆభరణాల నన్నింటినీ చూపి జరిగినదంతా చెప్పినాడు. అప్పుడు మంత్రి పుత్రుడు ఇక తన కోరిక నెరవేరినట్టే అని భావించినాడు.

మరునాటి ఉదయమే శ్మశానానికి వెళ్ళి బైరాగివేషం వేసుకున్నాడు. రాజపుత్రుని కేమో శిష్యుని వేషం వేసినాడు. "ఈ ముత్యాలహారాన్ని తీసుకొని వెళ్ళి విపణివీథిలో అమ్మకానికి చూపెట్టు. దీనివెల చాలా ఎక్కువగా చెప్పు. అంత డబ్బు ఎవరూ పెట్టలేనంతగా చెబుతూ బజారంతా తిరుగు. ఎవరైనా చూచి ఇది నీ కెక్కడిది అని అడిగితే మా గురువుగారు దీనిని అమ్ముకొని రమ్మని నా కిచ్చినని జంకూ గొంకూ లేకుండా చెప్పు. అప్పుడు పురరక్షకులు పట్టుకుంటే ఆ మాటే చెప్పు'' అని అతను పంపగా రాజకుమారుడు ఆ ముత్యాల హారాన్ని అందరికి కనబడే టట్టు పట్టుకొని బజారంతా తిరుగుతున్నాడు.

అతనిని పుర రక్షకభటులు చూచినారు. దంతఘాటుని కుమార్తె సొమ్ములు పోయినవని ఫిర్యాదు రాగా దొంగలకై వెదుకుతున్నవారు, అతనిని వెంటనే నగరాధ్యక్షుని సమీపానికి తీసుకొని పోయినారు. సన్యాసి ఆకారంలో ఉన్న అతనిని చూచి బుజ్జగింపుగా అతను ప్రశ్నించినాడు.

"అయ్యా! ఈ ముక్తావళిని ఎక్కడినుంచి కొనివచ్చినారు? రాత్రే దంతఘాటక కన్యనుంచి దీని నెవరో దొంగిలించినారు."

ఆమె కూడా పుష్పాది హస్త్యైక సంకేత సఖీయుతురాలై బయటికి వెళ్ళి ఆ దగ్గరలోనే ఉద్యాన వనంలోనికి ప్రవేశించినది. అక్కడ ఒక వృక్షానికి వ్రేలాడుతున్న తన కాముకుని చూచినది. సంకేతాన్ని అనుసరించి బయలుదేరినవానిని నగరరక్షకులు దొంగగా భావించి గొంతుకు ఉరివేసి వేలాడదీసినారు.

అంతట ఆమె విహ్వలురాలై విభ్రాంతురాలై "హా! హతాస్మి!" అని ఆక్రోశిస్తూ, విలపిస్తూ నేలపై పడిపోయినది.

ఆ తర్వాత ఆ చెట్టుమీదినుంచి ప్రాణాలుపోయిన తన కాముకుని క్రిందికి దింపి కూర్చుండబెట్టి గంధం పూసి పూలతో అలంకరించినది. నిశ్చేష్టుడుగా ఉన్న అతనిని, రాగంతో, శోకంతో అంధమనస్కురాలుగా ఉన్న ఆమె ఆలింగనం చేసుకున్నది. అతని ముఖాన్ని పైకెత్తి ఆర్తురాలై చుంబించినది. ఈలోగా ఆ నిర్జీవుడైన పరపురుషునిలో బేతాళుడు ప్రవేశించి ఆమె ముక్కును కొరికి వేసినాడు.

అందుతో విహ్వలురాలై వ్యథా భరితురాలై ఒకవేళ అతను బ్రతుకుతాడేమోనని తిరిగీ వచ్చి చూచినది. బేతాళుడు వెళ్ళిపోయినందువల్ల నిశ్చేష్టంగా మృతుడై పడిఉన్న వానిని చూచినది. అందుతో భయభ్రాంతురాలై అవమానంతో ఏడుస్తూ సంచలించి పోయినది.

ఇంతలో ఆ ప్రక్కనే దాగిఉన్న దొంగ ఈ వ్యవహారమంతా చూచినాడు. ఈ పాపిష్ఠురాలు ఇలా చేస్తున్న దేమిటి? స్త్రీల అంతర్యం భీషణమైనది, తిమిరాంధమైనది కదా! కనబడకుండా ఆకులూ అలములూ కప్పిన కూపంవలె అగాధమై వచ్చువారు పడిపోవుటకు కారణమౌతుంది కదా! ఇప్పుడేం చేస్తుందో చూడాలి"

అని అనుకుంటూ కుతూహలంతో దూరంనుంచే ఆ చోరుడు ఆమెను అనుసరించినాడు.

ఆమె తిరిగి వెళ్ళి భర్త పడుకుని నిద్రపోతున్న గదిలోనికి ప్రవేశించినది. లోనికి వెళ్ళీ వెళ్ళగానే గట్టిగా ఆక్రోశించడం మొదలుపెట్టినది. "రక్షించండి. రక్షించండి. ఈ దుష్టుడు భర్త రూపంలో నున్న శత్రువు. నిర్దోషురాలైన నా ముక్కును కొరికి వేసినాడు." ఈ మాట పదే పదే గట్టిగా అంటుండగా విన్నవా రందరూ మేల్కొన్నారు. లేచి తండ్రి, పరిజనులందరూ అక్కడికి చేరినారు. తన కూతురు ముక్కు అప్పుడప్పుడే తెగి ఉండడం చూచి ఆమె తండ్రి కోపంతో భార్యాద్రోహి ఇత డని ఆ మగనిని బంధించి వేసినాడు. వారు మేల్కొన్నప్పటికీ మూగవానివలె ఏమీ ఉలుకూ పలుకూ లేకుండా ఉండి పోయినాడు. వారందరూ అక్కడే ఈ విపర్యయాన్ని గురించి చెప్పుకుంటూ వింటూ ఉన్నారు. ఇదంతా ఆ చోరుడు తెలుసుకుని మెల్లగా పక్కకు తప్పుకున్నాడు. ఆ కోలాహల మంతా అణగి క్రమంగా తెల్లవారి పోయినది.

ఆ వర్తకుడు తన అల్లుడైన వణిక్కుమారునితో పాటూ, ముక్కుతెగిన తన కూతురితో పాటూ రాజసన్నిధికి వెళ్ళినాడు. ఇతను తన కుమార్తెకు ద్రోహం చేసెనని రాజునకు విన్నవించు కున్నాడు. మిగత వారి మాటలన్నీ వినకుండా ఆ వర్తకకుమారుని వధించ వలసిందని ఆజ్ఞాపించినాడు. వానిని తప్పెటలు మోగిస్తూ వధ్యభూమికి కొనిపోతుండగా అక్కడికి ఆ దొంగవచ్చి రాజపురు షులతో అన్నాడు:

"నిష్కారణంగా ఇతనిని వధించనున్నారు. ఈ జరిగిన వృత్తాంతమంతా నాకు పూర్తిగా తెలుసును. నన్ను రాజు సన్నిధికి తీసుకొని పొండి: సర్వమూ ఆయనకు నివేదిస్తాను.

అతనలా అనగా ఆ రాజపురుషుడు అతనిని రాజు దగ్గరకు కొనిపోయినారు. అభయాన్ని కోరి ఆ చోరుడు రాత్రి జరిగిన వృత్తాంతాన్ని ఆమూలాగ్రం ఆయనకు వినిపించినాడు. "దేవా! నామాటల మీద మీకు నమ్మకంలేక పోతే ఆమె ముక్కు ఇప్పటికీ ఆ శవం నోటిలో ఉన్నది. వెళ్ళి చూడవచ్చును" అని కూడా అన్నాడు.

ఆ మాటవిని అదేదో చూచి రమ్మని భృత్యులను పంపించి అది నిజమేనని తెలుసుకున్నాడు. వెంటనే ఆ రాజు వర్తక కుమారునికి విధించిన శిక్షరద్దు చేసినాడు. ఆ దుష్టురాలిని చెవులు కూడా కోసి దేశం నుంచి బహిష్కరించినాడు. అత్తమామల ఆస్తిపాస్తు లన్నింటినీ స్వాధీనం చేసుకున్నాడు. చోరుని విషయంలో సంతుష్టిచెంది ఆ భూపతి వానిని పురాధ్యక్షుని చేసినాడు."

ఈ విధంగా స్త్రీలు సహజంగా వక్రమార్గానువర్తినులు. శఠలు.

—ఇట్లా శుకరూపంలో నున్న చిత్రరథు డనే గంధర్వుడు ఇంద్రశాపం తీరిపోగా దివ్యరూపంతో స్వర్గానికి వెళ్ళిపోయినాడు. ఆ శారిక కూడా అప్పుడే తిలోత్తమగా మారిపోయినది. ఆమె శాపం కూడా తీరిపోయినది గనుక వెంటనే స్వర్గానికి వెళ్ళినాడు.

వారి వివాదం సభలో నిర్ణీతం కాలేదు" అని చెప్పి తిరిగీ ఆ బేతాళుడు రాజుతో ఇలా అన్నాడు:

"నీ విప్పుడు పురుషులు పాపాత్ములా? కాక స్త్రీలా? నిర్ణయించి చెప్పవలసింది. తెలిసీ చెప్పక పోయావో నీ తల వేయి వ్రక్కలౌతుంది.

ఈ మాటవిని భూపతి "యోగేశ్వరా! స్త్రీలు పాపులే! ఒకప్పుడు ఎవరో ఒక పురుషుడు దురాచారుడు ఉండవచ్చును. తరచూ అన్నిచోట్లా సర్వదా స్త్రీలలో అలాంటివారే ఎక్కువ" అని ఆ రాజు చెప్పగా అతని భుజం నుండి బేతాళుడు దిగి మాయమై పోయినాడు. ఆ రాజు తిరిగీ అతనిని కొని వచ్చే ప్రయత్నం చేసినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
దశమ తరంగం.

# ఏకాదశ తరంగం

తిరిగి త్రివిక్రమసేన మహారాజు శ్మశానంలోని ఆ అశోక వృక్షం దగ్గరకు రాత్రి వెళ్ళినాడు. మనుష్య శరీరంలో ప్రవేశించి అట్టహాసంచేస్తున్న బేతాళుని పట్టుకొని నిర్భయంగా తన భుజంపై వేసుకొని మౌనంగా అక్కడినుంచి బయలుదేరినాడు.

అలావెడుతున్న ఆయనతో బేతాళుడు తిరిగి ఇట్లన్నాడు: "ఓ రాజా! ఈ పాడుభిక్షువు కోసం నీవు శ్రమ పడడం దేనికి? నిష్ఫలంగా ఆయాస పడడంలో నీ కేమాత్రం వివేక మున్నట్టు కన బడదు. ఈ కథ నీకు దారిలో వినోదం కలిగించడానికి చెప్తాను విను.

## 4వ కథ

భూలోకంలో శోభావతి అను అన్వర్థ నామం కల పట్టణ మొకటి కలదు. అక్కడ అవక్ర పరాక్రముడైన శూద్రకు డనే భూపతి కలడు. శత్రుస్త్రీలు విసరుతున్న చామర మారుతంతో విజయి అయిన అతని ప్రతాపాగ్ని నిత్యం జ్వలిస్తూ ఉంటుంది. ధర్మం నాలుగు పాదాలమీద నడుస్తుండగా వసుంధర ఆయన పాలనలో రామాదులను కూడా విస్మరించినది.

ఒకానొకప్పుడు ఆ పరాక్రమశాలి అయిన రాజును సేవిం చుటకై మాళవదేశం నుంచి ఒకానొక వీరవరుడైన విప్రుడు వచ్చి నాడు. ఆయన భార్య పేరు ధర్మవతి. పుత్రుడు సత్త్వవరుడు. కన్యవీరవతి. ఇదీ వారి కుటుంబం. సేవాపరిచ్ఛదంలో మరొక మూడున్నవి. బొడ్డులో దోపిన బాకు, చేతిలో కత్తి మరొక చేతిలో డాలు. ఆ పరివారంతో ఉన్న తాను సేవించడానికి ప్రతిరోజు అయిదు వందల దీనారాలను జీవనానికి ఇవ్వవలసిందిగా

ఆ రాజును ప్రార్థించినాడు. రాజుకూడా అతని ఆకారం సూచిస్తున్న ఉదార పౌరుషాన్ని కనిపెట్టి అతను కోరిన రీతిగా ఇవ్వడానికి అంగీకరించినాడు.

"ఇతనికున్న పరివారం ఇంతచిన్నదే, ఇన్ని స్వర్ణరూప్యాలనేం చేసుకుంటాడు? దీనిని ఏదో వ్యసనానికి ఉపయోగిస్తున్నాడా? లేక సద్వినియోగం చేస్తున్నాడా?'' – అనేది తెలుసుకోడానికై కుతూహలంతో మహీపతి అతనికి తెలియకుండా కనిపెట్టవలసిందని ప్రచ్ఛన్న చారులను నియోగించినాడు.

ఆ వీరవరుడు ప్రాతఃకాలంలోనే వచ్చి రాజదర్శనం చేసుకుంటాడు. మధ్యాహ్నం వరకు సింహద్వారంలో ఖడ్గపాణి అయి నిలబడి ఉంటాడు. చేతికివచ్చిన దీనారాలను ఇంటికి తీసుకొని పోయి భోజనార్థమై తన భార్య చేతిలో ప్రతిరోజూ నూరుదీనారాలు పెడుతుంటాడు. వస్త్రాంగరాగ తాంబూలాదులను ఒక నూరు దీనారాలతో కొంటాడు. స్నానం చేసి హరిహర పూజార్థమై మరొక నూరు దీనారాలను ఖర్చుపెడతాడు. మరొక రెండు వందల దీనారాలను బ్రాహ్మలకూ, దీనులకూ దానం చేస్తాడు. ఈ విధంగా ప్రతిరోజూ ఆ ఐదు వందల దీనారాలను విభజిస్తుంటాడు.

ఆ తర్వాత అగ్నికార్యాదులను నిర్వర్తించుకుని భోజనం చేసి రాత్రి ఏకాకిగా సింహద్వారం వద్ద చేతిలో కత్తి పట్టుకుని నిలుచుంటాడు.

ఈ విధంగా నడుస్తున్న ఆ వీరవరుని దినచర్యను రాజు చారులద్వారా విని మనసులో ఎంతో సంతోషించినాడు. ఆ తర్వాత అతనిని అనుసరించి కనిపెడుతూ వస్తున్న చారులను తొలగించి వేసినాడు. అతను ఉత్తమ పురుషుడని, విశేష గౌరవార్హుడని భావించినాడు.

ఇలా కొన్నిరోజులు గడువగా గ్రీష్మ ర్తువు వచ్చి నిప్పులు చెరగిపోయినది. ఆ తర్వాత దానిమీద ఈర్ష్యతోవలె విద్యుత్కర వాలాన్ని పట్టుకుని ధారాప్రహారం చేస్తూ గర్జిస్తూ వర్షర్తువు వచ్చి నది. అప్పుడు విపరీతంగా మేఘాలు ఆవరించి రాత్రింబవళ్ళూ వాన కురియగా సింహద్వారంలో కదలకుండా నిశ్చలుడై నిలబడి ఉన్నాడు.

అతనిని పగలంతా అలా ఉండడం రాజు చూచినాడు. కుతూహలం కొద్దీ రాత్రికూడా ప్రాసాదం పై కెక్కి చూచినాడు. అత నలాగే ఉన్నాడు. "ఎవ రా సింహద్వారం దగ్గర ఉన్నది?" అని కేకవేసినాడు.

ఆ మాటవిని "నేనే ఇక్కడ ఉన్నది?" అని వీరవరుడు అన్నాడు. "ఆహా! ఎంత దృఢసత్త్వుడు? నామీద ఈ వీరవరు నికి ఎంతభక్తి? ఇతనికి తప్పకుండా గొప్ప పదవిని ఇవ్వాలి" అని ఆలోచించి ఆ రాజు ప్రాసాదంనుంచి దిగివచ్చి అంతఃపురంలో పడుకున్నాడు.

మరునాడు కుండపోతగా వాన కురుస్తున్నది. సాయం కాలం భవనాలన్నీ కనిపించకుండా చీకటి క్రమ్ముకున్నది. తిరిగీ ఆ రాజు జిజ్ఞాసతో ప్రాసాదంపై నెక్కి "సింహద్వారంలో ఏకాకిగా ఉన్నవా రెవ్వరు?" అని ప్రశ్నించినాడు. "నేనే" అని వీర వరుడు తిరిగీ జవా బిచ్చినాడు.

అతని ధైర్యాన్ని చూచి ఆ రాజు ఆశ్చర్యపడుతుండగా దూరంనుంచి ఒక స్త్రీ రోదనం వినిపించినది. విషాద వికలమైన స్వరంతో అతి కరుణంగా ఆమె ఎవరో విలపిస్తున్నది.

ఆ తర్వాత వీరవరుడు సత్త్వవరుని ఎత్తుకుని బయలుదేరినాడు. ధర్మవతి కూడా తన కూతురు వీరవతిని తీసుకొని బయలుదేరినది. ఆ రాత్రే వారిరువురూ చండికాలయం చేరుకున్నారు. శూద్రక మహారాజుకూడా ప్రచ్ఛన్నంగా వారివెంటనే బయలుదేరినాడు. అక్కడ దేవి సన్నిధిలో తన కుమారుని వీరవరుడు దించినాడు. ధైర్యరాశి అయిన సత్త్వవరుడు దేవికి నమస్కరించి ఇలా విన్నవించుకున్నాడు:

"నా తలను బలి ఇవ్వడంతో శూద్రక మహారాజు జీవించుగాక! నిష్కంటకంగా మరొక నూరేళ్ళు భూమిని పాలించుగాక!" అని పలుకుతున్న కొడుకును చూచి తన కరవాలంతో వాని తలను దేవికి ఉపహారం చేసినాడు. "నా కుమారుని బలితో రాజు జీవించుగాక!" అన్నాడు.

అప్పుడు ఆకాశవాణి ఇలా వినపడినది: "సాధుః వీరవరా! సాధు! నీకంటే స్వామిభక్తి పరాయణుడు మరొకడెవడున్నాడు. ఉన్న ఒక్క కొడుకును రాజుకోసం బలిచేసినావు. ఆ విధంగా నీ ప్రభువు శూద్రకునకు ఆయుస్సును, రాజ్యాన్ని కూడా దానం చేసినావు."

ఈ సర్వవృత్తాంతాన్నీ ఆ రాజు దాగి వింటుండగా చూస్తుండగా, ఆ వీరవరాత్మజ కన్య వీరవతి దగ్గరగా వచ్చి హతుడైన తన అన్న తలను మూర్కొని మహాదుఃఖంతో విలపిస్తూ గుండె పగిలి చనిపోయినది.

అప్పుడు వీరవరునితో భార్య ధర్మవతి ఇట్లన్నది: "నీవు రాజు శ్రేయస్సునకు చేయవలసిన దంతా చేసినావు. ఇప్పుడు నేను చెప్పేది విను: "ఏమీ ఎరుగని మన కుమార్తె భ్రాతృ

# చతుర్దశ తరంగం

తిరిగీ త్రివిక్రమసేన మహారాజు అశోకవృక్షం వద్దకువెళ్ళి బేతాళుని భుజాన వేసుకుని బయలుదేరినాడు. దారిలో బేతాళుడు ఇట్లా అన్నాడు :

"ఓ రాజా! నీ శ్రమాపనోదనార్థం నేనొక కథ చెప్తాను విను :

## 7వ కథ

పూర్వం తూర్పుసముద్రం ఒడ్డున తామ్రలిప్తి అనే నగరం కలదు. ఆ పట్టణంలో చండసేనుడు అను పేరుగల రాజు కలడు. అతను పరస్త్రీల విషయంలో పరాఙ్ముఖుడే కానీ సంగ్రామభూమిలో కాదు. శత్రుసంపదలను అపహరించేవాడే కానీ పరద్రవ్యాపహారి కాదు. అతనివద్ద కొకసారి దాక్షిణాత్యుడైన రాజపుత్రు డొకడు వచ్చినాడు. అతను జనప్రియుడు. సత్త్వశీలు డని పేరు. సింహద్వారం వద్ద రాజును దర్శించుకున్నాడు. తన్ను తాను పరిచయం చేసుకుని దారిద్ర్యం వల్ల ఆ రాజు ఎడల సేవాబుద్ధి పాటించినాడు. అతనితో పాటూ కొందరు రాజపుత్రులు కూడా ఉన్నారు.

అక్కడ కార్పటికుడై చాలా ఏళ్ళు రాజును సేవించుకున్నాడు. కానీ అతనివల్ల ప్రతిఫలం పొందలేదు. రాజాన్వయంలో జన్మించినా ఈ నిర్ధనత్వ మేమిటి? నిర్ధనుడనైనా నా కోరికను విధి ఇలా చేస్తున్నా డేమిటి? ఈ రాజు నా పోషణకై ఎన్నాళ్ళనుంచి సేవిస్తున్నా, ఆకలితో మాడుతున్నా నా సంగతే పట్టించుకోడు దీనికి?" ఇలా ఆలోచించుకుంటుండగానే ఒకసారి

రాజు తనకు సింహళరాజు కూతురిని ఇవ్వవలసిందిగా సందేశ మిచ్చి వానిని సింహళ ద్వీపానికి పంపించినాడు.

అత నంతట ఇష్టదేవతలను అర్చించి సముద్రమార్గంలో వెళ్ళడానికై రాజు పంపిన బ్రాహ్మణులతో పాటూ ఒక నౌకను ఆరోహించినాడు. ఆ నౌక నిశ్శంకంగా సముద్ర మధ్యంలోనికి వెళ్ళగా ఆశ్చర్యకరంగా సముద్రంలోనుంచి ఒక ధ్వజం పైకి లేచినది. అది ఆకసా న్నంటుతూ జాంబూనద వినిర్మితమై విచిత్ర వర్ణవిచలద్వైజయంతి అయి ప్రకాశిస్తున్నది. ఆ సమయంలోనే గబగబా మబ్బులు క్రమ్ముకొని కుండపోతగా వర్షం కురియ సాగి నది. అతి వేగంగా గాలి వీచసాగినది. ఆ గాలివానతో బలంగా ఆకర్షితమై ఆ ధ్వజస్తంభానికి ఆ నౌకాధ్వజం ఆకృష్టమైనది. అంతట గాలితో ఆ ధ్వజం ఆ సముద్రంలో నౌకతో పాటూ మునిగి పోసాగినది.

అంతట బ్రాహ్మలు తమరాజైన చంద్రసింహుని భయా కులులై అనరాని మాటలు అనసాగినారు. ఆ మాటలు విని సహింపలేక స్వామిభక్తి కలవాడు గనుక సత్త్వశీలుడు చేత బాకు నిడుకొని ఉత్తరీయం కట్టుకుని నిరపేక్షుడై మహోదధి లోనికి దుమికినాడు. ఆ జలధి చేసిన పనికి ప్రతీకారాపేక్షతో ఆ వీరుడా విధంగా దుమికినాడు. అతను మునిగిపోగానే ఆ పడవ గాలికి అలలకూ తట్టుకొనలేక అతి దూరంగా కొనిపోబడి మునిగిపోయి నది. అందలి బ్రాహ్మలు సముద్రంలో పడిపోయినారు.

అంతట సముద్రంలో మునిగిన సత్త్వశీలుడు కళ్ళు తెరచి చూడగా అక్కడ వారిధి కన్పించలేదు. దివ్య నగర మొకటి కనుల పడినది. అక్కడ మణిమయ స్తంభాలతో భాసురమైన

ఆ మాటవిని తన యావద్వృత్తాంతాన్ని సత్త్వశీలుడు ఆ నృపాలునకు తెలియజేసినాడు. "అయ్యో! వీరుడైనప్పటికీ నా పుణ్యం వల్ల కామవంచితుడైనాడు. ఇతని ఋణం తీర్చుకోవడానికి నా కిప్పుడు అవకాశం కలిగింది" అని మనసులో ఆ రాజు అనుకుంటూ అతనితో ఇట్లన్నాడు: "వృథాగా శోకింపవద్దు. ఆమె వద్దకు నిన్ను చేరుస్తాను. అదేమార్గంలోనే నిన్నా ప్రియురాలి వద్దకు కొని పోతాను—" అని స్నానపానాదులతో ఆ రాజు అతనిని ఓదార్చినాడు.

మరునాడు మంత్రులకు రాజ్యాన్ని అప్పగించి అతనితో పాటూ ఆ రాజు నౌక నధిరోహించి అతను చూపిన దారిలో సముద్ర ప్రయాణం సాగించినాడు. మధ్యభాగంలోనుంచి వెళ్ళేసరికి పూర్వం వలెనే పతాకంతో కూడిన ధ్వజం పైకి లేచినది. సత్త్వశీలుడు దానిని రాజునకు చూపించినాడు.

ఈ మహాధ్వజం దివ్యప్రభావసంపన్నమైనది. నేను మునుగగానే తాము ఈ మహాధ్వజాన్ని అనుసరించవలసింది" అని ఆ ధ్వజం దగ్గరకు వెళ్ళుసరికి మార్గంలోనే సత్త్వశీలుడు పూర్వం వలెనే సముద్రంలోనికి దుమికినాడు. రాజుకూడా అక్కడే తానుకూడా నీటిలో మునిగినాడు.

ఆ విధంగా లోనికి మునిగిన వారిద్దరూ త్వరలోనే ఆ దివ్య పట్టణాన్ని చేరుకున్నారు. అక్కడ ఆశ్చర్యపడుతూ రాజు ఆ పార్వతీదేవికి ప్రణమిల్లి సత్త్వశీలునితో పాటూ అక్కడ కూర్చున్నాడు.

ఆ మండలకం లోనుంచి సఖీజన పరివృత అయి రూపుగొన్న కాంతివంటి ఒక కన్య బయటికి వచ్చినది. ఆ సుముఖి

రాజు నామె కూర్చుండ బెట్టినది. యథోచితంగా అర్ఘ్యపాద్యాదు లను తెప్పించి దైత్యరాజసుత ఇట్లన్నది.

"మహాత్ముడైన కాలనేమి అనే అసురరాజు కూతును నేను. మా తండ్రి చక్రాయుధంతో స్వర్గతిని పొందినాడు. ఈ రెండు పట్టణాలూ మా తండ్రికి చెందినవి. విశ్వకర్మ నిర్మించినవి. ఇక్కడి వారికి జరామరణాదులులేవు. సర్వకామ ప్రదమైన దిది. ఇప్పుడు నీవు నాకు తండ్రివి. ఈ పట్టణాలతో పాటూ నేను నీకు వశమైనాను అని ఆత్మ సర్వస్వాన్నీ అర్పించుకున్న ఆమెతో రాజు ఇట్లన్నాడు.

"నీవు నా కుమార్తెవే అయినట్టయితే వీరుడూ మిత్రుడు బాంధవుడు అయిన ఈ సత్త్వశీలునకు నిన్నర్పిస్తున్నాను." ఈ విధంగా మూర్తీభవించిన దేవీ ప్రసాదంవంటి రాజు చెప్పగా గుణ జ్ఞురాలు, వినీతురాలు అయిన ఆమె అందు కంగీకరించినది.

అంతట ఆమెను పాణిగ్రహణం చేసి ఇచ్చి అసుర కులై శ్వర్యాన్నంతటినీ ఇచ్చి సత్త్వశీలునితో ఆ రా జిట్లన్నాడు: "నీ వద్దనుంచి తీసుకొని రెండు ఉసిరిక కాయలను తిన్నాను. ఆత్మ సంశోధన చేసుకొని నేను నీకు ఋణపడినట్టు గ్రహించినాను" అని ప్రణతుడైన అతనితో చెప్పి దైత్యపుత్రిని ఉద్దేశించి ఇట్లన్నాడు:

"నేను నా పట్టణం వెళ్ళడానికి మార్గాన్ని చూపించవల సింది." అంతట అపరాజిత అనే ఖడ్గాన్నీ, భక్ష్యాన్నీ, ఫలాన్నీ, జరామృత్యు హరమైన దానిని ఆయనకు ఆ దైత్యకన్యక సమ ర్పించినది. అంతట వాటితో పాటూ ఆమె చూపిన దారిలో మునిగి తిరిగీ స్వదేశానికి చేరుకుని క్రమంగా ఆ భూపాలుడు సర్వ సంసిద్ధ కాముడు అయినాడు. సత్త్వశీలుడేమో దైత్య స్త్రీ రాజ్యాన్ని పాలించసాగినాడు.

సముద్రపతనంలో ఆ ఇద్దరూ సత్త్వాధికులే! వారిలో అధికు డెవ్వడు?" అని బేతాళుడు ప్రశ్నింపగా పాపభీతితో త్రివిక్రమ సేనుడు అతని కిలా జవా బిచ్చినాడు.

"నా దృష్టిలో సత్త్వశీలుడే సత్త్వాధికుడు. అందలి విశేష మేమో తెలియకనే అతను నిరాస్థుడై సముద్రంలో మునిగినాడు. రాజేమో ఆ సంగతినంతా తెలుసుకొని ఏదో ఆశతో సముద్రంలో మునిగినాడు. ఆ దైత్యకన్య అందుబాటులోది కాదని ఆశించ లేదు."

ఈ జవాబును విని, ఆ విధంగా భూపతి మౌనభంగం కాగా అతని భుజంమీది నుండి కిందికి దిగి పూర్వం వలెనే బేతాళుడు అశోకవృక్షం చేరుకున్నాడు.

రాజుకూడా అదే విధంగానే తిరిగి అతనిని కొనివచ్చుటకై గబగబా బయలు దేరినాడు. ప్రారంభించినపని సమాప్తం కాన ప్పుడు ధీరులు తమ ప్రయత్నాన్ని వదలి వేస్తారా?

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీలంబకంలోని
చతుర్దశ తరంగం.

# పంచదశ తరంగం

త్రివిక్రమసేన భూపాలుడు అశోకవృక్షం వద్దకు తిరిగి వెళ్ళి బేతాళుని తన భుజం మీద వేసుకొని బయలుదేరినాడు.

అలా వెడుతున్న మహారాజుతో బేతాళుడు తిరిగి ఇట్లన్నాడు. "శ్రమను మరచి పోవడానికై రాజా! నేనొక కథను చెప్పి ప్రశ్న వేస్తాను విను:

## 8 వ కథ

అంగదేశంలో వృక్షఘటం అను పేరుగల ఒక పెద్ద అగ్రహారం ఉన్నది. విష్ణుస్వామి అనే బ్రాహ్మణ సోమయాజి మహా ధనవంతుడు అక్కడ కలడు. ఆయనకు అనురూపవతి అయిన భార్యకలదు. ఆ దంపతులకు క్రమంగా తరుణులైన ముగ్గురు కుమారులు కలిగినారు. వారు దివ్య నైపుణ్యశాలురు. తండ్రి పంపగా ఒకప్పుడు యజ్ఞంకోసమై ఒక తాబేటిని తేవడానికై ఆ ముగ్గు రన్నదమ్ములూ సముద్రానికి వెళ్ళినారు.

ఒక తాబేటిని పట్టుకున్న తర్వాత అందులో పెద్దవాడు చిన్నవారితో ఇట్లన్నాడు: "తండ్రిగారి యజ్ఞార్థమై దీనిని మీలో ఎవరో ఒకరు ఎత్తుకొనండి. నేనొకణ్ణే దీనిని మోయలేకున్నాను. ఆ మాట అన్న అన్నతో ఆ తమ్ము లిట్లన్నారు:

"ఇందులో నీవు వెనుకా ముందు ఆడుతుంటే మాకు మాత్రం ఆ విచికిత్సలేదా?"

ఆ మాట విని అన్న "దీనిని తీసుకొని వెళ్ళండి. లేకపోతే తండ్రి యజ్ఞానికి లోపం సంభవిస్తుంది. అందువల్ల మీరూ ఆయనా కూడా నరకంలో పడిపోవలసి వస్తుంది" అన్నాడు.

ఆ మాట అనగా ఆ తమ్ము లిద్దరూ నవ్వుతూ ఇట్లన్నారు:" నీకు మా ధర్మమే తెలుసు కానీ నీ ధర్మం నీకు తెలియదు."

అప్పుడా అన్న వారితో "మీకు నా సంగతి తెలియదా? నేను భోజనచంగుడను. (భోజన విషయంలో విశిష్టత కలవాడను) జుగుప్సాకరమైన దానిని స్పృశింపలేను" అన్నాడు.

ఆ మాటకు మధ్యముడు ఇట్లా అన్నాడు: "నేను నీకంటే అధిక విశిష్టత కలవాడను. నారీచంగుడను, విచక్షణ కలవాడను."

మధ్యము డా మాట అనగా పెద్దవాడు తిరిగి ఇట్లన్నాడు: "అయితే మన కంటే చిన్నవాడు దీనిని కొనిపోవు గాక."

ఆ మాట విన్న చిన్నవాడు బొమముడి వేసి "మీరు మూర్ఖులు. నేను తూలికా చంగుడను, మరింత విశిష్టత కలవాడను" అన్నాడు.

ఈ విధంగా ముగ్గురు అన్నదమ్ములూ కలహానికి దిగగా అభిమానైకగ్రస్తులై ఆ తాబేటిని వదలిపెట్టి ఈ విషయంలో తీర్పుచెప్పుటకై రాజైన ప్రసేనజిత్తు వద్దకు వెళ్ళినారు.

ఆ దగ్గరే ఉన్న విటంక పట్టణంలో అత నున్నాడు. ప్రతీహార ముఖంగా చెప్పిపంపి తమ వృత్తాంతాన్ని తెలియజేసినారు. "మీరిక్కడే ఉండండి. క్రమంగా మిమ్ములను పరీక్షిస్తాను" అని రాజు చెప్పగా వా రక్కడే ఉన్నారు.

తన భోజన సమయంలో వారిని పిలిచి అగ్రాసనాన్నిచ్చి రాజార్హమైన షడ్రసోపేతమైన భోజనాన్ని పెట్టించినాడు. వారలా తింటుండగా అందులో ఒకడు మాత్రం తినలేదు. అతనే భోజన చంగుడు. జుగుప్సతో మొహం ముడుచుకున్నాడు. "రుచిగానూ,

సువాసనతోనూ ఉన్న ఈ భోజనాన్ని నీవు భోంచేయడం లేదెందుకు?" అని రాజు స్వయంగా ప్రశ్నింపగా అతను మెల్లగా ఇట్లన్నాడు:

"బియ్యంలో శవధూమ దుర్వాసనగలదు. కాబట్టి రుచికరమైనదైనా నేను దీనిని భుజింపను."

అంతట అక్కడున్న వారందరూ రాజాజ్ఞతో దానిని వాసన చూచినారు. ఆ కలమ శాలి అన్నం దోషరహితమైనది. సుగంధ భరితమైనది అన్నారు. అయినప్పటికీ ఆ భోజనచంగుడు ముక్కుమూసుకుని తినకుండా కూర్చున్నాడు. అంతట ఆ రాజు ఆలోచించి క్రమంగా అన్వేషిస్తూరాగా ఆ యా కార్యాలలో నియుక్తులైన జనం ద్వారా ఆ ధాన్యం గ్రామశ్మశానానికి దగ్గరలోనున్న భూమిలో పండినవని తెలుసు కున్నాడు. అందుతో అతివిస్మితుడై సంతుష్టుడైన ఆ రాజు ఇట్లన్నాడు:

"సత్యమే. నీవు భోజనచంగుడవు, నీకు వేరే అన్నం పెట్టిస్తాను భోజనంచెయ్యి." ఆ విధంగా అందరి భోజనం అయిన తర్వాత వారి వారిని ఒకొక్క గదిలోనికి పంపించినాడు.

ఆ తర్వాత తన పరివారంలోని ఉత్తమ వేశ్యను పిలిపించినాడు. దానిని బాగా అలంకరించుకొమ్మని చెప్పి ఆ రెండవవాని వద్దకు పంపించినాడు. ఆ సర్వాంగసుందరి సాయంకాలం విప్రుడు నారీచంగుని వద్దకు వెళ్ళినది. రాకా నిశవలె పూర్ణేందుముఖి, కందర్పదీపిని, ప్రభాభాసితమందిర అయిన ఆమె ఇంటిలో ప్రవేశింపగా మూర్ఛవచ్చినంత పని అయి ఎడమ చేతితో ముక్కును మూసుకొని నారీచంగుడు "వెంటనే మీ రీమెను బయటికి కొని పోవలసినది" అని రాజ భృత్యులకు చెప్పినాడు. "ఆమె వెళ్ళక

పోతే నా ప్రాణం పోతుంది. ఈమెనుంచి వస్తున్న మేకల వాసనను భరించలేను'' అన్నాడు.

అప్పుడా రాజపురుషులు విస్మురాలైన ఆమెను రాజు వద్దకు కొనిపోయినారు. యావద్వృత్తాంతం తెలియజేసినారు. అప్పుడు రాజు ఆ నారీచంగుని పిలిపించి ఈ వారస్త్రీ గంధం శ్రీఖండ కర్పూర కాలాగురు మదోత్తమమైనది. ఆ మనోహర సౌరభాన్ని దిక్కులకు వెదజల్లుతూ అలంకరించుకున్నది. అలాంటి వారవిలాసిని గంధం ఛాగలం ఎలా అవుతుంది? అని రాజెంత చెప్పినా అతను వినలేదు.

అప్పుడు రాజు సుదీర్ఘంగా విచారింపజేసి యుక్తిగా ఆమె నోటనే సంగతి చెప్పించినాడు. తల్లీ దాది కూడా పోవడం వల్ల తాను చిన్నతనంలో మేకపాలతో పెరిగినదని చెప్పించినాడు. అందుతో నారీచంగుని చంగత్వాన్ని రాజు అంగీకరించినాడు.

మరి మూడవ వాడైన తూలికాచంగునకు శయ్య ఏర్పరచినాడు. ఆ పర్యంకంపై ఏడు తూలికా తల్పాలను పరిపించినాడు.

ఆ మహార్హమైన నివాసగృహంలోనికి తూలికాచంగుని పంపించినాడు. తెల్లగా చిక్కగా నేసిన వస్త్రాన్ని ఆ పరుపులపై పరిపించి అతడు దానిపై పడుకొనే ఏర్పాటు చేసినాడు. అరజాము గడవగానే ఆ రాత్రి ఆ పడక మీదనుంచి అతను లేచినాడు. చేతితో తన పార్శ్వాన్ని గట్టిగా పట్టుకొని నొప్పిపడుతూ ఆక్రందించినాడు.

అప్పుడు అక్కడున్న రాజపురుషులు అతని పార్శ్వంలో గాఢంగా ముద్రితమైన కేశముద్రను, కుటిలారుణమైన దానిని చూచినారు. వెళ్ళి ఈ సంగతిని ఆ రాజునకు తెలియజేసినారు.

అప్పుడా రాజు ఆ తూలికాతల్పం కింద ఏదైనా ఉన్నదేమో చూడమని భృత్యులకు చెప్పి పంపినాడు. వారు ఒకొక్కపరుపునే తీస్తూ చూస్తూ రాగా అన్నిటికంటే క్రిందిదానిపై ఒక కేశపాశం కన్పించినది. దానిని కొనిపోయి రాజునకు చూపించినారు. సరిగా అదేగుర్తు తూలికాచంగుని అంగంపై ఉండడం చూచి రాజు విస్మయం చెందినాడు. ఏడుపరుపులు వేసినా వాటిక్రిందనున్న ఒక వెంట్రుక అతని ఒంటికి గుచ్చుకున్నదే అని చిత్ర భూతుడైన ఆ రాజు ఆలోచిస్తూ ఆ రాత్రిని గడిపినాడు.

ఉదయమే వీరందరూ అద్భుత విదగ్ధత సౌకుమార్యమూ కలవారని ఆ ముగ్గురు నిపుణులకు ఒకొకరికి ఒకొక లక్షదీనారాలను బహూకరించినాడు.

అంతట వారు అక్కడే ఆ తాబేటి సంగతే మరచిపోయి సుఖంగా ఉన్నారు.

ఆ విధంగా తండ్రి తలపెట్టిన యజ్ఞార్థ ఫలానికి విఘ్నం కలిగించి పాతకాన్ని సంపాదించుకున్నారు.

ఈ విధంగా ఆ కథను చెప్పి భుజంపై నున్న బేతాళుడు త్రివిక్రమసేన పృథ్వీపతిని ఇట్లా ప్రశ్నించినాడు.

"ఓ రాజా! నీ పూర్వశాపాన్ని జ్ఞాపకం చేసుకో. ఈ భోజన నారీ శయ్యా చంగులలో ఎవడు అధిక నిపుణుడో చెప్పు?"

ఆ మాట విని ధీమంతుడైన మహారాజు ఈ విధంగా జవాబిచ్చినాడు:

"నేను వారిలో తూలికాచంగునే అధికునిగా భావిస్తాను. ఎందుకంటే అతని శరీరంపై కేశప్రతిబింబం ముద్రితమై ఉన్నది.

అది ప్రత్యక్ష ప్రమాణం. మిగత వారిద్దరి విషయంలో అ దెలాగో తెలుసుకొన వీలయినది'' అని అతను చెప్పగా అతని భుజంపై నుండి క్రిందికి దిగి బేతాళుడు వెళ్ళిపోయినాడు.

ఆ రాజు నిర్విచారంగా అతనిని వెదుకుతూ వెంట బయలు దేరినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
పంచదశ తరంగం.

# షోడశ తరంగం

త్రివిక్రమసేన మహారాజు తిరిగి అశోకవృక్షంనుంచి బేతాళావిష్టమైన శవాన్ని భుజాన వేసుకుని బయలుదేరగా బేతాళుడు దారిలో ఇట్లన్నాడు:

"ఓ రాజా! నీ రాజ్య మెక్కడ? ఈ శ్మశాన మెక్కడ? రాత్రిలో దీనిలో నీవు పరిభ్రమించడ మేమిటి? భూత సంకుల మైన ఈ రాత్రి భయంకరంగా లేదా? చితాధూమాలతో, పొగతో నిరుద్ధమైన ఈ శ్మశానం భీతిగొల్పుట లేదా? ఆ భిక్షుని బలవంతం వల్ల నీ కీ గ్రహచారం ఏమిటి? అయినా మార్గవినోదార్థమై ఒక ప్రశ్న వేస్తాను విను:

9వ కథ

యుగాదిలో అవంతీదేశంలో దేవనిర్మితమైన నగరం ఒకటి కలదు. అది శివుని శరీరంవలె ఉద్దామభోగిభూతి విభూషిత మైనది. పద్మావతీ, భోగవతీ, హిరణ్యవతీ అని దానికి క్రమంగా కృత, త్రేతా, ద్వాపర యుగాల్లో పేరు. కలియుగంలో ఉజ్జయిని అని అది ప్రఖ్యాతమైనది.

ఆ పట్నంలో వీరదేవుడనే భూపాలోత్తముడు కలడు. అతనికి పద్మరతి అనుపేరుగల మహారాణికలదు. ఆ రాజు ఆ రాణితో పాటూ మందాకినీ తీరానికి వెళ్ళి పుత్రకామి అయి హరుని గూర్చి తపస్సు చేయసాగినాడు.

చిరకాలం తపస్సు చేసిన తర్వాత ఈశ్వరుని మెప్పించి, స్నానార్చనాది విధులను ముగించుకున్న అతనికి అశరీరవాణి ఇలా వినిపించినది!

"ఓ రాజా! నీకు శూరుడైన ఒక పుత్రుడు జన్మించగలడు. అనన్య సామాన్య లావణ్యవతి అయిన అప్సరలను కాలదన్నగల ఒక కన్య జన్మించ గలదు."

ఆ అశరీరవాణిని విని తన అభీష్టం సిద్ధించినదని భావించి వీరదేవ నరపాలుడు తన పట్టమహిషితో పాటూ తన రాజధానికి తిరిగి వచ్చినాడు.

అతనికి మొదట శూరదేవుడనే కుమారుడు కలిగినాడు. అలాగే క్రమంగా ఒక కన్యక కలిగినది. ఆమెను చూస్తే అనంగునికి కూడా తన రూపంతో రతిని కల్పింపగలదు. అందువల్లనే తండ్రి ఆమెకు అనంగరతి అని పేరు పెట్టినాడు.

ఆ అమ్మాయి పెరిగి పెద్ద కాగా తగిన వరుని కోసమై భూలోకంలోని రాజుల చిత్రపటాల నన్నింటినీ రాయించి తెప్పించుకున్నాడు. వారిలో ఏ ఒక్కడూ ఆమెకు సదృశులుగా లేరు. ఆమె మీది ప్రేమతో ఆ రాజు ఇట్లన్నాడు:

"కుమారీ! నీకు తుల్యుడైన వరుని నేను చూడలేకున్నాను. అందువల్ల రాజుల నందరినీ పిలిపించి స్వయంవరం ఏర్పాటు చేస్తాను."

ఈ మాట విని ఆ అనంగరతి తన తండ్రితో ఇట్లా అన్నది: "నాన్నా! స్వయంవరం ఏర్పాటుకు నే నుత్సాహపడడం లేదు. అయితే ఒక అపూర్వమైన విజ్ఞానం కలిగి రూపవంతుడైన యువకుడైతే చాలు. అతనికి నన్ను ఇచ్చి వివాహం చేయవలసింది.

అంతకంటే అధికుని కోసమై వెదక నవసరం లేదు." ఈ విధంగా తన కుమార్తె అనంగరతి చెప్పగా విని అలాంటి వరుని కోసమై అన్వేషించసాగినాడు.

ఈ సంగతి జనం ద్వారా తెలుసుకున్న వీరులు, విజ్ఞానులు, భవ్యులు అయిన నలుగురు పురుషులు దక్షిణాదినుంచి వచ్చినారు. వారిని రాజు సత్కరించగా ఆయనకు తమతమ విజ్ఞాన విశేషాలను ఎరిగించి రాజపుత్రికను ఇవ్వవలసిందిగా కోరినారు. అందులో ఒక డిలా అన్నాడు :

"నేను శూద్రుడను. నా పేరు పంచపట్టికుడు. ప్రతిరోజూ నేను ఉత్తమమైన ఐదుజతల బట్టలను తయారుచేస్తాను. వానిలో ఒక దానిని దేవునికి సమర్పిస్తాను. మరొక దానిని బ్రాహ్మడికి దానం చేస్తాను. ఒకదానిని నా కోసం ఉంచుకుంటాను. ఆమె నావద్ద ఉంటే నాభార్య కొకటి ఇస్తాను. ఇంకొక దానిని విక్రయించి అన్న పానాదులకు ఏర్పాటు చేసుకుంటాను. ఈ విధంగా విజ్ఞాని అయిన నాకు అనంగరతిని ఇవ్వవలసినది."

రెండవ పురుషుడు ఇట్లా అన్నాడు: నేను వైశ్యుడను, నేను భాషావేత్తను. సర్వ మృగ పక్షిరుతము లన్నిటినీ అర్థం చేసు కుంటాను. కాబట్టి నాకు రాజపుత్రిక నివ్వవలసింది."

అత నలా చెప్పగా మూడవవా డిలా అన్నాడు: "నేను క్షత్రియుడను. బాహుబలశాలిని. నా పేరు ఖడ్గధరుడు. ఖడ్గవిద్యా విజ్ఞానంలో నాకు సరివచ్చే మరొక వీరుడు భూలోకంలో లేడు, కాబట్టి ఆమెను నాకు ఇవ్వవలసింది"

మూడవవా డిలా అనగా నాల్గవవా డిట్లా అన్నాడు: "నేను బ్రాహ్మడను. నా పేరు జీవదత్తుడు. నాకున్న విజ్ఞాన విశేష మిది. చనిపోయిన జంతువులను కూడా కొనివచ్చి వానిని ప్రాణంతో చూపించగలను. ఈ వీరచర్యాసిద్ధిని చూచి నన్ను మీ కుమార్తెకు పతినిగా చేయవలసింది."

ఈ విధంగా చెప్తున్న వారి నలువురనూ చూచి వారి దివ్య వేషాకృతులను పరికించి వీరదేవుడు కూతురితో పాటూ డోలాయమాన మానసుడైనాడు.

—అని చెప్పి బేతాళుడు పూర్వశాపాన్ని కూడా జ్ఞాపకం చేసి ఆ నలువురిలో ఆ రాజు తన కన్య అనంగరతిని ఎవరి కివ్వవలెనో చెప్పవలసింది — తెలిసి చెప్పకపోతివా నీ తల వేయి వ్రక్కలౌతుంది—అన్నాడు.

ఆ మాటవిని రాజు బేతాళునికి ఇలా జవాబిచ్చినాడు: "కాలక్షేపం కావలెనని నా మౌనాన్ని భంగపరచడానికి బహుశా నీ వీ కథలు చెప్తున్నా వనుకుంటాను. కాకపోతే ఈ ప్రశ్నలో ఉన్న జటిలత ఏమిటి? శూద్రునకు క్షత్రియకన్య నెలా ఇస్తారు? వైశ్యునకుమాత్రం ఎలా ఇస్తారు? మృగాది భాషావిజ్ఞానం ఏ విధంగా పనికివస్తుంది? బ్రాహ్మడు స్వధర్మచ్యుతుడై ఇంద్రజాలి అయి తన్ను వీరు డనుకుంటున్నాడు. అతడు పతితుడు కాబట్టి సమానుడైన క్షత్రియునకే ఇవ్వాలి. ఆ ఖడ్గధరుడు స్వవిద్యా వీరశాలి''

అని ఈ విధంగా రాజు మౌనం వదలి చెప్పగా విని పూర్వం లాగే బేతాళుడు యోగబలంతో అతని భుజంమీదినుంచి జారి స్వస్థానానికి వెళ్ళిపోయినాడు.

భూపాలుడు కూడా మునుపటిలాగే అతనిని కొనివచ్చుటకై బయలుదేరినాడు. ఉత్సాహైక ఘనమైన వీరహృదయం ఇంకొక ఇబ్బందిని లెక్కపెట్టదు కదా!

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
షోడశ తరంగం.

# సప్తదశ తరంగం

త్రివిక్రమసేనుడు అశోకవృక్షం దగ్గరకు వెళ్ళి తిరిగి బేతాళుని పట్టుకొని భుజంమీద వేసుకుని బయలుదేరినాడు. అలా వెడుతున్న అతనితో బేతాళుడు ఇలా అన్నాడు: "ఓ రాజా, బాగా అలసిపోయినట్టున్నావు. అలత తీర్చే కథ నొకటి చెప్తాను విను.

## 10వ కథ

సకలరాజ మస్తకన్యస్త శాసనుడైన వీరబాహు అనే పేరు గల పార్థివసత్తముడు కలడు. ఆయన ఉత్తమ నగరం పేరు అనంగపురం. అక్కడ అర్థదత్తుడు అను పేరుగల మహాధనవంతుడైన సార్థవాహుడు కలడు. అతనికి ధనదత్తుడు అను పేరుగల కుమారుడు, మదనసేన అను పేరుగల కుమార్తె కలరు. వారిని, ఒకసారి సఖీజనంతో పాటూ తమ ఉద్యానవనంలో క్రీడిస్తుండగా వణిక్కుమారుని స్నేహితుడు ధర్మదత్తాఖ్యుడు చూచినాడు.

లావణ్యరస నిర్భర నిర్ఝరి అయిన ఆమెను చూచి ఆలక్ష్య కుచ కుంభాగ్ర, వళిత్రయ తరంగిత అయి యౌవనగజానికి క్రీడా మజ్జన వాపికవలె ఉన్నదామె. వెంటనే అతను మన్మథ బాణ సంతాపహృత చిత్తుడైనాడు. ధారాధిరూఢమైన రూపంతో వెలుగొంది పోతున్న ఈమెను మన్మథుడు నా మనసును భేదించుటకై బల్లెంలా తయారుచేసినట్టున్నది. ఇలాంటి మాటలు అనుకుంటూ ఆమెనుగూర్చి చిరకాలం వర్ణిస్తూ వచ్చినాడు.

ఇంతలో సాయం కాలం కావచ్చినది. అంతట మదన సేన తన గృహాంతరం లోనికి వెళ్ళి పోయినది. ఆమెను చూడలేక పోతినే అన్న వ్యథ ధర్మదత్తుని చిత్తంలో ప్రవేశించినది.

దానిని చూచి కలిగిన ఆ దుఃఖాగ్నితో సంతప్తుడై కాలి ఎఱ్ఱవారి సూర్యుడు అపరాంబుధిలో పడిపోయినాడు.

ఆ రాత్రి ఆమె అభ్యంతర గృహంలోనికి ప్రవేశించినట్లు గ్రహించి, ఆమె ముఖాబ్జంతో నిర్జితుడైన చంద్రుడు మెల్లగా ఉదయించినాడు.

అంతలో ధర్మదత్తుడు ఇంటిలోనికి వెళ్ళి చంద్రపాద హతుడై దొరలాడుతూ పడక పట్టినాడు. మిత్రులు, బంధువులు అలా ఉండుటకు కారణ మేమని ప్రశ్నిస్తూ ఎంత ప్రయత్నించినప్పటికీ మన్మథగ్రహ విమోహితుడైన అతను ఏమీ చెప్పలేదు.

ఆ రాత్రి ఎలాగో చాలాసేపటికి నిద్రపట్టగా కలలో ఆ కన్యను అనునయిస్తూ ఉత్కంఠతో అత నేమేమి చేసెనో ఊహించలేము. ఉదయమే మేల్కొని వెళ్ళి రహస్యంగా, ప్రియుని ప్రతీక్షిస్తున్న ఆమెను ఉద్యానంలో చూచినాడు. దగ్గరకువెళ్ళి ప్రేమ పేశలమైన మాటలతో పరిష్వంగలాలసుడై, చరణానతుడై ఆమెను పలుకరించినాడు.

"నేను కన్యను, పరదారను. నీ విలా ప్రవర్తించడం తగదు. సముద్రదత్తుడనే మహావర్తకునకు మా తండ్రి నన్నివ్వడానికి నిశ్చయించినాడు. నా వివాహం కొన్ని రోజులలోనే జరుగనున్నది. కాబట్టి ఇప్పుడు నీవు వెళ్ళిపోవడం మంచిది. ఎవరైనా చూస్తే చెడుగు జరుగ వచ్చును"

అని ఆమె చెప్పగా ధర్మదత్తుడు ఆమెతో ఇట్లన్నాడు: "అదే నిజమై నీవు లేకపోతే నేను జీవించడం అసంభవం." ఆ మాటవిని ఆ వణిక్కన్య ఇతనేం బలాత్కారం చేస్తాడో నని భయపడుతూ "నా వివాహం కానీ; మా తండ్రికి కన్యాదాన ఫలం

దక్కనీ: ఆయన చిరకాంక్షితం తీరనీ. ఆ తర్వాత ప్రణయార్జిత అయిన నేను నిశ్చయంగా నీ దగ్గరకు వస్తాను" అన్నది.

ఈ మాట విని అత నిలా అన్నాడు: "పూర్వమే మరొకరికి ప్రియురాలైన కన్య నాకిష్టంలేదు. పూర్వభుక్తమైన కమలంపై భృంగానికి ఇష్టం కలుగుతుందా?" అని అతను చెప్పగా అప్పు డామె ఇట్లన్నది:

"అలా అయితే వివాహం ముందు పూర్తికానీ. ముందు నీ దగ్గరకే వస్తాను. ఆ తర్వాత నా పతిని చేరుకుంటాను" అని ఆమె చెప్పినప్పటికీ నమ్మకం లేనందువల్ల అతను వదలలేదు.

అప్పుడు వణిక్పుత్రుడు శపథం చేయించి సత్యవాక్కులతో ఆమెను బంధించినాడు. ఆ తర్వాత వదలి వేయగా విషణ్ణురాలై ఆమె తన ఇంటికి వెళ్ళిపోయినది.

లగ్న దివసం రాగానే వివాహ మంగళ కార్యం నిర్వర్తించి ఆ రోజే ఉత్సవంతో పతి గృహానికి చేరుకున్నది. ఆ రాత్రి పడక టింటిలోనికి వెళ్ళి ఆ పతితో ఉన్నది. పడకలో పడుకున్నదేకానీ సముద్ర దత్తుని పరిష్వంగ సుఖాన్ని పొందలేదు. అతను ఓదార్చి నప్పటికీ ఆమె కన్నీరు కార్చినది. అతను "ఈమెకు నాపై ఇష్ట మున్నట్టు లేదు. ఇది నిజం" అని మనసులో అనుకున్నాడు.

అప్పు డామెతో అత నిట్లన్నాడు: "నా మీద నీకు ఇష్టం లేకుంటే ఓ సుందరీ! నీవు నాకు అక్కరలేదు. నీకు ప్రియు డెవరో అతని దగ్గరకే వెళ్ళు."

ఆ మాట విని తలవంచుకుని మెల్లగా ఆమె ఇట్లన్నది: "నీవు నాకు ప్రాణాధికుడవు. ప్రియుడవు. అయితే నా విన్నపాన్ని

వినవలసింది. సంతోషంగా ఇక్కడ ఉండమని నా కభయాన్నివ్వు. అలా శపథం చేస్తే నేను చెప్తాను విను."

ఆయన అందుకు సరే ననగా ఆమె సిగ్గుతోనూ, విషాదం తోనూ, భయంతోనూ కళవళ పడుతూ ఇట్లన్నది:

"ఒంటరిగా మా ఇంటి ఉపవనంలో ఉండగా ఒకప్పుడు ఒక యువకుడు నన్ను చూచినాడు, మా అన్న స్నేహితు డతను. ధర్మదత్తుడని పేరు. కామాతురుడై నన్ను అడ్డగించినాడు. మా తండ్రి కన్యాదాన ఫలాన్ని రక్షించుకొనవలెనని చెప్పి ఆ హఠం చేస్తున్న అతని నోరు మూయించినాను. వివాహమైన తర్వాత అతని దగ్గరకు వస్తా నన్నాను. ఇప్పుడు నామాట నిలబెట్టుకోవలసి ఉన్నది. నన్ను మన్నించండి. ఒక నిముషంలో అక్కడికి వెళ్ళి తిరిగి వస్తాను. చిన్నతనం నుంచీ కాపాడుకుంటూ వస్తున్న సత్యాన్ని అతిక్రమించలేను."

ఇలా ఆమె అనగా వజ్రపాతంతోవలె ఆ మాటతో హతుడై సముద్రదత్తుడు సత్యబద్ధుడై ఓక్షణం ఈ విధంగా ఆలోచించు కున్నాడు:

"ఆహా! ఈమె అన్యానురక్తురాలు. అక్కడికి వెళ్ళడం తప్పదు. ఆ సత్యం నన్ను చంపక వదలదు. ఈమె పరిణయా గ్రహం ఏమవుతుం దప్పుడు?" అని ఆలోచించుకొని ఆమె ఇష్టం వచ్చినట్టు వెళ్ళవచ్చునని అన్నాడు.

ఆమె అంతట లేచి మగని ఇంటినుంచి బయలుదేరినది. ఇంతలో చంద్రుడు ఉదయాద్రి శిఖరాన్ని అధిరోహించినాడు. తన కరాక్రమణవల్ల ప్రాక్దిగంగనను చిరునవ్వు నవ్వించినాడు.

అంతట అద్రి గుహాంతరాలను చీకటులు క్రమ్ముకున్నవి. కుముదాకరం అలలతో నిండి పోయినది. ఆ దారిలో ఒంటరిగా రాత్రి వెడుతున్న మదనసేనను చూచి ఒకానొక దొంగ ఆమె చీర కొంగును పట్టి లాగినాడు.

"నీ వెవరవు? ఎక్కడికి వెడుతున్నావు?'' అని వాడు గద్దింపగా భయపడుతూ ఆమె ఇట్లన్నది. అదంతా నీకెందుకు! నాకేదో పని ఉన్నది. వదలిపెట్టు.''

అప్పుడా దొంగ "నేను దొంగను. ఊరికే ఎలా వదలి పెడతాను?'' అన్నాడు.

ఆ మాట విని ఆమె "అయితే నా ఆభరణాలు తీసుకో'' అన్నది.

అప్పుడా చోరుడు "ఈ రాళ్ళతో నాకేం పని? చంద్రకాంత ముఖివి. గరుడ రత్ననీల శిరోరుహవు. వజ్రమధ్యవు. సువర్ణాంగివి. పద్మరాగాంఘ్రిహారిణివి. జగదాభరణవు అయిన నిన్ను నే నెలా వదలి పెడతాను?'' అలా ఆ దొంగ అనే సరికి వివశురాలైన వణిక్కుమారిక నిజవృత్తాంతా న్నంతటినీ చెప్పి ఈ విధంగా వానిని ప్రార్థించినది.

"ఒక క్షణం నన్ను మన్నించు. సత్యానుపాలనం చేసి ఇక్కడే నీ వుండగానే తిరిగి త్వరగా వస్తాను. ఈ నా సత్యవాక్యాన్ని నే నెప్పుడు ఉల్లంఘించను'' అన్నది.

ఇందుతో ఆమె సత్యసంధురాలని గ్రహించి ఆ దొంగ ఆమెను వదలి పెట్టినాడు. ఆమె తిరిగి రావడం కోసం నిరీక్షిస్తూ అక్కడే ఉన్నాడు.

ఆమె ధర్మదత్తుని దగ్గరకు వెళ్ళినది. అతను కూడా తన అభీష్టం నెరవేరి ఆమె వచ్చినప్పటికీ, విజనప్రదేశంలో ఉన్న ప్పటికీ చూచి చూచి జరిగినదంతా ఆలోచించుకుని ఇట్లన్నాడు:

"నీ సత్యవాక్పరిపాలనతో నేను సంతుష్టుడనైనాను. నీవు పరస్త్రీవి. నీతో నాకేమి పని? ఇక ఎవరూ చూడకుండా త్వరగా ఇంటికి వెళ్ళు" అని ఆమెను వదలిపెట్టగా 'సరే' నని ఆమె మరలి దొంగ దగ్గరకు వచ్చినది.

దారిలోనే ఆమెకై కాచుకొని ఉన్న అతను నీవు వెళ్ళిన చోట ఏమి జరిగినదో చెప్పమని అడిగినాడు. అప్పుడా వర్తక కుమారుడు తన నెట్లా వదలిపెట్టినదీ చెప్పినది. అంతట ఆ దొంగ "ఇదే ఇలా జరిగి ఉంటే నేను కూడా అలాగే చేస్తాను సత్య వాక్కుతో సంతోషించినాను గనుక నీ ఆభరణా లన్నింటితో నీ ఇంటికి నీవు వెళ్ళిపో." ఈ విధంగా ఆమెను, రక్షణకై ఒక అను చరుని ఇచ్చి పంపగా శీలం కోల్పోకుండా సంతుష్టురాలై పతి గృహా నికి వచ్చినది.

అక్కడ లోనికి గుప్తంగా ప్రవేశించి సంతోషంతో మగనిని సమీపించి జరిగిన దంతా వర్ణించి చెప్పినది. ఆమె మొహంలో ఏ మాత్రం రంగులు మారకపోవడం, సంభోగలక్షణా లేవీ ఆమెపై లేకపోవడం అతను కూడా ఆమె గౌరవనీయురాలుగా, శీలం కోల్పోనిదానిగా, సత్యలాభరతి కలదానినిగా, సతిగా భావించి అదృష్టమనస్కుడై భార్య నభినందించి సముద్రదత్తుడు ఆమెతో యథాసుఖ మున్నాడు.''

అని ఈ కదను శ్మశానభూమిలో బేతాళుడు త్రివిక్రమసేన మహారాజునకు చెప్పినాడు. ఇలా ప్రశ్నించినాడు.

"దొంగ, ఆ వర్తకుడు వీ రిద్దరిమధ్యా ఎవరు త్యాగశీలి? తెలిసీ చెప్పకపోతివో నీ తల వేయి వ్రక్కలౌతుంది."

ఆ మాటవిన్న మహీపతి మౌనం వదలి ఆ బేతాళునితో ఇట్లన్నాడు: "వారందరిలో ఆ వర్తకు లిద్దరికంటే చోరుడే గొప్ప త్యాగి. పెళ్ళి చేసుకున్నప్పటికినీ ఆమెను మగడు పంపించినాడంటే అతను కులజుడు. భార్య అన్యాసక్త అని తెలిసీ ఎలా ఉంచుకుంటాడు.

ఇక రెండవ వర్తకుని సంగతా? కాలక్రమేణా అతని ఆ వేగం తగ్గిపోయి ఉంటుంది. పైగా భయపడి ఉంటాడు. ఆమె భర్త ఉదయం రాజుగారికి ఫిర్యాదు చేయవచ్చునని కూడా భావించి ఉంటాడు.

కానీ దొంగ గుప్తంగా చరించేవాడు, నిరపేక్షుడు, పాప కర్ముడు. అలాంటివాడు తనకు చిక్కిన ఆభరణయుతురాలైన స్త్రీరత్నాన్ని వదలివేసినాడంటే అతడు గొప్ప త్యాగి అయి ఉండాలి.

ఈ మాట వినీ వినగానే బేతాళుడు తన పూర్వ స్థానానికి వెళ్ళిపోయినాడు. రాజు అతనిని తిరిగి పట్టుకొనుటకై అఖండితోద్దామధైర్యుడై బయలుదేరినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
సప్తదశ తరంగం.

# అష్టాదశ తరంగం

ఆ మహీపాలుడు తిరిగి అశోకవృక్షం వద్దకు వెళ్ళి బేతాళుని భుజంమీద వేసుకుని బయలు దేరినాడు. నడుస్తున్న రాజుతో అతని భుజం పైనున్న బేతాళుడు ఇట్లా అన్నాడు:

"ఓ రాజా! ఒక విచిత్రమైన కథను చెప్తాను విను:

## 11వ కథ

పూర్వం ఉజ్జయినిలో ధర్మధ్వజుడను రాజు కలడు. అతనికి ముగ్గురు భార్యలు: రాజపుత్రికలు, అతిప్రియలు కలరు. అందులో ఒకామె పేరు ఇందులేఖ. రెండవ ఆమె తారావతి. మూడవ ఆమె పేరు మృగాంకవతి. వారంతా అసామాన్యమైన రూపమూ గుణమూ కలవారు. ఆ రాజు అనేక శత్రురాజులను జయించి ఆ రాణులతో విహరిస్తూ సుఖంగా ఉన్నాడు.

ఒకసారి వసంతోత్సవం రాగా ఆ ముగ్గురు ప్రియురాండ్రతో కలిసి ఉద్యానానికి క్రీడార్థమై వెళ్ళినాడు. అక్కడ భృంగ మాలా మౌర్వీకములై పుష్పానతములైన లతలు వసంతునితో సజ్జితాలైన మన్మథుని చాపయష్టుల వలె ఉన్నవి.

ఆ చెట్ల మీదనుండి కోకిల కలకూజితాలను మన్మథుని సంభోగ రసాజ్ఞల వలె వింటూ అంతఃపుర వనితలతో పాటూ ఆ రాజు ఇంద్రసముడై కందర్పజీవితానికి కూడా జీవితమైన పానంతో మత్తుడైనాడు. ఆ నిట్టూర్పుల సువాసనలు వారి బింబోష్ఠ రుచులు కలిగి వారు త్రావి వదలి వేసిన మధురసములను త్రావుతూ ఆయన ఆనందించినాడు.

అక్కడ ఆ ఇందులేఖ కేళీకచగ్రహంవల్ల ఆమె చెవిలోని కలువ ఒకటి ఆమె ఒడిలో పడినది. ఆమె ఊరు పృష్ఠంపై ఆ దెబ్బతో గాయం కాగా అభిజాత్యంగల ఆ మహాదేవి హాహాకారం చేస్తూ మూర్ఛిల్లినది.

అది చూచి వికలుడైన రాజు ఆర్తితో పరిజనులు ఓదార్చు తుండగా చల్లని గాలి తాకున ఆమె మెల్లగా కనులు తెరచినది.

తర్వాత రాజు రాజధానికి కొనిపోయి వైద్యులు తయారు చేసిన దివ్య ముక్తా వ్రణ పట్టికతో ప్రియురాలిని ఉపచరించి నాడు. ఆ రాత్రి ఆమె కొంత సుఖంగా ఉండగా, రెండవ రాణి తారావళితో కలిసి ఆ రాజు చంద్రప్రాసాదం పైనికి అధిరోహించి నాడు.

అక్కడ ఆమె తన ఒడిలో పడుకొని నిద్రపోగా, మంచు బొట్లు గవాక్షద్వారాల నుంచీ వచ్చి, బట్టలు తొలగిపోయిన ఆమె ఒడలిపై పడినవి. ఒక నిముషంలో మేల్కొని అయ్యో! కాలి పోతున్నానంటూ, తన ఒళ్ళంతా తుడుచుకుంటూ గబాలున ఆమె ఒడిలోనుంచి లేచినది.

అంతట ఏమిటి? దని మేల్కొన్న రాజు సంభ్రాంతుడై చూచినాడు. లేచి చూడగా ఆమె ఒడలిపై బొబ్బలు తేలి ఉన్నవి.

ఆ రాజు రాణిని అడుగగా తారావళి ఇట్లన్నవి: బట్ట తొలగిపోయిన నా శరీరంపై చంద్రకిరణాలుపడి ఈ పని చేసినవి" అని ఆమె ఏడుస్తుండగా ఆ రాజు పరిజనులను పిలిచినాడు. వారు విహ్వలాకులురై పరువెత్తుకుంటూ వచ్చినారు. వారు నీరు చల్లిన తామరాకులతో పడకను తయారుచేసి శరీరానికి శ్రీకంఠాంగ విలే పనం చేసినారు.

ఇది తెలిసి మూడవ ప్రియురాలైన మృగాంకవతి అక్కడికి రాదలచి తన మందిరం నుంచి బయలు దేరినది. వస్తుండగా నిశ్శబ్దంగా నున్న ఆ రాత్రిలో ఏ ఇంటిలోనుంచో ధాన్యం దంచుతున్న రోకండ్ల శబ్దం దూరంనుంచి వినవచ్చినది. అది వినీ వినగానే 'హతాస్మి' అంటూ చేతులను విదిలించు కుంటూ వ్యథాక్రాంతురాలై ఆమె దారిలోనే కూర్చున్నది.

అంతట పరిజనులు వెనుకకు మరలించి తమ అంతఃపురానికే కొని పోగా విలపిస్తూ పడకపై పడిపోయినది. అక్కడ ఆమె కన్నీరు విడుస్తూ చూస్తున్న పరిజనులకు తుమ్మెదలు వాలిన పద్మాలవలె కాయలు కాచిన ఆమె చేతులు కనిపించినవి.

వారు రాజు దగ్గరకు వెళ్ళి చెప్పగా విహ్వలుడై వచ్చి ఆ ధర్మధ్వజుడు ఇ దేమిటని ప్రియురాలిని అడిగినాడు. తన చేతులను చూపిస్తూ జబ్బు పడిన ఆమె ఎక్కడి నుంచో వినవచ్చిన రోకండ్ల శబ్దంతో తన చేతులపై ఈ కాయలు కాచినవని చెప్పినది. ఆ రాజు ఆశ్చర్యపడి దాహశమనార్థమై ఆమె చేతులకు చందనాది లేపనాలను చేయించినాడు.

అప్పుడు ఈ అద్భుత విషయ పరంపరను గూర్చి రాజిలా తలపోసుకున్నాడు. "ఒకామెకేమో కలువ పువ్వు పడగానే గాయమైనది. రెండవ ఆమె శరీరం చంద్రకిరణాలతోనే కాలిపోయినది. ఈమెకేమో రోకండ్ల శబ్దం విన్నంత మాత్రాననే చేతులపై ఇలా కాయలుకాచినవి. ఇదేమిటి? ఒకేసారి నా ఈ ప్రియురాండ్రందరకూ గుణసూచకాలైనప్పటికీ విధివశాత్తూ ఇలాంటి కష్టాలు కలిగినవేమిటి?" అని చింతిస్తూ అంతఃపురమంతటా తిరుగుతూ ఆ రాజు త్రియామము (రాత్రి) శతయామమువలె అతికష్టం మీద గడిపినాడు.

ఉదయమే వైద్యులను, శస్త్రచికిత్సకులను పిలిపించి వారికి చికిత్సచేసి త్వరలో వారి రుగ్మతలకు నివృత్తి కల్పించినాడు.

— ఈ అద్భుత కథను బేతాళుడు రాజునకు చెప్పి భుజం పైనుండి ఆ బేతాళు డిలా ప్రశ్నించినాడు. ఈ ఆభిజాత్యం కల రాణులలో ఎవ రెక్కువ? తెలిసీ చెప్పక పోతే నీ తల వేయి వ్రక్క లౌతుంది."

అది విని ఆ రాజు సుకుమారతరు రాలు ఎవరో చెప్తాను విను: "రోకలిని తాకక పోయినా దాని శబ్దంతోనే చేతులు కాయలు కాచిన ఆమె సుకుమారతరురాలు. కలువతాకిడితోనూ, చంద్రకిరణాల స్పర్శతోనూ వ్రణ విస్ఫోటాలు కలిగిన మిగతా ఇద్దరూ ఆమెతో సమానలు కారు" అని చెప్పగా విని ఆ బేతాళుడు భుజం మీదినుంచి దిగి తన తావునకు వెళ్ళిపోయినాడు.

ఆ రాజుకూడా అలాగే దృఢ నిశ్చయంతో అతని కోసమై వెనువెంటనే బయలుదేరినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
అష్టాదశ తరంగం.

# పంతొమ్మిదో తరంగం

త్రివిక్రమసేన మహారాజు అశోక వృక్షం వద్దకు వెళ్ళి బేతాళుని తీసి భుజాన వేసుకుని బయలుదేరినాడు. పూర్వం వలెనే అతను మౌనంగా నడుస్తుండగా బేతాళుడు తిరిగి ఇట్లన్నాడు :

"ఓ రాజా : ఏ మాత్రం కలవరపాటు లేకుండా ఈ పని చేస్తుండడంవల్ల నీవు నాకు ప్రియుడవైనావు. మార్గాయాసం కనిపించకుండా హృద్యమైన ఒక కథను చెప్తాను విను :

## 12 వ కథ

పూర్వం అంగదేశంలో యశఃకేతు డను రాజు కలడు. అతడు తన శరీరాన్ని దాచుకొనుటకై భూలోకానికి దిగివచ్చి కాలిపోకుండా ఉన్న అపర మన్మథునివలె ఉన్నాడు. బాహువీర్యంతో అనేక వైరి రాజులను జయించిన దీర్ఘదర్శి అను మంత్రి ఇంద్రునకు బృహస్పతివలె ఆయనవద్ద ఉన్నాడు.

ఆ మంత్రిపై నిష్కంటకమైన తన రాజ్యభారాన్ని ఉంచి వయోరూప మదంవల్ల ఆ రాజు మెలమెల్లగా సుఖైకరతుడైనాడు. అతను అంతఃపురంలోనే ఎక్కువ కాలం గడుపుతూ, ప్రమదాస్పదమైన ఆస్థానంలో రక్తిగీతాలను వింటూవచ్చినాడు : కానీ హితైషుల వాక్యాలను వినేవాడు కాడు. జాల వాతాయనం నుంచి చూస్తూ నిశ్చింతగా హాయి చెందుతున్నాడు కానీ రాజకార్యాలలోని బహుచ్ఛిద్రాలను ఒకసారికూడా చూడడం లేదు.

ఆ రాజ్య చింతాభారాన్నంతటినీ మంత్రి దీర్ఘదర్శి మాత్రమే మోస్తున్నాడు. రాత్రింబవళ్ళూ అప్రమత్తంగా రాజు పేరు ఉపయోగించుకుంటూ ఆయన వ్యసనాలలో మునిగిపోగా, మంత్రి

దీర్ఘదర్శి ప్రస్తుతం రాజ్యశ్రీని అనుభవిస్తున్నాడు" అని జన ప్రవాదం దేశమంతటా వ్యాపించినది.

అప్పుడు తన గృహిణి అయిన మేధావిని అనే ఆమెతో దీర్ఘదర్శి ఇట్లన్నాడు: "ఇష్టుడైన రాజు సుఖాసక్తుడు కాగా నేనా రాజ్యభారాన్ని వహిస్తున్నాను. అయినప్పటికీ రాజ్యసుఖాన్ని నేనే అనుభవిస్తున్నట్టుగా అపఖ్యాతి జనంలో వ్యాపించినది. ఆ లోకాపవాదం మిథ్యఅయినప్పటికీ పెద్దవారి కది చెరుపు చేస్తుంది. జనప్రవాదాన్ని బట్టేరాముడు జానకిని వదలివేయలేదా? కాబట్టి నే నిప్పుడేం చేయాలి?"

ఈ విధంగా మంత్రిప్రశ్నింపగా ఆయన భార్య ధీరహృదయ మేధావిని అనే అన్వర్థనామధేయం కల ఆమె ఆయనతో ఇట్లన్నది: "తీర్థయాత్ర అనే పేరుతో యుక్తిగా ఎలాగో రాజుతో సెలవు తీసుకొని కొంతకాలం మీరు విదేశాలకు వెళ్ళడం మంచిది. అలా నీవు నిస్పృహుడవైతే లోకాపవాదం అణగారి పోతుంది. నీవులేనప్పుడు రాజ్యాన్ని రాజెలాగూ స్వయంగా చూసుకుంటాడు. అపుడు మెలమెల్లగా ఈ వ్యసనాలవల్ల హానిపొందుతాడు. తిరిగీ నీవు వచ్చినపుడు మంత్రిత్వం నీకు యథాప్రకారం దొరుకుతుంది. ఈ చెడుపేరూ పోతుంది." ఈ విధంగా భార్య చెప్పగా ఆ దీర్ఘదర్శి సరేనని కథాప్రసంగంలో ఆ రాజైన యశఃకేతునితో ఇలా విన్నవించుకున్నాడు:

"కొన్నిరోజులైనా నేనలా తీర్థయాత్రలు వెళ్ళిరావడానికి అనుమతించండి. ఆ విధంగా ధర్మాన్ని నిర్వర్తించ దలచుకున్నాను."

ఆ మాటకు రాజన్నాడు కదా "తీర్థయాత్రలు వినా దానాదులతో ధర్మ నిర్వహణం చేయవచ్చును గదా! నీ ఇంటిలోనే ఉండి స్వర్గాన్ని లభింప జేసుకో వచ్చును గదా!"

ఆ మాటకు మంత్రి, ఆయన చెప్పినమాటలో చిత్తశుద్ధి ఉన్న ప్పటికీ "దానాదులలో కంటే నిత్య సిద్ధాలైన తీర్థాలలో ధర్మాన్ని అన్వేషించడం మంచిది. యౌవనం ఉన్నంత వరకే ధీమంతుడు తీర్థాలకు వెళ్ళాలి. నమ్మడానికి వీలులేని ఈ శరీరాన్ని చూసుకొని తీర్థాల సంగతి ఎప్పుడో చూతా మనుకోవడం మంచిది కాదు" అన్నాడు. ఈ విధంగా రాజుతో అంటుండగా ఆయనేమో వద్దని ఏదో అడ్డు చెప్తుండగా అంతలోనే ప్రతీహారివచ్చి రాజుతో ఇలా విన్నవించుకున్నాడు:

"దేవా! సూర్యుడు ఆకాశ సరోవర మధ్యంలో మునుగు తున్నాడు. కాబట్టి మీకు స్నానవేళ అయినది. కొలువు చాలించి లేవండి." ఈ మాట విని వెంటనే స్నానం చేయడానికి రాజు బయలుదేరినాడు.

యాత్రోన్ముఖుడైన మంత్రికూడా ఆయనకు నమస్కరించి ఇంటికి వెళ్ళిపోయినాడు. భార్యకూడా తనతో వస్తాననగా ఆమెను వారించి, ఇంటనే ఉంచి యుక్తితో తన భృత్యులు కూడా అనుమా నించకుండా బయలుదేరినాడు.

ఏకాకిగా ఆయా దేశాలలో పర్యటిస్తూ తీర్థాలలో మునుగుతూ అతను పుండ్రదేశాన్ని దృఢనిశ్చయుడై చేరుకున్నాడు. ఆ పట్టణం సముద్రానికి దగ్గరగా ఉంటుంది. అక్కడ శైవ దేవా లయంలోనికి వెళ్ళి కూర్చున్నాడు. ఆ దేవుని అర్చించుటకై వచ్చిన ఒక వర్తకుడు నిధిదత్తుడను వాడు, ఎండలో నడచివచ్చి క్లాంతుడై, దూరంనుంచి నడచివచ్చినందువల్ల ధూసరితుడై ఉన్న ఆ మంత్రిని చూచినాడు.

ఉపవీతంతో నుండి సులక్షణుడైన ఆయన అలా అలసి పోయి ఉండడం చూచి, సంభావించి ఉత్తమ విప్రుడుగా నెంచి

అతిథి సత్కారం చేయడానికై తన ఇంటికి పిలుచుకొని పోయి నాడు. అక్కడ అతనిని సత్కరించి ఉత్తమస్నాన భోజనాదులతో సంతృప్తిపరచి విశ్రాంతి తీసుకున్న అతనిని "నీవెవ్వరవు? ఎక్కడికి వెడుతున్నావు?" అని ప్రశ్నించినాడు.

"అయ్యా! నేను అంగదేశం నుంచి వస్తున్నాను. నేను బ్రాహ్మడను. దీర్ఘదర్శి నా పేరు. తీర్థయాత్రార్థమై ఇలా దేశా టనం చేస్తున్నాను" అని గంభీరంగా అతనితో అన్నాడు.

అంతట నిధిదత్తుడనే ఆ మహావర్తకుడు ఆయనతో ఇట్ల న్నాడు: "వాణిజ్యార్థమై నేను సువర్ణద్వీపానికి వెళ్ళే ప్రయ త్నంలో ఉన్నాను. నీవు ఇక్కడే మా ఇంటిలో నేను వచ్చేదాకా ఉండు. ఇంతవరకూ చేసిన తీర్థయాత్రలవల్ల పరిశ్రాంతుడవై ఉన్నావు. నేను వచ్చేదాకా విశ్రాంతి తీసుకొన వలసింది."

ఆ మాట విని దీర్ఘదర్శి ఇట్లన్నాడు: "అలా అయితే నాకి క్కడేం పని? నీతోకూడానే వస్తాను. హాయిగా కాలం గడుపుతాను."

ఆ మాటకు ఆ సాధువు అతని ఇంటిలో చిరకాలానికి ఆ రాత్రి హాయిగా నిద్రపోయినాడు. మరునాడు ఆ వర్తకునితో పాటూ సముద్రం దగ్గరకు వెళ్ళి భాండపూర్ణమైన నౌకను ఆరోహించి బయలుదేరినాడు.

ఆ నౌకలో పోతూ అద్భుత భీషణమైన అబ్ధిని దాటుతూ అక్కడి విశేషాలను చూస్తూ క్రమంగా స్వర్ణద్వీపాన్ని చేరుకున్నాడు. "నా ముఖ్యమంత్రిత్వమెక్కడ? ఈ నౌకతో సముద్రాన్ని దాటడ మెక్కడ?. అపఖ్యాతికి భయపడే సాధువులు ఎందుకైనా సిద్ధ పడుతారు కదా!"

ఆ ద్వీపంలో ఆ వర్తకునితో పాటూ కొంతకాలం ఉన్నాడు. అతనేమో బేరసారాలు చూచుకుంటున్నాడు. తిరిగి వస్తూ ఆ నౌకలో ఆ వర్తకునితో పాటూ ప్రయాణం చేస్తూ సముద్రతరంగం వెనుకగా పైకి వచ్చిన కల్పవృక్షాన్ని చూచినాడు. ప్రవాళ శాఖాసుభగములు, సువర్ణోజ్జ్వలములు అయిన స్కంధములతో, మణిమయములైన ఫలములతో, మనోహరాలైన కుసుమాలతో శోభిల్లుతున్న దా వృక్షం. దాని స్కంధాంతరంలో రత్నపర్యంకం పై పడుకొని ఉన్న అద్భుతాకార రమణీయ అయిన కన్యను చూచినాడు.

"ఇదేమిటి? ఆశ్చర్యం" అని అనుకుంటుండగానే వీణ పట్టుకుని ఉన్న ఆమె ఇలా గానం చేయసాగినది:

"యత్కర్మ బీజముప్తం యేన పురా నిశ్చితం స తద్ భుంక్తే,
పూర్వకృతస్య హి శక్యో విధినాపి న కర్తు మన్యథాభావః."

"ఏ కర్మబీజాన్ని పూర్వం నాటుతాడో దాని ఫలాన్నే అతడు అనుభవిస్తాడు. పురాకృతాన్ని మరొక విధంగా మార్చడానికి విధికి కూడా సాధ్యం కాదు"

—అన్న అర్థంగల గేయాన్ని గానం చేస్తూ ఆ జలధిలో ఆ దివ్యకన్యక కల్పద్రుమ పర్యంక శయ్యలతో పాటూ అక్కడే మునిగిపోయినది.

ఇదేమిటి? అపూర్వమైన అద్భుతాన్ని నేనిక్కడ చూచాను కదా! ఆ జలధి ఎక్కడ? కనిపించీ కానరాకుండా పోయిన గానం చేస్తున్న దివ్యాంగన ఎక్కడ? ఒకవేళ ఇలాంటివానికి ఈసముద్రం ఆకరమా? లక్ష్మీందు పారిజాతాదులు సముద్రంలోనుంచి పుట్టినవే కదా!" అని ఈ విధంగా ఆలోచించుకుంటున్న ఆ దీర్ఘదర్శిని చూచి విస్మయావిష్టులైన కర్ణధారుడు మొదలైనవారు ఇట్లన్నారు:

"అయ్యా! ఈ వరకన్యక సర్వదా ఈ చోట కనబడుతూనే ఉంటుంది. అప్పుడే మునిగిపోతుంది. మీ కిది కొత్తగా వచ్చును" అని అంటున్న వారితో పాటూ, మంత్రి దిగ్భ్రాంతుడై నౌకమీద సముద్రతీరాన్ని చేరుకున్నాడు.

అక్కడ భాండాన్ని క్రిందికి దింపించి ఆ వర్తకునితో పాటూ భృత్యులు సంతోషిస్తుండగా అత నింటికి వెళ్ళినాడు. అక్కడ కొంతకాలం ఉండగానే నిధిదత్తునితో ఇట్లా అన్నాడు: "సత్త్వవంతుడా! మీ ఇంటిలో నేను చాలాకాలం విశ్రాంతి తీసుకుంటూ సుఖంగా ఉన్నాను. ఇక స్వదేశానికి వెళ్ళదలచుకున్నాను. నీకు శుభమగు గాక! అని చెప్పి అతనికి ఇష్టం లేకపోయినా వీడ్కొని దీర్ఘదర్శి తన సత్త్వమే తోడు కాగా అక్కడినుంచి బయలుదేరినాడు.

క్రమంగా దూరప్రయాణం చేసి తన అంగదేశాన్ని చేరుకున్నాడు. అక్కడ చారులు నగరం వెలుపలనే అతను వస్తుండడం చూచినారు. యశఃకేతు మహారాజు అతనిని వెదకుటకై నియోగించిన చారులు వారు. రాజు దగ్గరకు వెళ్ళి వినిపించగా, రాజు స్వయంగా నగరం వెలికివచ్చి అతని వియోగంతో ఎంతో దుఃఖించినవాడు గనుక అతనిని ఆలింగనం చేసుకుని అభినందించి సుదూర మార్గాయాసంతో ధూళిధూసరితుడై ఉన్న అతనిని అభ్యంతరంలోనికి కొనిపోయినాడు.

"మమ్ములను వదలిపెట్టి మా మనసు తప్ప నీవు తీసుకొనిపోయిం దేమిటి? నీ స్నేహాధిక్యంవల్ల ఈ శరీరం కూడా పరుష దశకు చేరుకున్నది. భవితవ్యంగతి ఒక్క భగవంతునకే తెలుసు. కాకపోతే అంత హఠాత్తుగా తీర్థయాత్ర చేయవలెనన్న బుద్ధి నీ

కెందుకు కలుగుతుంది? ఇప్పుడు చెప్పు. నీవు ఏ ఏ దేశాలు తిరిగి నావు? కొత్తవానిని వేనిని చూచినావు?" అని ఆ రాజు తన మంత్రితో అన్నాడు.

అంతట సువర్ణద్వీపాంతర విషయాల్ని, ఆ మార్గాన్ని క్రమంగా వర్ణిస్తూ దారిలో సముద్రంలో కన్పించిన దివ్య కన్య కను గూర్చి తెలియజెప్పినాడు.

త్రిజగత్సారభూతమై కల్పతరుస్థితురాలైన ఆ గాయకు రాలిని చూచి ఉన్నదున్నట్టు దీర్ఘదర్శి ఆ రాజునకు తెలియజెప్పి నాడు. అది వినీవినడంతోనే రాజు కామవశుడైనాడు. ఆమెలేక తన జీవితం నిష్ఫలమని తలచినాడు.

తన మంత్రిని ఏకాంతంగా పిలుచుకొనిపోయి ఇట్లా అన్నాడు: "నేను తప్పకుండా ఆ కన్యను చూడాలి. అన్యథా నాకు జీవితం లేదు. నీవు చెప్పిన మార్గాన్నిబట్టి భవిష్యత్తున కొక నమస్కారం చేసి బయలుదేరుతాను. నీవు నన్ను ఆపకూడదు. సర్వథా నన్ను అనుగమింపకూడదు. రహస్యంగా నే నొక్కడ్డే వెడతాను. నీ వీ రాజ్యాన్ని రక్షించవలసింది. నా మాటను అన్యథా తలంచవద్దు. నా ప్రాణాలపై ఒట్టుపెడుతున్నాను."

ఇలా చెప్పి అతనిని బదులు మాటాడకుండా ఆపించివేసి, పంపించివేసినాడు. చిరకాల వియోగంతో ఉత్కంఠితుడై తన వారిని చూచుటకై మంత్రి తనఇంటికి వెళ్ళిపోయినాడు. అంతట గొప్ప ఉత్సవం జరుపుకున్నాడు.

దీర్ఘదర్శి మటుకు ఇందుతో మనసు కలతపెట్టుకున్నాడు. అసాధ్య వ్యసనంలో ప్రభువు చిక్కుకుని ఉండగా సన్మంత్రికి సుఖం ఎక్కడినుంచి వస్తుంది?

మరునాడు రాజ్యభారాన్ని అతనిపై మోపి యశఃకేతువు రాత్రిపడిన తర్వాత తాపసవేషం వేసుకొని వెడుతూ వెడుతూ కుశనాభుడు అనే మునిని మార్గంలో దర్శించుకున్నాడు. తాపస కల్పుడుగా ఉండి తనకు నమస్కరించిన అతనితో ముని ఇట్లన్నాడు: "లక్ష్మీదత్తుడనే వర్తకునితో కలిసి ఆతని నౌకలో సముద్రప్రయాణం చేస్తూ నీవు కోరుకున్న కన్యను పొందగలవు. నిశ్చింతగా వెళ్ళు."

ఈ మాటలు విని ప్రీతుడై ప్రణమిల్లి ఆ పార్థివుడు నదులను, కొండలను, గుట్టలను దాటి సముద్రతీరం చేరుకున్నాడు.

నక్షత్రాలవలె, శంఖాలవలె ధవళాలైన తరంగాల బొమలతో కనిపిస్తూ ఆవర్తనేత్రమైనట్టుగా ఆతిథ్యాన్నివ్వగా, ఆ తీరంలోనే ఉన్న ముని చెప్పిన వర్తకునితో కలుసుకొన్నాడు. అతను ఆ లక్ష్మీదత్తుడు స్వర్ణద్వీపం వెళ్ళదలచుకుని ఉన్నారు.

అతనితో పాటూ చక్రాంక పాదముద్రలు కన్పింపగా వినమ్రుడై అతని నౌకనెక్కి సముద్రంలో పయనమైనాడు. మార్గమధ్యంలో నౌక నీటిలో ఉండగా ఆ వారిధి మధ్యంలో ఒక కల్పవృక్ష సంస్థితురాలైన ఆ కన్యక ఉద్భవించినది. చంద్రికను చకోరం వలె రాజు ఆమెను చూస్తుండగా వల్లకీ వాద్య సుందరమైన గీతాన్ని ఆమె గానం చేసినది.

"ఏ కర్మబీజాన్ని పూర్వం తాను నాటుతాడో దాని ఫలాన్నే అతను అనుభవిస్తాడు. పురాకృతాన్ని మరొకవిధంగా మార్చడానికి విధికికూడా సాధ్యం కాదు.

అందువల్ల ఎవరికి ఎలా ఎప్పుడు విధి వినియోగంవల్ల జరుగవలసి ఉన్నదో అక్కడ అలాగే దానిని పొందుటకై వివశుడై దొరకొంటాడు. ఇందులో భ్రమ ఏమీ లేదు."

ఈ విధంగా భావ్యర్థాన్ని సూచించే ఆ గీతాన్ని గానం చేస్తుండగా విని నిశ్చేష్టుడై స్మరశరాహతుడై రాజు ఒక క్షణం అలా నిలిచిపోయినాడు.

"ఓ రత్నాకరుడా! నీ హృదయం నిజంగా అగాధమైనది. నీ కిదే నా నమస్కారం. నీవు ఇలాంటి సుందరిని నీలో దాచుకొని హరి లక్ష్మివియోగంతో బాధపడునట్లు చేస్తున్నావు. సపక్ష భూధరాలకు ఆశ్రయమిచ్చిన నీ అంతు దేవతలకు కూడా అందలేదు. నేను నిన్ను శరణు అంటున్నాను. అభీష్టసిద్ధి చేకూర్చు."

ఈ విధంగా ఆ భూమిపతి వినతుడై ఆ సముద్రాన్ని స్తోత్రం చేసేలోగా ఆ కన్యక కల్పవృక్షంతో పాటూ నీటిలో మునిగిపోయినది. అది చూచి ఆ మార్గాన్నే అనుసరించి, కామాగ్ని శాంతికో అన్నట్లు రాజు జలధిలోనికి దుమికినాడు.

అది చూచి విశంకితుడై అతనిక నీటిలోమునిగిపోయినట్టుగానే భావించి సజ్జనుడైన లక్ష్మీదత్తుడు దుఃఖంతో దేహత్యాగానికి ఉద్యమించినాడు. "ఓ వర్తకశ్రేష్ఠుడా! సాహసం చేయవద్దు. సముద్రంలో పడిపోయినా అతనికి భయంలేదు. తాపసవేషంలో నున్న యశఃకేతు డనే రాజతను. ఆయన ఈ కన్యకోసమై ఇక్కడికి వచ్చినాడు. ఈమె ఆయనకు పూర్వజన్మంలో భార్య. ఆమెను పొందిన తర్వాత తిరిగీ అతను అంగరాజ్యాన్ని చేరుకుంటాడు" అని అతనిని ఆశ్వాసింపజేస్తూ అశరీరవాణి వినవచ్చినది.

ఆ మాటవిని సార్థవాహుడు యథేష్టంగా వ్యాపారార్థం వెళ్ళిపోయినాడు.

ఆ రాజు యశఃకేతువు మహాసముద్రాంతరం లోనికి వెళ్ళి అకస్మాత్తుగా ఒకానొక దివ్యనగరం చూచి ఆశ్చర్యచకితు డైనాడు. మణిమయ స్తంభాలతో భాస్వంతమై, కాంచన భిత్తులతో ఉజ్జ్వలమై, ముక్తాజాల గవాక్షాలతో నిండిన ప్రాసాదాలతో మనోహరమై, నానారత్న శిలా పట్ట బద్ధ సోపాన వాపికలతో కోరికలను తీర్చే కల్పవృక్షాలతో నిండిన ఉపవనాలతో శోభితమై సమృద్ధంగా కన్పించినప్పటికీ ఆ పట్టణం మాత్రం నిర్జనంగా ఉంది.

ఒకొక్క ఇంటిలోనికీ ప్రవేశిస్తూ వెదుకుతూ తన ప్రియురా లెక్కడా కనబడక పోవడంవల్ల అన్వేషిస్తూ వెదుతుండగా ఒక ఉత్తుంగమైన మణిమందిరం కానవచ్చినది. దానిపైనికి ఎక్కి తలుపు తెరచి లోనికి ఆ భూపతి ప్రవేశించినాడు. లోన సద్రత్న పర్యంకస్థితమై ఏకాకిగా వస్త్రాచ్ఛాదిత సర్వాంగమైన ఒక రూపాన్ని చూచినాడు.

ఒకవేళ ఆమె ఇందులో ఉన్నదా అని ఉత్కంఠతో ముఖం మీది వస్త్రాన్ని తొలగించినాడు. ఆమె నిజంగానే తన ఇష్టురాలైన కన్యక. జారిన నీలాంశుక ధ్వాంతమైన ముఖ చంద్రకాంతితో నవ్వుతున్నట్టి, వెన్నెలవలె తెల్లనైనట్టి, పగలు పాతాళం లోనికి వెళ్ళి పోయిన రాత్రివలె ఆమె కన్పించినది. ఆమె దర్శనంతో అతనొక విచిత్రావస్థను పొందినాడు. గ్రీష్మర్తువులో ఎడారిలో నడుస్తున్న బాటసారికి నదీసందర్శన మైనట్టైనది. అప్పుడు ఆమెకూడా కనులు తెరచి ఆ కల్యాణాకృతి లక్షణాలు కల వానిని ఉన్నట్టుండి చూడడంతో సంభ్రాంతి చెంది పడకపై నుంచిలేచినది.

ఆతిథ్యమిచ్చి తలవంచి అతని పాదాలను పూజిస్తున్నట్టుగా వికసిత నయనోత్పలాలతో మెల్లగా ఆమె ఇట్లన్నది: "నీ వెవ్వ

రవు? అగమ్యమైన ఈ రసాతలం లోనికి ఎలా ప్రవేశించినావు? నీ శరీరం రాజ చిహ్నాంకితమైనది. మరి నీకీ తాపసవ్రత మెందుకు? ఈ విషయాలన్నీ ఓ మహాభాగా! నాపై నీకు అనుగ్రహం ఉంటే ఆదేశించవలసింది'' అన్నది.

ఈ మాటలను విని ఆ రాజు జవాబిచ్చినాడు: "ఓ సుందరీ: అంగదేశ భూపతిని. నా పేరు యశఃకేతువు. ప్రతిరోజూ నీ విక్కడ సముద్రంలో పైకితేలి కన్పిస్తున్నట్టు ఆప్తుని వలన విన్నాను. అంతట నీ కోసమై ఈ వేషం వేసుకుని, రాజ్యాన్ని విడిచి పెట్టి ఇక్కడికి వచ్చి నీవు నీట మునిగి నప్పుడు ఆ మార్గాన్నే అను సరించి నేను సముద్రంలో దుమికినాను. ఇదీ నాకథ. నీ వెవ్వరవు?"

ఆ ప్రశ్నకు ఆమె సిగ్గుతోనూ, అనురాగంతోనూ, ఆనందం తోనూ ఇలా అన్నది:



"శ్రీమంతుడైన మృగాంకసేను డను విద్యాధరాధిపుడు కలడు. ఆమె కుమార్తెను నేను. నా పేరు మృగాంకవతి. నన్ను తన పట్టణంలో ఏకాకినిగా వదలివేసి మా తండ్రి ఇందలి పౌరులతో పాటూ ఏ కారణం వల్ల ఎక్కడికి వెళ్ళెనో నాకు తెలియదు. అందు వల్ల ఈ శూన్యవసతిలో నిర్విణ్ణురాలనై ఉంటూ, యంత్రకల్ప ద్రుమాన్ని అధిరోహించి సముద్రంలో పైకి తేలి భవితవ్యాన్ని గురించి గానం చేస్తుంటాను."



ఈ విధంగా చెప్పగా ఆయన ఆ ముని వచనాన్ని జ్ఞాపకం చేసుకున్నాడు. ఆ తర్వాత ప్రేమపేశలమైన వాక్యాలతో ఆమెను అనురంజింప జేసినాడు. ఆ అనురాగంతో వివశురాలైన ఆమె ఆ వీరునకు భార్యగా ఉండుటకు అంగీకరించినది కానీ, ఒక నియ మం చెప్పినది.

ఆ రాజు యశఃకేతువు మహాసముద్రాంతరం లోనికి వెళ్ళి అకస్మాత్తుగా ఒకానొక దివ్యనగరం చూచి ఆశ్చర్యచకితు డైనాడు. మణిమయ స్తంభాలతో భాస్వంతమై, కాంచన భిత్తులతో ఉజ్జ్వలమై, ముక్తాజాల గవాక్షాలతో నిండిన ప్రాసాదాలతో మనోహరమై, నానారత్న శిలా పట్ట బద్ధ సోపాన వాపికలతో కోరికలను తీర్చే కల్పవృక్షాలతో నిండిన ఉపవనాలతో శోభితమై సమృద్ధంగా కన్పించినప్పటికీ ఆ పట్టణం మాత్రం నిర్జనంగా ఉంది.

ఒకొక్క ఇంటిలోనికీ ప్రవేశిస్తూ వెదుకుతూ తన ప్రియురా లెక్కడా కనబడక పోవడంవల్ల అన్వేషిస్తూ వెడుతుండగా ఒక ఉత్తుంగమైన మణిమందిరం కానవచ్చినది. దానిపైనికి ఎక్కి తలుపు తెరచి లోనికి ఆ భూపతి ప్రవేశించినాడు. లోన సద్రత్న పర్యంకస్థితమై ఏకాకిగా వస్త్రాచ్ఛాదిత సర్వాంగమైన ఒక రూపాన్ని చూచినాడు.

ఒకవేళ ఆమె ఇందులో ఉన్నదా అని ఉత్కంఠతో ముఖం మీది వస్త్రాన్ని తొలగించినాడు. ఆమె నిజంగానే తన ఇష్టురాలైన కన్యక. జారిన నీలాంశుక ధ్వాంతయై ముఖ చంద్రకాంతితో నవ్వుతున్నట్టి, వెన్నెలవలె తెల్లనైనట్టి, పగలు పాతాళం లోనికి వెళ్ళిపోయిన రాత్రివలె ఆమె కన్పించినది. ఆమె దర్శనంతో అతనొక విచిత్రావస్థను పొందినాడు. గ్రీష్మర్తువులో ఎడారిలో నడుస్తున్న బాటసారికి నదీసందర్శన మైనట్టైనది. అప్పుడు ఆమెకూడా కనులు తెరచి ఆ కల్యాణాకృతి లక్షణాలు కల వానిని ఉన్నట్టుండి చూడడంతో సంభ్రాంతి చెంది పడకపై నుంచిలేచినది.

ఆతిథ్యమిచ్చి తలవంచి అతని పాదాలను పూజిస్తున్నట్టుగా వికసిత నయనోత్పలాలతో మెల్లగా ఆమె ఇట్లన్నది: "నీ వెవ్వ

రవు? అగమ్యమైన ఈ రసాతలం లోనికి ఎలా ప్రవేశించినావు? నీ శరీరం రాజ చిహ్నాంకితమైనది. మరి నీకీ తాపసవ్రత మెందుకు? ఈ విషయాలన్నీ ఓ మహాభాగా! నాపై నీకు అనుగ్రహం ఉంటే ఆదేశించవలసింది " అన్నది.

ఈ మాటలను విని ఆ రాజు జవాబిచ్చినాడు: "ఓ సుందరీ! అంగదేశ భూపతిని. నా పేరు యశఃకేతువు. ప్రతిరోజూ నీ విక్కడ సముద్రంలో పైకితేలి కన్పిస్తున్నట్టు అప్తుని వలన విన్నాను. అంతట నీ కోసమై ఈ వేషం వేసుకుని, రాజ్యాన్ని విడిచి పెట్టి ఇక్కడికి వచ్చి నీవు నీట మునిగి నప్పుడు ఆ మార్గాన్నే అను సరించి నేను సముద్రంలో దుమికినాను. ఇదీ నాకథ. నీ వెవ్వరవు?"

ఆ ప్రశ్నకు ఆమె సిగ్గుతోనూ, అనురాగంతోనూ, ఆనందం తోనూ ఇలా అన్నది:



"శ్రీమంతుడైన మృగాంకసేనుడను విద్యాధరాధిపుడు కలడు. ఆమె కుమార్తెను నేను. నా పేరు మృగాంకవతి. నన్ను తన పట్టణంలో ఏకాకినిగా వదలివేసి మా తండ్రి ఇందలి పౌరులతో పాటూ ఏ కారణం వల్ల ఎక్కడికి వెళ్ళెనో నాకు తెలియదు. అందు వల్ల ఈ శూన్యవసతిలో నిర్విణ్ణురాలనై ఉంటూ, యంత్రకల్ప ద్రుమాన్ని అధిరోహించి సముద్రంలో పైకి తేలి భవితవ్యాన్ని గురించి గానం చేస్తుంటాను."



ఈ విధంగా చెప్పగా ఆయన ఆ ముని వచనాన్ని జ్ఞాపకం చేసుకున్నాడు. ఆ తర్వాత ప్రేమపేశలమైన వాక్యాలతో ఆమెను అనురంజింప జేసినాడు. ఆ అనురాగంతో వివశురాలైన ఆమె ఆ వీరునకు భార్యగా ఉండుటకు అంగీకరించినది కానీ, ఒక నియ మం చెప్పినది.

కృష్ణచతుర్దశి అష్టమి తిథులలో ఆర్యపుత్రా! నేను నాలుగు రోజులు అస్వతంత్రురాలినిగా ఉంటాను. ఆరోజులలో నే నెక్కడికో వెడతాను. ఎక్కడికి పోతావని గానీ, పోకూడదని గానీ మీరు ప్రశ్నింపకూడదు. నిషేధించ కూడదు. దీని కొక కారణ మున్నది.

ఈ విధంగా ఒక సమయాన్ని విధించిన ఆ దివ్యకన్యకతో ఆ రాజు సరేనని ఒప్పుకొని గాంధర్వ విధితో ఆమెను వివాహం చేసుకున్నాడు. ఆ తర్వాత ఆమెతో అనేక సుఖాలను అనుభవించి నాడు. అందుతో ఆమెకు మన్మథ సంబంధమైన మండన క్రమ మొకటి ఏర్పడినది.

రాలుతున్న పూదండలుగల కేశముల యందు కచగ్రహణ నఖావళీ, నిష్పీత నీరాగమైన బింబాధరంమీద దశనక్షతీ, భిన్న మాణిక్యమాలలు గల వక్షోజాలపై నఖక్షతిశ్రేణీ, గాఢాలింగన రాగంతో వినష్టమైన అంగరాగమూ—ఈ విధంగా ఆ దివ్యసంభోగ సుఖం అవస్థితమైంది.

ఆ మృగాంకవతి ఆ రాజుతో ఒకసారి ఇట్లా అన్నది: "మీ రిక్కడే నా కోసమై నిరీక్షిస్తూ ఉండండి. నే నేదో పనిపై ఎక్కడికో వెడుతున్నాను. నేను మీకు ముందు చెప్పిన కృష్ణచతుర్దశి వస్తున్నది. నీ విక్కడే ఉన్నప్పుడు నా స్ఫటిక గృహంలోనికి వెళ్ళవద్దు. అక్కడ బావిలో దిగవద్దు. దిగితే భూలోకానికి వెళ్ళిపోతావు." అని చెప్పి ఆయనను వీడ్కొని అక్కడి నుంచి ఆమె పట్టణం బయటికి బయలుదేరినది.

రాజుకూడా ఖడ్గం చేతగైకొని గుప్తంగా జిజ్ఞాసతో ఆమెను వెంబడించినాడు. అక్కడ చిమ్మ చీకటివలె నల్లగానున్న విశాలంగా తెరచుకున్న వక్త్రబిలం పాతాళానికి వస్తున్న రూపుగొన్న రాక్ష

సునివలె కానవచ్చినది. ఆ రాక్షసుడు గట్టిగా గర్జించి ఆ మృగాంక వతిని నోటవేసుకొని మింగివేసినాడు. అది చూడగానే ఆగ్రహో దగ్రుడై మండిపోతున్న వానివలె కోశాకృష్టమై కుబుసం వదలిన కృష్ణసర్పం వంటి మహాఖడ్గంతో వెంట పర్వెత్తి ఆ రాజసింహుడు పెదవులు కొరుకుకునేటట్టున్న వాని తలను నరికి వేసినాడు. రక్షః కబంధం విడుస్తున్న కన్నీటితో అతని కోపం శాంతించినదే కానీ కాంతావియోగం మాత్రం కాదు.

అంతట మోహనిశాంగమైన చీకటిలో వినష్టగతికుడైనా డా రాజు. అకస్మాత్తుగా మేఘమలినమైన ఆ రాక్షసుని చీల్చుకుని వచ్చినట్టుగా నలుదిక్కులనూ వెలిగిస్తూ స్వచ్ఛమైన చంద్రబింబం లాగా ఆ మృగాంకవతి అక్షతగాత్రురాలై బయటికి వచ్చినది.

ఆమె అలా సంకటం నుంచి బయటపడి తొట్రుపడుతున్న ఆమెను పర్వెత్తి రాజు ఆలింగనం చేసుకున్నాడు. "ప్రియా! ఇదేమి కలా! లేక మాయా? "చెప్పమని ఆ రాజు కోరగా గతం జ్ఞాపకం చేసుకున్న విద్యాధరి ఇట్లన్నది: "ఆర్యపుత్రా! ఇది స్వప్నం కాదు. మాయకూడా కాదు. విద్యాధరేంద్రుడైన నా తండ్రి నా కిచ్చిన శాప మిది. బహు పుత్రుడైనప్పటికీ మాతండ్రి పూర్వం ఇక్కడే నివసిస్తుండే వాడు.

నేను లేకుండా నాపై అతి వాత్సల్యం వల్ల ఆయన ఎప్పుడూ భోజనం చేసేవాడుకాదు. నే నేమో సర్వదా శివపూజాసక్తు రాలనై ఈ నిర్జనారణ్యంలో చతుర్దశినాడు, అష్టమినాడు, బహుళ శుక్ల పక్షాల రెండింటా ఇక్కడకు వచ్చేదాన్ని. ఒకసారి ఇక్కడికి చతుర్దశినాడు వచ్చి గౌరి పూజచేసుకుంటుండగా దినము దినమే గడిచి పోయినది.

నాకై నిరీక్షిస్తూ ఆకలిగొన్న తండ్రి ఏమీ తినలేదు. ఏమీ త్రాగవలేదు. నాపై బాగా కోపంతో ఉన్నాడు. ఆ తర్వాత రాత్రి నేను వచ్చి తలవంచుకొని తప్పు చేసిన దానిగా ఉండగా, భవితవ్య బలగ్రస్తుడై నామీద వాత్సల్యం ఉన్న ఆయన నన్నిలా శపించినాడు.

"నీవు ఆలస్యం చెయ్యడం వల్ల ఆకలితో మలమల మాడినాను. ప్రతినెలా అష్టమి చతుర్దశులలో హరార్చనకై వస్తున్న పట్టణ బాహ్యప్రదేశంలో కృతాంత సంత్రాసుడైన రాక్షసుడు బయటికి వస్తాడు. నిన్ను మింగి వేస్తాడు. అతని హృదయాన్ని చీల్చుకుంటూ, చీల్చుకుంటూ బ్రతికే నీవు బయటికి పడతావు. నీకు నా శాపంగానీ, ఆ వెలుపలికి వచ్చే వ్యథకానీ తెలియదు. ఒంటరిగా ఇక్కడ నీవు ఉండిపోతావు."

ఇలా శపించగా మెలమెల్లగా నే నాయనను శాంతింపజేసి శాపవిమోచనం కోసం ప్రార్థింపగా మా తండ్రి ఇలా నిర్దేశించినాడు.

"యశఃకేతువనే పేరుగల అంగరాజు ఎప్పుడైతే నీకు భర్త అయి ఆ రాక్షసుడు నిన్ను మింగడం చూచి వాని తల ఉత్తరించి వేస్తాడో నీ కప్పుడు శాపవిమోచనం కలుగుతుంది. వాని గుండెలో నుంచి బయట పడతావు. అప్పుడు నీ కీ శాపవృత్తాంత మంతా జ్ఞాపకం వస్తుంది. సర్వవిద్యలూ నిన్ను తిరిగి ఆవహిస్తాయి" అని ఆదేశించి నన్ను ఒంటరిగా ఇక్కడ వదలి పెట్టి సపరివారంగా మా తండ్రి భూలోకంలోని నిషధాద్రికి బయలుదేరి వెళ్ళిపోయినాడు.

నే నప్పుడు శాపమోహితురాలనై ఇక్కడే పరిభ్రమిస్తున్నాను. ఇప్పుడా శాపం తొలగి పోయినది. సర్వ పూర్వస్మృతీ కలిగినది. ఇప్పుడు నేను నిషధాద్రికి మా తండ్రి వద్దకు వెళ్ళిపోతాను.

శాపాంతంలో మా దారిన మేము వెళ్ళిపోవడం మా నియమం. ఇప్పుడు నీవు ఇక్కడ ఉండినాసరే విదేశానికి వెళ్ళి పోయినాసరే. నీవు సర్వ స్వతంత్రుడవు"

అని ఈ విధంగా ఆమె చెప్పగా ఆ రాజు దుఃఖితుడై ఆమె నిలా అర్థించినాడు: "ఓ సుముఖీ! నన్ననుగ్రహించి ఏడురోజులు ఇక్కడే ఉండిపో. ఆ వారంరోజులు ఉత్సుకతతో ఉద్యానంలో క్రీడిస్తూ గడుపుదాము. ఆ తర్వాత నీవు నీ తండ్రి దగ్గరకు పోవచ్చును. నేను నాదేశానికి పోతాను."

ఈ మాట విని ఆ ముగ్ధ అందు కంగీకరించినది. అంతట ఆ రాజు ఆమెతో కలిసి ఆ ఉద్యానంలో సజలోత్పల నేత్రలైన వాపీ కూపాలలో ఆరురోజులు క్రీడించినాడు. వీటిని అన్నిటినీ వదలి పెట్టి వెళ్ళవద్దు అన్నట్టు తమ అలల చేతులతో ఆ హంస సారస నిస్వనాలతో ఆ బావులు అడ్డగించినట్టున్నవి.

ఏడవనాడు యుక్తితో ఆ ప్రియురాలిని భూలోకానికి పంపే యంత్ర ద్వారవాపిక ఉన్న ఇంటిలోనికి తీసుకొని వెళ్ళి ఆలింగనం చేసుకొని ఆమెతో పాటే ఆ బావిలోనే దుమికినాడు. ఆమెతోపాటే తన పురోద్యాన వాపినుండి పైకి లేచినాడు.

అక్కడ ఆ కాంతాసఖుడై వచ్చిన అతనిని వనపాలకుడు చూచి సంతుష్టుడై వెళ్ళి మంత్రి దీర్ఘదర్శికి ఈ విషయం తెలియు జేసినాడు. ఆయనకూడా వచ్చి పాదాభివందనం చేసి ఈప్సితాం గనను కొని వచ్చిన ఆ రాజును చూచి సంతోషించి ఆ మంత్రి పౌరులతోపాటూ ఆయనను అంతఃపురంలోనికి కొనిపోయినాడు.

"ఈ దివ్య కాంత రాజునకు ఎలా లభించినది? ఆకసంలో మెరుపుతీగవలె ఒకక్షణం మాత్రమే నాకు కన్పించినదే! బ్రహ్మ

దేవుడు లలాటంపై లిఖించిఉంటే అసంభావ్యమైనది కూడా అవశ్యం భావి కాగలదు" అని మంత్రిముఖ్యుడు తలపోసుకుంటుండగా ఇతర జనులు కూడా అదేవిధంగా అనుకుంటుండగా దివ్యస్త్రీప్రాప్తి పొందిన రాజాగమనంతో దేశం మహోత్సవం చేసుకున్నది.

మృగాంకవతి స్వదేశాగతుడైన ఆ రాజును చూచి తన ఏడు రోజుల గడువు ముగిసినది గనుక విద్యాధర లోకానికి వెళ్ళ నిశ్చయించుకున్నది. కానీ గగనాని కెగిరి పోయే తన విద్య తనకు జ్ఞాపకం రాలేదు. ఆ విధంగా తన్నెవరో దొంగిలించినట్టుగా ఎంతో విషాదం చెందినది.

అప్పుడా రాజు "ప్రియా! అకస్మాత్తుగా విషణ్ణురాలవుగా కన్పిస్తున్నా వేమిటి?" అని ప్రశ్నించినాడు. అప్పుడా విద్యాధరి ఇట్లన్నది: "శాపముక్తురాలనై నప్పటికీ నీ మీది స్నేహంతో ఇక్కడ చిరకాలం ఉన్నందువల్ల నా విద్యలన్నీ భ్రష్టములైనవి. నా దివ్యగతి నష్టమైనది.''

"ఆహా! విద్యాధరి నాకు సిద్ధించినది కదా!" అని యశఃకేతు మహారాజు మహోత్సవం సంపూర్ణంగా జరుపుకున్నాడు. అది చూచి దీర్ఘదర్శి రాత్రి ఇంటికి వెళ్ళి శయనగతుడై అకస్మాత్తుగా గుండెపగిలి చనిపోయినాడు.

అప్పుడా దుఃఖాన్ని అనుభవించి స్వయంగానే రాజ్యభారాన్ని వహించి యశఃకేతు మహారాజు మృగాంకవతీయుతుడై చిరకాలం రాజ్యం చేసినాడు."

''ఈ విధంగా దారిలో బేతాళుడు త్రివిక్రమసేన మహారాజునకు ఈ కథను చెప్పి ఇలా ప్రశ్నించినాడు:

"రాజా! తన ప్రభువునకు అంతటి అభ్యుదయం కలుగగా అతని మహామంత్రి హృదయం పగిలిపోవడానికి కారణ మేమిటి? దివ్యస్త్రీ నాకెందుకు దొరకలేదు? అని దుఃఖంతో అతని హృదయం పగిలిపోయినదా? లేక రాజ్యం తనదే అనుకుంటుండగా రాజు రాగా పగిలిపోయినదా? ఈ సంగతి తెలిసీ నాకు చెప్పక పోతివో నీ ధర్మమూ నాశనమై పోతుంది, నీ తలా వ్రక్కలై పోతుంది."

ఈ మాట విని త్రివిక్రమసేన మహారాజు బేతాళునితో ఇట్లన్నాడు: "సచ్చరితుడైన మంత్రివర్యుని విషయంలో ఆ రెండూ వర్తించవు. స్త్రీమాత్రరసంతో వదలివేసిన రాజు మరి ఈ దివ్య స్త్రీ రక్తితో ఈ రాజ్యాన్నేం చూచుకుంటాడు? కాబట్టి నేను ఇంతచేసీ నా దోషాన్ని మరింత అధికం చేసుకున్నట్టయినది అన్న భావన వల్ల ఆ మంత్రి హృదయం పగిలిపోయినది"

అని ఆ నరపతి చెప్పగా ఆ మాయావి అయిన బేతాళుడు తన స్వస్థానానికి వెళ్ళి పోయినాడు.

రాజు కూడా వెంటనే అతనిని పట్టుకొనుటకై తిరిగీ అతని వెంట ధీరచిత్తుడై పరుగిడినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీలంబకంలోని
ఏకోనవింశ తరంగం.

# ఇరవయ్యో తరంగం

తిరిగి త్రివిక్రమసేన భూపాలుడు అశోకవృక్షం దగ్గరకు వెళ్ళి బేతాళుని భుజంమీద వేసుకొని బయలుదేరినాడు. వస్తుం డగా దారిలో బేతాళుడు తిరిగి రాజుతో ఇట్లన్నాడు: "ఓ రాజా! ఒక చిన్నకథను చెప్తాను విను:

## 13వ కథ

అరణ్యావాసభూమి అయిన వారణాసి అనే పట్టణం కలదు. ఆ పట్టణంలో దేవస్వామి అనే పేరుగల రాజునకు మాన్యుడైన ఒక బ్రాహ్మణుడు కలడు. సంపన్నుడైన అతనికి హరిస్వామి అనే కుమారుడు కలిగినాడు. అతనికి లావణ్యవతి అనే భార్య అత్యుత్తమురాలు కలదు. తిలోత్తమాది అప్సరసలను నిర్మించి చేయి తిరిగిన బ్రహ్మ అనర్ఘరూప లావణ్యవతి అయిన ఆమెను నిర్మించినాడా అనిపిస్తుంది.

ఆ కాంతతో కలిసి హరిస్వామి ఒకనాడు రతి శ్రాంతుడై చంద్రాంశు శీతలమైన హర్మ్యంలో నిద్రించినాడు. ఆ సమ యంలో ఆ దారిలో కామచారి అయి ఆకసంలో వెడుతూ మదన వేగాఖ్యుడనే విద్యాధర కుమారకుడు భర్త ప్రక్కన పడుకొని నిద్రిస్తున్న ఆ లావణ్యవతిని చూచినాడు. రతి శ్రమతో నిద్రిస్తూ బట్టలు జారిపోగా ఆమె అంగసౌష్ఠవం వ్యక్తీకృతమౌతున్నది. ఆమె రూపంతో ఆకృష్టచిత్తుడై మదాంధుడై అతడు క్రిందికి దిగి నిద్రపోతున్న ఆమెను తీసుకొని గగనమార్గంలో వెళ్ళిపోయినాడు.

ఒకక్షణంలో మేల్కొని యువకుడైన హరిస్వామి ప్రక్కన తన భార్య లేక పోవడం చూచి తత్తరపాటుతో విస్మయం చెంది

నాడు. "అయ్యో! ఆమె ఎక్కడికి పోయినది? నామీద అలిగినదా? దాచుకొని, నా మనసును వెదకుటకై పరిహాసమాడుతున్నదా!" ఈ విధమైన అనేక వికల్పాలతో వ్యాకులుడై అటూ ఇటూ తిరుగుతూ ఆ రాత్రంతా హర్మ్యప్రాసాద వలభులలో ఆమెకై వెదుకుతూ తిరుగసాగినాడు.

పురోద్యానం వరకూ ఎంత వెదకినా ఆమె కన్పించలేదు. శోకాగ్ని సంతప్తుడై అతడు బాష్పరుద్ధ కంఠంతో ఇలా విలపించి నాడు.

"ఓ చంద్రబింబవదనా! ఓ చంద్రికా గౌరీ! ఓ ప్రియా! తుల్యగుణద్వేషంతో ఈ రాత్రి నిన్ను చూచి సహింపలేక పోయినదా? చందనశీతలాలైన కిరణాలతో నన్నింతదాకా సంతోష పెట్టిన చంద్రుడు, నీవు లేనందువల్ల ఏదో అవకాశం కలిగినట్టుగా ఆ కిరణాలతోనే నన్ను బాధిస్తున్నాడు. మండుతున్న నిప్పులవలె విషదిగ్ధాలైన బాణాలతో నన్ను వ్యథ పెడుతున్నాడు."

ఈ విధంగా రోదిస్తున్న హరిస్వామి అతి కష్టంమీద ఆ రాత్రిని గడపినాడు. అతడు విరహవేదనను మాత్రం దాటలేక పోయినాడు.

ఉదయమే, లోకాన్నంతా ఆక్రమించుకొని ఉన్న అంధకారాన్ని భేదించిన సూర్యుడు అతని మోహాంధతమస్సును మాత్రం భేదింపలేక పోయినాడు. విలబ్ధునివలె, వియుక్తాలైన చక్రవాకాల వలె ఆ కరుణాక్రందన ధ్వని శతగుణీభూతమైనది. స్వజనంవచ్చి ఎంతగా ఓదార్చినా వియోగానలచిత్తుడైన అతను ఆ ప్రేయసి లేని దుఃఖంనుంచి ఊరట చెందలేదు.

"ఆమె ఇక్కడ నిలుచుండినది. ఇక్కడ స్నానం చేసినది. ఇక్కడ అలంకరించుకున్నది. ఇక్కడ విహరించినది. మరి ఇప్పు డెక్కడికి వెళ్ళినది?" అని ఆక్రోశించినాడు. చనిపోయి ఉంటే నా ఆత్మ నన్నిలా ఎందుకు బాధిస్తుంది? ఇలా బ్రతికే ఉంటే ఆమె ఎప్పుడో ఒకసారి కనబడవచ్చును.'' అట్లా ధైర్యం చేసుకొని ఆ ప్రియురాలిని వెదకుతూ వచ్చినాడు. ధీరుడై కృషి చేస్తున్నవానికి అప్రాప్యమన్నది లేదు కదా! అని బంధువులూ, స్నేహితులూ బోధింపగా ఎంతో కష్టంమీద కొన్నిరోజులు హరి స్వామి ధైర్యం చిక్కబట్టుకున్నాడు.

ఇలా తలపోసుకున్నాడు కూడా: "నా సర్వస్వాన్నీ బ్రాహ్మ ణులకు ఇచ్చివేసి తీర్థయాత్రలతో జీవితం గడుపుతాను. పాప ప్రక్షాళనం చేసుకుంటాను. పాపం పరిహారమైతే ఇలా తిరుగుతూ తిరుగుతూ ఎక్కడో నా ప్రియురాలిని కలుసుకుంటాను" అని ఆలోచించుకుని లేచి దినకృత్యాలను తీర్చుకున్నాడు.

మరునాడు విచిత్రాన్నపానాదులతో బ్రాహ్మలకు సంత ర్పణ చేయించి వారికి విశేషంగా ధనాన్ని కూడా దానం చేసి నాడు. కేవలం బ్రాహ్మణ్యం మాత్రమే తన ధనంగా తన దేశం నుంచి బయలుదేరి ప్రియాప్రాప్తిని కోరుతూ అతను తీర్థయాత్ర లను సేవిస్తూ తిరుగసాగినాడు.

అలా తిరుగుతుండగా భయంకరమైన గ్రీష్మర్తు సింహం ప్రచండాదిత్యవదనమై దీప్తతత్కిరణకేసర అయి ప్రియావిరహ సంతప్త పాంథ నిశ్వాసమారుతములతో వేడెక్కిన వానివలె వేడి గాడ్పులు వీవసాగినవి. గ్రీష్మంలో గుండెలు పగిలిపోయినట్టుగా జలాశయాలు ధర్మలుప్తాంబు సంపదలైనవి. చీలీ చీత్కారయుక్త

ములై తాపమ్లానదళాధరములై, పాదపములు మధుశ్రీ విరహంతో మార్గంలో ఏడుస్తున్నట్టున్నవి.

ఆ వేసవిలో సూర్యతాపంతో ఉత్సాహంతోనూ, వియోగం తోనూ, ఆకలిదప్పులతోనూ, ఆగకుండా నడుస్తుండడంతోనూ క్లాంతుడై తప్తధూళితో ధూసరితాంగుడై, హరిస్వామి భోజనార్థి అయి తిరుగుతూ ఒకచోట ఒక గ్రామాన్ని చేరుకున్నాడు. అక్కడ పద్మనాభుడనే పేరుగల విప్రుని ఇంటికి వెళ్ళినాడు. అతను సత్రానికి అధికారి. లోపల ఎందరో విప్రులు భోజనం చేస్తుండడం చూచి ద్వారబంధం పట్టుకొని నిశ్శబ్ద నిశ్చలుడై నిలుచున్నాడు.

అట్లా ఉన్న అతనిని చూచి సత్రాధికారి గృహిణి జాలితలచి ఇలా అనుకున్నది: "ఆహా! ఈ ఆకలి ఎంత చెడ్డది! దీని బరువు ఎంతటి దానినైనా తేలికపరుస్తుంది. ఈ అన్నార్థి అయి వాకిలి వద్ద తలవంచుకొని అతనెవరో నిలుచున్నాడు. చాలా దూరం నుంచి వచ్చినట్టున్నది. స్నానంచేసి ఇంద్రియ బలమంతా తగ్గి పోయి ఆకలితో ఉన్న అతనికి అన్నదానం చేయడం యుక్తం" అని ఆమె ఆలోచించుకున్నది.

అంతట ఆ సాధ్వి నెయ్యి చక్కెర వేసిన పరమాన్నంతో నింపిన పాత్రను రెండుచేతులా తీసుకొనివచ్చి వినయంతో అతనికి అందించినది. ఏ వాపీ తటాకానికో వెళ్ళండి. ఇక్కడ బ్రాహ్మలందరూ భోజనం చేస్తున్నందువల్ల ఎంగిలి, మంగలంగాఉంది" అని అన్నది.

సరేనని అతను అన్నపాత్రను తీసుకొని దగ్గరలో నున్న ఒక బావిగట్టున ఒక చెట్టుక్రింద దాని నుంచినాడు. ఆ బావిలోనికి

దిగి కాళ్ళూ చేతులూ కడుగుకొని ఆచమనం చేసి దానిని తిని సంతుష్టుడగుటకై పరమాన్నం దగ్గరకు వచ్చినాడు. అదే సమయం లోనే ముక్కుతోనూ, కాళ్ళతోనూ నల్లత్రాచును పట్టుకొని ఒక గరుడపక్షి ఎక్కడినుంచో వచ్చి ఆ చెట్టుమీద కూర్చున్నది. అది దానిని చీల్చి తింటుండగా ఆ చనిపోయిన పాము విషలాలాజలం బయటికి వచ్చినది. చెట్టుక్రిందనే ఉన్న అన్నపాత్రలో అది పడి నది. దానిని చూచుకొనక హరిస్వామి వచ్చి ఆ పాయసాన్ని తిన్నాడు. క్షుధార్తుడై మృష్టాన్నాన్ని తిన్నవెంటనే తీవ్రమైన విషవేదన కలిగినది. ఆహా! విధివిపర్యయానికి మరొక విపర్యయ మున్నదా! అని అనుకుంటూ ఆ హరిస్వామి తడబడుతూ ఆ సత్రాధికారి గృహిణివద్దకు వెళ్ళి ఇలా అన్నాడు: "మీ రిచ్చిన విషాన్నంవల్ల నా కేదో వికారంగా ఉన్నది. వెంటనే ఒక విష మంత్రిని పిలిపించండి. లేకపోతే నీకు బ్రహ్మహత్యాదోషం చుట్టు కుంటుంది'' అని చెప్పగా ఆ సాధ్వి ఇ దేమిటని విహ్వాలురాలై నది.

ఇంతలోనే ఆ హరిస్వామి కనుగ్రుడ్లు తేలవేసి చనిపోయి నాడు. అంతట ఆమె నిర్దోషురాలైనప్పటికీ సత్రాధికారి, భార్య ఇచ్చిన ఆతిథ్యం వల్లనే ఈ పరిణామం జరిగిందని తలచి ఆ సత్రాధికారి తన భార్యను తరిమి వేసినాడు. మంచి చేసినా చెడ్డ పేరు అనవసరంగా వచ్చిందని అవమానంచెంది, ఆ సాధ్వి తీర్థంలో మునిగిపోయినది.

అంతట విప్రవధకు కారణ మెవరని ధర్మరాజు వద్ద వాదో పవాదాలు జరిగినవి. నిర్ణయం తేలలేదు. ఓ రాజా! అందులో ఆ బ్రహ్మహత్యాదోషం పూర్వ శాపమా? లేక మరొక విధంగా జరిగినదా?''

బేతాళుడు వేసిన ఈ ప్రశ్నను విని ఆ రాజు శాపబద్ధుడై మౌనాన్ని వదలి ఈ విధంగా చెప్పినాడు:

"ఆ పాతకం సర్పానిదా? అనుకుంటే శత్రువు తన్ను భుజిస్తుండగా వివశమైన ఆ పాము చేసిన దేమున్నది? ఇక ఆ గరుడపక్షి దందామా? ఆకలిగొన్న దానికిమాత్రం ఇదంతా ఏం తెలుసు? తనకు ఆహారం దొరకగానే తెచ్చిగబగబా తిన్నది.

అన్నదానం చేస్తున్న ఆ దంపతులలో మాత్రం దోష మే మున్నది? వారేమీ ద్రోహంచేయలేదు. ధర్మైకప్రవృత్తులై దానం చేస్తున్నవారు వారు. అందువల్ల ఆ బ్రహ్మహత్య జడాత్మడై పూర్వాపరాలు విచారింపకనే వారిద్దరిలో ఆమెకే దోషమని ఎవ డైతే అన్నాడో వాడిదే ఆ బ్రహ్మహత్యాదోషం" అని అంటుండ గానే ఆ రాజు భుజం మీది నుండి బేతాళుడు క్రిందికి దిగి స్వస్థా నానికి వెళ్ళిపోయినాడు. ధీరుడైన ఆ రాజుకూడా వానిని పట్టు కొనుటకై తిరిగి బయలుదేరి వెళ్ళినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
ఇరవయ్యో తరంగం.

# ఇరవై ఒకటో తరంగం

త్రివిక్రమసేన భూపాలుడు అశోకవృక్షం వద్దకువెళ్ళి తిరిగి బేతాళుని భుజాన వేసుకుని బయలుదేరినాడు.

నడుస్తున్నరాజుతో బేతాళుడు తిరిగీ ఇట్లన్నాడు:

"ఓ రాజా! అలసి పోయినావు కాబట్టి ఓ చిత్రకథను చెప్తాను విను:

## 14వ కథ

రక్షఃకుల కృతాంతుడైన విష్ణురూపుడైన రామభూపాలునికి పూర్వం రాజధాని అయిన అయోధ్యానగర పట్టణం కలదు. ఆ పట్టణంలో వీరకేతుడనే రాజు కలడు. మహాబాహువైన అతడు నగరాన్ని ప్రాకారంవలె భూతలాన్నంతటినీ రక్షిస్తూ వచ్చినాడు.

ఆ పట్టణంలో పూర్వం ఒక మహావర్తకుడుండేవాడు. అతని పేరు రత్నదత్తుడు. అతను వర్తకులందరకూ నాయకుడు. అతని భార్య నందవతి. దేవతారాధనవల్ల కలిగిన కూతురు రత్నవతి. ఆమె తండ్రి ఇంటిలో రూపలావణ్య విలాసాలతో సహా సహజ గుణాలతో పెరిగి పెద్దదైనది.

యౌవనవతి అయిన ఆమెను గొప్ప వర్తకులేకాక రాజులు కూడా తమ కివ్వవలసిందిగా ఆమె తండ్రిని కోరినారు. ఆమె పురుషద్వేషిణి. ఇంద్రుడైనా సరే తనకు భర్తగా అంగీకరించదు. ప్రాణత్యాగానికైనా సిద్ధపడుతుందికానీ వివాహ ప్రథను వినడానికే ఇష్టపడదు. ఆమెపై వాత్సల్యంతో రాజు దుఃఖిస్తూ మిన్న కున్నాడు.

ఈ విషయం అయోధ్యలోనే కాక దేశమంతటా వ్యాపించి నది. ఈలోగా దేశమంతటా దొంగలు పడడం ఆరంభమైనది. అప్పుడు పౌరు లందరూ వీరకేతు మహారాజు వద్దకు వచ్చి ఇట్లా విన్నవించుకున్నారు:

"ప్రభూ! ప్రతిరాత్రీ దొంగలు వచ్చి పౌరులను దోచుకొని పోతున్నారు. వారు మా కంట పడటం లేదు. కర్తవ్యమేమిటో మీరే ఆలోచించాలి." ఆ విధంగా పౌరులంతా ఆయనకు విన్నపం చేయగా ఊరంతటా దొంగలకోసమై అన్వేషిస్తూ రహస్యంగా రాత్రిపూట తిరుగవలసినదని రక్షకభటులను నియమించినాడు. ఊళ్ళో దొంగతనాలెన్నో సాగుతున్నాయే కానీ వారికి దొంగలు మాత్రం దొరకలేదు.

ఇట్లాఉండగా ఒకసారి రాజు రాత్రిపూట స్వేచ్ఛగా తిరుగ సాగినాడు. ఏకాకి అయి ఖడ్గధారిఅయి తిరుగుతుండగా అతని కొక పురుషుడు కనిపించినాడు. అతను ప్రాకారాన్ని ఆనుకునే నడుస్తు న్నాడు. అతను పిల్లిలాగా నిశ్శబ్దంగా నడుస్తూ, అటూ ఇటూ నలువైపులా చూస్తూ, పదేపదే వెనుకకు తిరిగి చూస్తూ వెడు తున్నాడు.

వీడే ఒంటరిగా ఊరంతా తిరుగుతూ పౌరులను దోచుకుం టున్న దొంగఅయి ఉండాలి—అనుకొని అతని దగ్గరకు ఆ రాజే వెళ్ళినాడు.

ఇది ఆ దొంగ చూచి "నీ వెవరవూ?" అని రాజును ప్రశ్నించినాడు. "నేను దొంగను'' అని ఆ రాజు దొంగతో అన్నాడు. అంతట ఆ దొంగ ఈయనను చూచి "నీవుకూడా నా వంటి వాడవే గనుక నాకు స్నేహితుడివి. నీవు మా ఇంటికిరా. నేను మిత్రసత్కారం చేస్తాను'' అన్నాడు.

ఆ మాటకు రాజు "సరే," నని అతని వెనుకనే బయలు దేరినాడు.

అడవిలో భూగృహంలో ఉన్నవాని ఇంటిని చేరుకున్నాడు. అక్కడ కావలసినన్ని భోగభాగ్యాలు కనబడుతున్నవి. దీపాలు ప్రకాశవంతంగా వెలుగొందుతున్నవి. బలిరాజులేని నూతన పాతాళ లోకంవలె ఉన్నదది. అందులోకి ప్రవేశించి ఆసనంపై కూర్చున్న తర్వాత ఆ తస్కరుడు అభ్యంతర గృహంలోనికి కొనిపోయి నాడు. వెంటనే ఒక దాసి రాజుతో ఇట్లన్నది:

"మహాభాగా! నీవు ఈ మృత్యుగృహం లోనికి ఎందుకు ప్రవేశించినావు? వీడు దొంగ. బయటకు వెళ్ళి అనేక పాప కృత్యాలు చేసివస్తూ ఉంటాడు. నిజంగా వీడు విశ్వాసఘాతుకుడు. కాబట్టి నీవు త్వరగా ఇక్కడినుంచి వెళ్ళిపో."

ఆ మాటవిని ఆ రాజు అక్కడినుంచి వెంటనే బయలుదేరి పట్టణానికి వెళ్ళి రాత్రికి రాత్రి సైన్యాన్ని ఆయత్తం చేసినాడు. సైన్యంతో సన్నద్ధుడై వచ్చి ఆ దొంగ ఇంటిని ముట్టడించినాడు. భూగృహద్వార వివరాన్ని తన బలగంతో కోలాహలంతో నింపివేసి నాడు. అలా తన ఇంటిని ముట్టడించినారని తెలుసుకొని చావు నకు తెగించి శూరుడైన చోరుడు బయటికి వచ్చినాడు.

బయటికి రాగానే అమానుష పరాక్రమాన్ని కనబరస్తూ యుద్ధం చేసినాడు. ఏనుగుల కాళ్ళను నరికివేసినాడు. తురగ జంఘాదులను ఛేదించినాడు. డాలు కత్తిని పట్టుకొని ఒక్కడే అనేక శత్రువుల తలలను ఉత్తరించినాడు.

అంతట సైన్యమంతా నశింపగా రాజు తానే వానిపైని కురికినాడు. ఖడ్గయుద్ధవిశారదుడైన రాజు వాని చేతి కత్తిని, బాకును కూడా లాగివేసుకున్నాడు.

శస్త్రహీనుడైన వానితో రాజు బాహుయుద్ధం చేసి నేలపై పడగొట్టి అతనిని పట్టుకున్నాడు. అతనిని తన పట్టణానికి పట్టుకొని వెళ్ళినాడు. ఉదయమే వానిని వధించవలసిందిగా ఆజ్ఞాపించినాడు.

ఆ విధంగా అతనిని డిండిమాలు మ్రోయిస్తూ వధ్యశిల వద్దకు కొనిపోతుండగా హర్మ్యం పైనుండి వణిక్కన్య రత్నావతి వానిని చూచినది. గాయపడి ధూళిధూసరితాంగుడైనప్పటికీ వానిని మోహించినది.

వెంటనే తండ్రివద్దకు వెళ్ళి ఆ రత్నదత్తునితో ఇట్లన్నది: "ఇప్పుడు వధార్థమై కొనిపోతున్న వానిని నేను వరించినాను. అతనిని, రాజుగారితో చెప్పి ఎలాగైనా విడిపించండి. లేకపోతే నే నతనితో పాటూ చనిపోతాను.''

ఆ మాటవిని ఆమెతో తండ్రి ఇట్లన్నాడు: "ఏమిటమ్మా ఆ మాటలు! ఇన్నాళ్ళూ ఎందరెందరో రాజులు వచ్చినా నీవు అంగీకరించలేదు. ఇప్పుడీ దొంగను శిక్షపడిన వానిని కోరుతున్నా వేమిటి?" ఇలా తండ్రి ఎంతగా చెప్పినప్పటికీ ఆమె తన పట్టుదల వదలలేదు.

అంతట ఆ తండ్రి రాజువద్దకు వెళ్ళి ఆ దొంగను వదలిపెడితే తన సర్వస్వాన్నీ ఇస్తానని అభ్యర్థించినాడు. రాజుమాత్రం వందకోట్ల దీనారాలను ఇచ్చినప్పటికీ, తన శరీరాన్నే పణంగా ఒడ్డి పట్టుకున్న ఆ తన సర్వస్వాన్నీ దోచుకున్న దొంగను వదలిపెట్టడానికి ఇష్టపడలేదు.

అంతట విముఖుడైన తండ్రి తిరిగి రాగా, వణిక్కుమారిక దొంగతో పాటూ సహగమనం చేయుటకై స్నానంచేసి, బంధువు

లంతా వారిస్తున్నా వినక, మేనాలో కూర్చుని వధ్యభూమికి వెళ్ళినది. ఆమెనుగూర్చి దుఃఖపడుతూ, వెదుకుతూ తండ్రీ తల్లి వెంట రాగా, వెళ్ళేసరికి వధకుడు ఆ చోరుని శూలంపైకి అధిరోహింపజేసినాడు.

ప్రాణాలను వదలి వ్రేలాడుతున్న అతనిని చూచి జరిగిన కథను జనంవల్ల విని, జనులు నవ్వుతుండగా ఆ దొంగ శూలహతుడై ప్రాణాలను వదలినాడు.

ఆ తర్వాత క్రిందికి దింపిన ఆ చోరుని కళేబరాన్ని తీసుకుని చితిపేర్చి ఆ సాధ్వి అయిన వణిక్కుమారిక దానిపై నెక్కినది. వెంటనే శ్మశానంలో భైరవుడు కొలువుతీర్చి అదృశ్యుడై ఆకాశంలోనుంచి ఈ విధంగా ఆదేశించినాడు :

"స్వయంగా వరించిన ఈ పతిపై నీవు కనబరచిన భక్తిని నేను మెచ్చుకున్నాను. నీకు ఏం వరం కావాలో కోరుకో. సంతుష్టుడనైన నేను ఇస్తాను."

ఆ మాటవిని ఆమె దేవదేవునికి ప్రణమిల్లి "అపుత్రకుడైన నా తండ్రికి నూరుగురు కుమారులు కలుగవలసింది. నేను లేకపోతే ఆయన, మిగతా సంతానం లేదు గనుక మరణించగలడు" అని చెప్తున్న ఆ సాధ్వితో ఆ దేవు డిట్లన్నాడు :

"నీ తండ్రికి నీవు కోరినట్లు నూర్గురు కొడుకులు కలుగుదురు గాక! అయినా ఇంకొక వరం కోరుకో. నీ వంటి సత్త్వం కల వనితకు ఇది మాత్రమే చాలదు."

ఆ మాటవిని ఆమె తిరిగి "ప్రభూ! మీరు నాపై అనుగ్రహిస్తే ఈ నా భర్త జీవించు గాక! సదా ధార్మికుడై మెలగు గాక!"

ఆ మాటకు "అలాగే కానిమ్ము. అక్షతగాత్రుడై నీ పతి లేచి కూర్చుండు గాక! ధార్మికుడై రాజుకు సంతోషం కలిగించు గాక!" అని భైరవస్వామి అన్నాడు.

ఈ విధంగా నభస్థితుడైన భైరవుడు కనబడకుండానే అన్నంతలోనే అక్షతగాత్రుడై ఆ చోరుడు లేచి కూర్చున్నాడు. అందుతో విస్మితచిత్తుడై రత్నదత్తుడు తన కుమార్తెను తీసుకొని అల్లుడైన ఆ దొంగతో పాటూ ఇంటికి వెళ్ళినాడు. ఆనందిస్తున్న అతని బంధుజనులు కూడా అతనివెంట స్వమందిరంలోనికి ప్రవేశించినారు. పుత్రాదులను పొందిన వాడు గనుక ఆ వర్తకోత్తముడు ఆనందంగా ఉత్సవాన్ని చేసుకున్నాడు.

ఈ సంగతి నంతా విని ఆ రాజు ఏకవీరుడైన ఆ దొంగను పిలిపించుకొని సేనాపతిగా నియమించినాడు. అప్పటినుంచి దొంగతనాన్ని వదలిపెట్టి, ఆ వర్తక కుమార్తెను పెళ్ళిచేసుకొని, ధర్మమార్గంలో ప్రవర్తిస్తూ, రాజునకు ఇష్టుడై, ఏకవీరుడు సుఖంగా ఉన్నాడు."

భేతాళుడు ఈ కథను వినిపించి పూర్వశాపభయం జ్ఞాపకం చేసి త్రివిక్రమసేనుని ఇలా ప్రశ్నించినాడు:

"రాజా! తండ్రితో పాటూ, వచ్చిన ఆ వణిక్కుమార్తెను చూచి ఆ దొంగ, శూలంమీదినుంచి ఏడ్చి, నవ్వినా డెందుకు?''

అంతట రాజు "దుస్థితిలో ఉన్నవాడు రోదించడం సహజమే. అకారణంగా బంధువైన ఈ వర్తకుని ఋణం తీర్చుకొన లేక పోతినే అని ఆశ్చర్యంతో నవ్వినాడు. అంతేకాక ఈ కన్య భాజులను కోరక నాయందు అనురక్తురాలైన దెందుకు? అని

ఆశ్చర్యపడికూడా నవ్వినాడు'' అని ఈ విధంగా చెప్పగా బేతా ళుడు భుజంమీదినుంచి వెళ్ళిపోయినాడు. వానిని పట్టుకొనుటకై ఆ రాజు అతనిని అనుసరించి వెళ్ళినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
ఇరవై ఒకటో తరంగం.

# ఇరవైరెండో తరంగం

త్రివిక్రమసేన భూపాలుడు తిరిగి అశోకవృక్షం వద్దకు వెళ్ళి బేతాళుని తీసుకొని తిరిగి బయలుదేరినాడు. అతని భుజం మీద వ్రేలాడుతున్న బేతాళుడు నడుస్తున్న రాజుతో తిరిగి ఒక కథ చెప్తాను వినమని ఆరంభించినాడు.

## 15వ కథ

నేపాలదేశంలో శివపురమనే పట్టణం కలదు. పూర్వం అక్కడ యశఃకేతు వనే రాజు సార్థక నామధేయుడు కలడు. అతను ప్రజ్ఞాసాగరుడు అనుపేరుగల మంత్రిపై రాజ్యభారం ఉంచి చంద్రప్రభ అనే దేవేరితో భోగాలను అనుభవిస్తున్నాడు. కొంతకాలం తర్వాత ఆ దేవి కొక కన్యక పుట్టినది. జగన్నేత్ర శశిప్రభ అయిన ఆ అమ్మాయి పేరు శశిప్రభ.

క్రమంగా యౌవనవతి అయిన ఆమె వసంతకాలం రాగా ఉద్యానాన్ని చూడడానికై పరివారంతో పాటూ వసంతోత్సవానికి వెళ్ళినది. అక్కడ ఒకానొకచోట ఆమె పూలను కోయదొడగినది. బాహులతనెత్తి ఒక పయోధరం కన్పిస్తుండగా, పూలతొడిమలు రాలుతూ శోభిల్లుతుండగా, ఆమెను అధ్యపుత్రుడైన మన స్వామి అను యాత్రాగతుడైన విప్రు డొకడు చూచినాడు.

చూడగానే మనసును ఆమె హరింపగా మదనమోహితుడైన అతను మనస్వామి (పేరు) అయినా మనస్వామి (మనసునకు యజమాని) కాలేదు. "బాణాలను వేయడానికి మన్మథునికి ఈమె సాయపడే రతీదేవి కావచ్చును. అందుకే వసంత సంభృతాలైన పువ్వుల నిక్కడ ఏరుతున్నది. లేదా వసంతుని వనదేవత

పూజించుటకై పూలనేరుతున్న దేమో!'' అని ఈ విధంగా ఆలోచిస్తూ చూస్తున్న అతనిని ఆ రాకుమారి కూడా చూచినది.

చూచీ చూడగానే రూపుదాల్చిన మన్మథునివలె ఉన్న అతనిని చూస్తూ పూవులసంగతి, శరీరంసంగతి తన సంగతి కూడా మరచిపోయినది.

ఈ విధంగా అన్యోన్య నవప్రేమసరస్సులో వారలా మునిగి ఉండగా అప్పుడే బయట హాహాకారాలు ఉదయించినవి. ఇదేమిటని వారు మెడలెత్తి చూడగా, అక్కడికి మరొక గజ గంధం ముకుపుటాలకు సోకగా క్రోధంతో ఒక మత్తగజం తన్ను కట్టిన సంకెలలను విదిలించుకొని, దారిలో ఉన్న చెట్లను విరుగ గొడుతూ, తనపై అంకుశం వ్రేలాడు తుండగా వస్తున్నది. అంతట పరిజనులు భయపడి పరువెత్తగా ఆ ఒంటరిగా ఉన్న రాజ పుత్రిని తానువెళ్ళి చేతులతో ఎత్తుకున్నాడు.

తన శరీర స్పర్శతో కొద్దిగా భయప్రేమత్రపాకుల అయి ఉన్న ఆమెను మనస్స్వామి ఆ ఏనుగ దారికి చాలాదూరంగా కొనిపోయినాడు. అంతట పరిజనులు పర్వెత్తి వచ్చి ఆ ద్విజోత్త ముని స్తుతించినారు. పదేపదే వెనుదిరిగి చూస్తున్న రాకుమారిని వారు ఇంటికి కొని పోయినారు.

అక్కడ ఆమె తన ప్రాణాలను రక్షించిన అతనినే స్మరిస్తూ స్మరాగ్ని పుటపాకంతో దివానిశలు కరిగిపోతూ ఉన్నది. అతను కూడా ఉద్యానంనుంచి ఆమె వెంట నడిచి, స్వాంతఃపురంలోనికి ప్రవేశించిన ఆమెను చూచి ఉత్కంఠతో ఇలా అనుకున్నాడు: "ఈమె లేకుండా నే నుండలేను. ఇక జీవించాలని కూడా లేదు. ఇప్పుడు నాకీ విషయంలో ధూర్తుడైన సిద్ధుడు, శ్రీ మూలదేవుడనే

నా గురువే గతి” అని ఆలోచించుకొని ఎలాగో ఆ రోజును గడిపి మరునాటి ఉదయం మూలదేవుడనే తన గురువు దగ్గరకు వెళ్ళినాడు.

నిత్యమూ మిత్రునితోనూ, శశితోనూ కలిసి సిద్ధమాయాద్భుత మార్గంలో రూపుగొన్న గగనంవలెనున్న అతనికి నమస్కరించి తన కోరికను తెలియజేసినాడు. అతను కూడా అతని పనిని నెరవేర్చడానికి నిశ్చయించుకుని నవ్వినాడు:

తర్వాత యోగగుళికను ధూర్తపతి నోట్లో వేసుకున్నాడు మూలదేవుడు తా నందుతో బ్రాహ్మణ రూపాన్ని ధరించినాడు. మరి రెండవ గుళికను మనస్స్వామి చేతికిచ్చి మింగమన్నాడు. అందుతో అతనికి సుకాంత కన్యకారూపం వచ్చినది. అంతట వానిని తీసుకొని ధూర్తపతికి నమస్కరించి తన ప్రియురాలి జనకుడైన భూపాలుని ఆస్థానానికి వెళ్ళి బ్రాహ్మడు ఇలా విన్నవించుకున్నాడు.

“ఓ రాజా! నాకొక కొడుకున్నాడు. అతనికోసమై దూరం నుంచి ఒక కన్యను యాచించుకొని, కొనివచ్చినాను. ఈలోగా అత నెక్కడికో వెళ్ళిపోయినాడు. అతనిని వెదకడానికై నేను వెడతాను. ఈమెను అంతవరకూ మీరు రక్షించవలసింది. నా కొడుకును తీసుకొని నేను వచ్చేదాకా ఈమెను నీ వద్ద ఉంచుకొన వలసింది.”

ఈ మాటవిని శాపభీతితో ఆ భూపతి తన కూతురైన శశిప్రభను అక్కడికి పిలిపించినాడు. ఆ కుమార్తెతో ఇట్లన్నాడు: “అమ్మా! నీ వీ కన్యను నీ ఇంటిలోనే ఉంచుకొనవలసింది. నీ ప్రక్కనే కూర్చుండ బెట్టుకొని భోజనాదులను నిర్వర్తించవలసింది. నీ ప్రక్కనే ఆమెకు పడక ఏర్పాటు చేయవలసింది.”

ఇలా తండ్రి చెప్పగా కన్యారూపంలో నున్న ఆ మన స్స్వామిని ఆ రాకుమార్తె తన మందిరం లోనికి కొనిపోయినది, మూలదేవు డేమో బ్రాహ్మణవేషంలో తన పాటికి తాను వెళ్ళిపోగా కన్యారూపంతో నున్న మనస్స్వామి ప్రియాంతికంలో ఉన్నాడు.

కొన్ని దినాలు గడువగా ఆమెను తన స్నేహితురాలుగా భావించి ఆదరిస్తూ రాకుమారి నమ్మినది.

ఒకసారి విరహంతో కృశించి పడకపై దొర్లుతున్న రా కుమార్తెను, ప్రక్క మంచం మీదనే పడుకొని ఉన్న కన్యారూపం లోని మనస్స్వామి రహస్యంగా ఇట్లడిగినాడు :

"చెలీ ! నీవెందు కిలా పాలిపోతున్నావు. రోజురోజుకూ చిక్కి పోతున్నావు? కాంతా ! వియుక్తురాలివలె దుఃఖిస్తున్నావు. నీ విలా ఉండడ మెందుకు? నాకు చెప్పు. స్నిగ్ధముగ్ధ సఖీజనాలపై అవిశ్వాసం పనికిరాదు. నీ వీ విషయాన్ని చెప్పక పోతే నేనిక్కడ నిరశనవ్రతం ఆరంభిస్తాను."

ఆ మాట విని ఆమె నిట్టూర్చి మెల్లగా ఇట్లన్నది: "నీపై కూడా నాకు అపనమ్మకమా? చెప్తాను విను. నే నొకసారి వసం తోత్సవ సమయంలో ఉద్యానాన్ని చూడడానికి వెళ్ళినాను. అక్కడ ఒక సుభగుడైన బ్రాహ్మణపుత్రుని చూచినాను. హిమ ముక్తేందు సుభగుడు, దర్శనంతోనే స్మరోద్దీపనాన్ని చేసే వా డాయన. వసంతం వనాన్ని క్రీడాలంకృతం చేసినట్టుగా నున్న అతనిని, చకోరంవలె నే నా ముఖచంద్రద్యుతి సుఖ సుధాపానా నికై కన్నులింత చేసుకొని చూస్తుండగా, మదజలం స్రవిస్తుం డగా సంకెలలు తెంపుకున్న ఒక మత్తేభం అటు పర్వెత్తి వచ్చి నది.

అకాల కాలమేఘంవలె గర్జిస్తూ ఆ మహాగజం యథేచ్ఛగా పర్వెత్తుతున్నది. అంతట భయభ్రాంతలైన చెలికత్తెలు పర్వెత్తిపోయినారు. అప్పుడా విప్రకుమారుడు నన్నెత్తుకుని దూరంగా కొనిపోయినాడు. ఆయన అంగస్పర్శతో శ్రీకంఠం అలదుకున్నట్టుగా, అమృతంతో తడిసినట్టుగా నే నేస్థితిలోనికి వెళ్ళినానో నాకే తెలియదు.

మరుక్షణంలో పరివారమంతా అక్కడికి రాగా అవశురాలైన నేను స్వర్గంనుంచి భూలోకంలోనికి వలె ఇక్కడికి రాక తప్పలేదు. అప్పటినుంచి అతని సంగమాన్ని సంకల్పించుకుంటూ మేలుకొని ఉన్నప్పటికీ ఆ ప్రాణప్రదుడైన పతి నా ప్రక్కనే ఉన్నట్టు ఊహించుకుంటూ ఉంటాను.

నిద్రపోయినా కలలో చాటూక్తులను పలుపుతున్న అతనిని చూస్తుంటాను. చుంబనాలింగనాదులతో అతను హఠాత్తుగా నా సిగ్గును తొలగించి వేస్తాడు. అతనిని పొందడం కూడా సాధ్యం కాదు. కడ కతని పేరుకూడా నాకు తెలియదు. ఈ విధంగా నా ప్రాణేశ్వర విరహాగ్ని నన్ను దహించివేస్తున్నది."

ఇలా ఆ వాక్సుధతో ఆ విషయ మంతటినీ విని, ఆనందించి ఆ మనస్స్వామి విప్రకన్యారూపం ధరించినవాడు—తాను కృతార్థుడైనట్టు భావించి తన స్వస్వరూపం కనబరచవలసిన కాలం ఆసన్నమైనదని భావించినాడు.

అంతట తన నోటిలోని గుళికను బయటకుతీసి బ్రాహ్మణకుమారుడుగా కన్పించినాడు. ఇట్లా అన్నాడు: "ఓ విలోలాక్షీ! ఉద్యానంలో దర్శనక్రీతుడైన నీకు నిర్వ్యాజ దాసుడనైన వ్యక్తిని నేనే! నీవు చెప్పినట్టుగానే నేనుకూడా క్లేశాన్ని అనుభ

విస్తున్నాను. దానికి ఫలితంగానే నే నీ కన్యారూపాన్ని ధరించ వలసివచ్చింది. కాబట్టి నా విరహవ్యథను తొలగించి, నా కోర్కెను సఫలీకృతం చేయవలసింది. నీవుకూడా ఈ విరహాగ్నిని భరించ లేవు." ఈ విధంగా చెప్తున్న తన ప్రాణేశ్వరుని హఠాత్తుగా చూచి ఆ రాకుమారి వెంటనే స్నేహాశ్చర్య భయాకుల అయినది.

ఆ తర్వాత ఆ ఔత్సుక్యంతో వా రిరువురూ గాంధర్వ వివాహం చేసుకున్నారు. ఆ ప్రేమకు తగినంత రతోత్సవాన్ని అనుభవించినారు. ఆ విధంగా ఆ మనస్స్వామి రెండు రూపాలూ ధరిస్తూ వచ్చినాడు.

గుళికను నోటవేసుకుని పగలు కన్యగానూ, ఆ గుళికను తీసివేసి రాత్రి పురుషుడుగానూ మారుతూ వచ్చినాడు.

ఇట్లా కొన్నాళ్ళు జరిగిన తర్వాత యశఃకేతు మహీపతికి మామ అయిన మృగాంకదత్తుడు తన కూతురు మృగాంకదత్తను, మహార్హవిభవవంతురాలిని, బ్రాహ్మడైన మహామంత్రి ప్రజ్ఞాసాగర కుమారునకు ఇవ్వగా, ఆ మాతులపుత్రి శశిప్రభ, ఆ వివాహానికి మామగారింటికి ఆహ్వానింపగా వెళ్ళినది. ఆమెతో పాటూ కన్యకా పరివారం బయలుదేరినది. వారిలో కాంతకన్యా స్వరూపధారి విప్రపుత్రుడు మనస్స్వామి కూడా ఉన్నాడు. అతనిని చూచి కన్యారూపంలో ఉన్నందున మంత్రిపుత్రుడు మన్మథవ్యాధగాఢ బాణాహతుడైనాడు.

అంతట ఆ కపటకన్యతో అపహృతచిత్తుడై మంత్రిసుతుడు శూన్యమైన స్వగృహానికి స్వవధూసఖుడై వెళ్ళినాడు.

అక్కడ ఆమె ముఖలావణ్యంపై ఆశ చూపింపక తిమిర రాగ మహావ్యాళ దష్టుడైనాడు, సమ్మోహితుడైనాడు. ఇదేమిటని

జనమంతా సంభ్రాంతులై ఉత్సవాన్ని వదలిపెట్టి వెళ్ళగా ఈ సంగతి తెలిసి తండ్రి ప్రజ్ఞాసాగరుడు అతనివద్దకు వెళ్ళినాడు. తండ్రి ఎంత ఓదార్చినా మోహంనుంచి మేల్కొనలేక ఏదో వదరుతున్నట్టు మనోగతాన్ని బయటికి వెలనాడినాడు. మనస్స్వాధీనం తప్పినాడని అనుకొని, ఆ తండ్రి అతి విహ్వలుడు కాగా, ఈ సంగతి తెలిసిన రాజు అక్కడికి వచ్చినాడు. అతనిని చూచి వెంటనే గాఢాలింగనం చేసుకుని సప్తమ మదనావస్థను గూర్చి రాజునకు తెలియజేసినాడు.

అప్పుడా రాజు "మన ఇంటిలో ఎవరో బ్రాహ్మణుడుంచిన అమ్మాయిని అతని కెలా ఇవ్వడం? ఆమె లేకపోతే ఇతను ఆ తర్వాతిదశను పొందడం నిశ్చయం. ఇతని తండ్రి అయిన నా మంత్రి నశించడం నిశ్చయం. ఆయన చనిపోతే రాజ్యమే నశించవచ్చును. ఇప్పుడు దారి ఏమిటి?" ఇలా తలపోసుకున్నాడు.

అక్కడున్న వారందరూ రాజుతో "రాజే ధర్మమని ప్రాజ్ఞులు చెప్తారు. ప్రజల ధర్మరక్షణం ఆయన విధి. దానికి మూలం మంత్రం. ఆ మంత్రం, అదేమో మంత్రికి చెందినది. మంత్రి నశింపగా మూలనాశం అవుతుంది గనుక ధర్మక్షతి సత్యం. అది కాక బ్రాహ్మణుడైన తన మంత్రి, కుమారునితో పాటూ చనిపోతే తనకు ఆ హత్యాపాపం చుట్టుకుంటుంది. అందువల్ల ఈ ధర్మ విప్లవాన్ని నివారించుటకై ఇతనిని కాపాడడం ఆవశ్యకం.

కాబట్టి మంత్రిపుత్రునకు ఒకానొక బ్రాహ్మడు వదలివెళ్ళిన కుమార్తెను ఇవ్వడం ధర్మం. కాలాంతరంలో ఆ వెళ్ళిన విప్రుడు తిరిగి వచ్చినపుడు అతను కోపపడితే ఆ సంగతి అప్పుడు చూడ

కొనవచ్చును'' అని అతను చెప్పగా "సరే" నని రాజు మంత్రి పుత్రునకు ఆ కూటకన్యకను ఇవ్వడానికై నిశ్చయించి రాజ కుమారిక ఇంటినుంచి ఆమెను రప్పించి ముహూర్తం నిశ్చయించి నాడు.

కన్యారూపంలోనున్న మనస్స్వామి ఆ మహీపతితో ఇట్లన్నాడు: "ఎవరికోసమై ఎవరిని రప్పించి నన్ను మరొకరికి ఇస్తున్నారు? అలా అయితే ఓ రాజా! నీవు ధర్మాధర్మ విచక్షణ చేయవలసి ఉంటుంది. నేను ఇలాంటివానిని వివాహం చేసుకోవడానికి ఇష్టపడితే నన్ను బలవంతంగా ఆ మగనితో ఏకశయ్యాగతురాలిని చేయడం మాత్రం సరికాదు. ఆరుమాసాలు తీర్థాలు తిరిగి ఆయన రావాలి. అలాకాకపోతే నేను నా పళ్ళతోనే నాలుకను తెగకొరుకుకొని ప్రాణత్యాగం చేస్తాను.'' ఈ విధంగా శపథం చేయగా రాజునకు మంత్రిపుత్రకుడు తన అనుమతిని తెలియజేసినాడు.

అలాగేనని వివాహం చేసి ఒక గృహంలో ఉంచి చక్కని రక్షణ ఏర్పాటు చేసినాడు. ఆ మొదట మృగాంకవతి వద్ద కూట వధువును వదలి తీర్థయాత్రలకై ఆ మూఢుడు కాంతాప్రియేచ్ఛతో వెళ్ళినాడు. మనస్స్వామి స్త్రీ రూపంతోనే ఉండి మృగాంకవతితో పాటూ ఒకే ఇంటిలో సమానశయనాసనాదులతో కాలం గడిపి నాడు.

ఇట్లా ఉండగా ఒకానొక రాత్రి మృగాంకవతి శయ్యాగృహంలో రహస్యంగా మిగతా పరివారమంతా నిద్రపోతుండగా ఇలా అన్నది: "ఓ చెలీ! నాకు నిద్రరావడం లేదు. ఏదైనా ఒక కథ చెప్పవలసింది."

ఈ మాట విని స్త్రీ రూపంలో ఉన్న ఆ యువకు డిలా చెప్ప సాగినాడు.

"పూర్వం సూర్యవంశజుడైన పలాఖ్య రాజర్షి ఒక డున్నాడు. అతను గౌరీ శాపంతో స్త్రీత్వం పొందినాడు. విశ్వైకమోహనంగా ఉన్నాడు. దేవోద్యాన వనాంతరంలో అన్యోన్య దర్శన ప్రీతితో అతనికి బుధునితో సంయోగం కలిగి పురూరవుడు కలిగినాడు." ఆ కథను చెప్పి ఆ ధూర్తుడు తిరిగీ ఇట్లన్నాడు:

"ఈ విధంగా దేవతాదేశంవల్ల కానీ పురుషుడు స్త్రీ కావచ్చును. అలాగే స్త్రీ కూడా పురుషుడు కావచ్చును. ఇలాంటి సంయోగాలు గొప్పవారి విషయంలో కూడా కామనతో సంభవాలౌతాయి.

ఈ మాట విని వివాద ప్రోషిత అయినా ముగ్ధ మృగాంకవతి సహవాసంవల్ల విశ్వసించినదై ఇట్లన్నది: "నేను చెప్పే కథను కూడా విను. ఒళ్ళంతా ఉడికిపోతున్నది. హృదయం శిథిలమౌతున్నది. ఇదేమిటో చెప్పు?"

ఆ మాటవిని అంగనారూపంలో ఉన్న విప్రుడు తిరిగీ ఇట్లన్నాడు: "ఇవన్నీ కామచిహ్నాలు. ఇవి అపూర్వమైనవి. నేనూ ఇలాంటివాటిని అనుభవించినాను. నీ దగ్గర దాచడం ఎందుకు?"

ఆ మాటవిని ఆ మృగాంకవతి మెల్లగా ఇట్లన్నది: "సఖీః ప్రాణసమురాలవు నీవు. ప్రాజ్ఞురాలవు. ఒక సంగతి చెప్పలేవా? ఏదో ఒక ఉపాయంతో ఇక్కడికి పురుషుని ప్రవేశం సాధ్యమా?"

ఈ విధంగా అడుగగా ఆంతర్యం గ్రహించి "ధూర్తపతి శిష్యుడు చెప్పినట్టుగా నేనూ చెప్తాను. నాకు విష్ణుమూర్తి అను

గ్రహం ఉన్నది. దానితో స్వేచ్ఛగా రాత్రులలో పురుషుడు కాగలను. ఇప్పుడు నీ కోసమై మగవాడి నౌతాను'' అని చెప్పి మనస్స్వామి నోటిలోనున్న గుళికను బయటికి తీసినాడు.

యౌవనోద్దామమైన తన రూపాన్ని ఆ కాంతకు చూపించి నాడు. అంతట ఏవో గుసగుసలతో, అన్ని కట్టుబాట్లనూ తెంపు కొని, సాలోచిత రసమైన ఒకానొక రతోత్సాహం వారిద్దరిమధ్యా నడిచినది.

అంతట ఆ మంత్రి కుమారుని భార్యతో పాటూ, ఆ విప్రుడు పగలు స్త్రీగానూ, రాత్రి పురుషుడుగానూ ఉంటూ వచ్చినాడు. త్వరలోనే మంత్రిసుతుడు రానున్నాడని తెలుసుకొని, ఒకరాత్రి ఆమెను తీసుకొని, స్వేచ్ఛగా అతనెక్కడికో పలాయనమైనాడు.

ఈ కథాసంధిలో అతని గురువైన మూలదేవుడు జరిగిన దంతా తెలుసుకొని, తిరిగీ వృద్ధ బ్రాహ్మణ వేషంతో తరుణ ధ్వజ రూపి అయిన శశి అనువానితో అనుగతుడై, ఆ యశఃకేతు మహా రాజు వద్దకువచ్చి వినమ్రుడై ఇలా అన్నాడు:

"నేను నా కుమారుని కొనివచ్చినాను. నా కోడలిని నాకు అప్పగించండి.''

ఈ మాటకు రాజు మంత్రులతో సంప్రతించి శాపభీతితో ఆయనతో ఇట్లన్నాడు: "ఓ బ్రాహ్మడా! నీ కోడ లెక్కడికిపోయి నదో నాకు తెలియదు. నన్ను క్షమించ వలసింది. ఈ అపరాధ పరిహారార్థమై నీ కుమారునకు నా కూతురు నిచ్చి వివాహం చేస్తాను." అని చెప్పి కపటక్రోధోదగ్రుడైన ఆ విప్రునకు అలా విన్నవించుకున్నాడు:

పుత్రు డనే వ్యపదేశంతో కొనివచ్చిన తన మిత్రుడైన శశికి యథావిధిగా శశిప్రభ నిచ్చి వివాహం చేసినాడు.

అంతట మూలదేవుడు వధూవరులను తీసుకొని రాజ్యార్థాదులందు స్పృహలేని వాడుగనుక తన ఇంటికి ఆమెను కొని పోయినాడు. అక్కడికి మనస్స్వామి కూడా వచ్చినాడు. ఆ మూలదేవుని ముందట శశి మనస్స్వాముల మధ్య గొప్ప వివాదం చెలరేగినది.

మనస్స్వామి "శశిప్రభ నాది, నాకివ్వాలి. గుర్వనుగ్రహం వల్ల ఇంతకుముందే నే నీమెను వివాహమాడి ఉన్నాను" అన్నాడు. ఆ మాటకు శశి అన్నాడు కదా "నీ కీమె ఏ మౌతుంది? మూర్ఖుడా! ఈమె నా భార్య. అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్నాను." ఈ విధంగా మాయాబలంవల్ల ప్రాప్తించిన రాజపుత్రి కోసమై వారు ఆ వివాదంలో దిగినారు"

అని బేతాళుడు ఈ కథను చెప్పి "ఓ రాజా! ఆమె వారిలో ఎవరికి భార్య కావాలి? ఈ సందేహాన్ని నీవు తీర్చవలసింది. పూర్వం మనం చేసుకున్న సమయం ఒక టున్నది" అని బేతాళుడనగా త్రివిక్రమసేనుడు ఇలా జవా బిచ్చినాడు:

"న్యాయంగా ఆ రాజకుమార్తె శశికే భార్య కావలెనని భావిస్తాను. ఆయనకే తండ్రి ధర్మమార్గంలో దానం చేసినాడు. మనస్స్వామి చౌర్యంవల్ల గాంధర్వవిధితో ఆమెను పొందినాడు. దొంగకు, తాను దొంగిలించిన ఇతరుల ఆస్తి ఎన్నటికీ తనదికాదు" అని చెప్పగా ఆ మాటవిని బేతాళుడు తిరిగి హఠాత్తుగా ఆయన భుజం మీదినుంచి దిగి వెళ్ళిపోయినాడు.

రాజుకూడా అతనిని వెదుక్కుంటూ వెనువెంటనే వెళ్ళినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీలంబకంలోని
ఇరవైరెండో తరంగం.

# ఇరవైఐదో తరంగం

త్రివిక్రమసేన మహారాజు తిరిగి అశోకవృక్షం వద్దకువెళ్ళి, బేతాళుని తీసుకొని, భుజంమీద వేసుకుని తిరిగి బయలుదేరినాడు.

## 16 వ కథ

సర్వరత్నగర్భమైన ఆ హిమవంత మనే పర్వతం హర కాంతలైన గౌరికీ, గంగకూ కూడా సమానంగా జన్మభూమి. దాని పై భాగాన్ని ఈశ్వరుడు స్పృశింపలేదు. ముల్లోకాలలోనూ కుల పర్వతాలలో అభిమానంలో ఉన్నతమైనదిగా దానిని కీర్తిస్తారు. దాని సానువులపై అన్వర్థనామధేయం కల కాంచనపుర మనే పట్టణం కలదు.

సూర్యుడు తన కిరణాల నన్నిటినీ కుప్పవోసినట్టుగా ప్రకాశిస్తూ ఉంటుందది. ఆ పట్టణంలో పూర్వం జీమూతకేతుడు అనే విద్యాధరాధీశ్వరుడు మేరుపర్వతంపై ఇంద్రునివలె ఉండేవాడు. అతనికి తన గృహోద్యానంలో వంశాగతమైన కల్పవృక్షమొకటి కలదు. అది అందరి అన్ని కోర్కెలనూ తీర్చేదిగా ప్రసిద్ధమైనది. ఆ దేవతాత్మకమైన దానిని ప్రార్థించగా ఆ రాజునకు దాని అనుగ్రహంవల్ల పూర్వస్మృతిగల బోధిసత్త్వాంశలో పుత్రు డొకడు కలిగినాడు.

దానవీరుడు, మహాసత్త్వుడు, సర్వభూతదయాస్వరూపుడు, గురుశుశ్రూషాపరుడు అయిన అతని పేరు జీమూతవాహనుడు.

అతను యౌవనం రాగా, యువరాజుగా అభిషిక్తుడైనాడు. సత్పురుషులైన సచివులు అతని గుణాలను చూచి అందుకు ప్రేరేపించినారు. యువరాజుగా ఉండగా, ఒకానొకసారి జీమూత

వాహనునకు హితైషులైన తండ్రిగారి మంత్రులు వచ్చి ఇట్లా విన్నవించుకున్నారు:

"దేవా! సర్వార్థకామప్రదమైన కల్పతరువు మనవద్ద నున్నది. సర్వభూతాలకూ అజేయమైనది. దాని నెల్లప్పుడూ మీరు పూజించవలసింది. అది మనవద్ద ఉన్నంతవరకూ దేవేంద్రుడైనప్పటికీ మనలను బాధింపలేడు. ఇక ఇతరుల సంగతి చెప్పవలసిన దేమున్నది?"

ఈ మాటవిని జీమూతవాహనుడు తనలో ఇలా అనుకున్నాడు: "అయ్యో! ఇంత గొప్ప కల్పవృక్షం మావద్ద ఉన్నప్పటికీ మా పూర్వులు దానినుంచి పొందవలసినంత ఫలం పొందలేదేమిటి? ఏవో చిన్నచిన్న కోర్కెలతో దీనోచితములైన వానితో ఆ మహాత్ములు కూడా తేలికపడిపోయినారు. కాబట్టి నేను ఈ పాదపంనుంచి నా మనోగతాన్ని పూర్తిగా సాధిస్తాను" అని నిశ్చయించుకొని ఆ మహాసత్త్వుడు తన తండ్రివద్దకు వెళ్ళినాడు.

అక్కడ అనేక శుశ్రూషలుచేసి సంతోషపెట్టి, సుఖాసీనుని చేసి ఏకాంతంలో తండ్రితో ఇట్లన్నాడు: "నాన్నా! నీ కిదంతా తెలిసినదే. ఈ భవజలధిలో శరీరంమొదలుకొని సర్వమూ తరంగ విలాస చంచలం. విశేషించి ఇది చిరస్థాయి కాదు. ఈ ప్రకాశం ఎప్పుడో ఆరిపోయేదే! సంధ్య, విద్యుత్తు, లక్ష్మి ఇవి ఎప్పుడూ ఎక్కడా స్థిరంగా ఉండడం చూడలేదు. ఈ ప్రపంచంలో పరోపకార మొక్కటే శాశ్వతమైనది. ధర్మము, యశస్సు యుగాంత శతసాక్షులై ఉంటాయి. కాబట్టి తండ్రీ, క్షణికాలైన భోగాలపై ఆశతో మనం ఈ కల్పవృక్షాన్ని ఎందుకోసమై వ్యర్థంగా కాపాడుకుంటూ వస్తున్నాము?

ఇది నాది, నాది అని ఎంతో పట్టుదలతో, మన పూర్వులు రక్షిస్తూ వచ్చారు కదా, ఎక్కడెక్కడ, ఎవరెవరికోసం ఎవరు దీనిని వినియోగించినారు? కాబట్టి కేవలం పరోపకార ఫల సిద్ధి కోసమై, మీ రనుజ్ఞ ఇస్తే ఈ కోరికలు తీర్చే కల్పవృక్షాన్ని నేను సద్వినియోగం చేస్తాను."

ఆ మాట విని తండ్రి అనుజ్ఞ ఇవ్వగా జీమూతవాహనుడు కల్పవృక్షం దగ్గరకు వెళ్ళి ఇట్లా అన్నాడు:

"ఓ దేవా! మా పూర్వుల మనోరథాల నెన్నింటినో నీవు నెరవేర్చినావు. ఈ నా కోర్కెను అనన్యమైన దానిని తీర్చవలసింది. ఈ భూలోకాన్ని దరిద్రరహితంగా నేను చూడగలిగేట్టు చెయ్యి. నీకు భద్రమగుగాక! ఇక అర్థార్థి అయిన లోకానికి నిన్ను దానం చేస్తున్నాను."

ఈ విధంగా అంజలి ఘటించి జీమూతవాహనుడు ప్రార్థింపగా "నీవు నన్ను వదలి వేసినావు. నేను తిరిగి జన్మించినాను" అన్న వాక్యం ఆ వృక్షం నుంచి వినవచ్చినది.

క్షణంలో ఆ కల్పవృక్షం గగనాని కెగసి బంగారువర్షం కురిపించినది. అందుతో ఎవరూ భూలోకంలో దుర్గతితో ఉండవలసిన అవసరం లేకుండా పోయింది.

ఆ విధంగా తీవ్ర సర్వజీవకారుణ్యంతో జీమూతవాహనుడు త్రిలోకాలలో ప్రఖ్యాతి చెందినాడు. అందుతో అతని దాయాదు లందరూ మాత్సర్యంతో సహింపలేక, లోకంలోని ఆర్తిని తీర్చుటకై కల్పవృక్షాన్ని పోగొట్టుకున్న అతనిని, తండ్రితోపాటూ జయించవచ్చునని భావించి, అందరూ కలిసి సంప్రతించుకుని,

కృతనిశ్చయులై, ఆ రాజ్యాపహరణార్థమై యుద్ధానికి దిగినారు. అది చూచి తన తండ్రితో జీమూతవాహనుడు ఇట్లన్నాడు:

"నాన్నా! నీవు ఆయుధమే ధరిస్తే నిన్ను జయించగలవా డెవడున్నాడు? కానీ ఈ పాపకార్యం కోసం నశ్వరమైన ఈ శరీరం కోసం దయావిహీనుడై బంధువులను చంపి ఈ రాజ్యాన్ని అభిలషించేవా డెవ్వడు? ఈ రాజ్యంతో మన కేమి పని? మన మింకోచోటి కెక్కడికో వెళ్ళి ఇహపర సాధనకై ధర్మాన్ని ఆచరిద్దాము. ఈ కృపణులు, దాయాదులు ఈ రాజ్యంపై ఆకాంక్షతో ఉన్నారు గనుక దీనితోనే వారు సంతోషించనీ."

ఇలా అంటున్న కొడుకుతో తండ్రి జీమూతకేతువు ఇట్లన్నాడు: "నేను నీకోసమై ఈ రాజ్యాన్ని వాంఛించినాను. నీవే దీనిని వదలి పెట్టేటట్టుంటే కృపావిష్టుడనైన వృద్ధుడనైన నాకు దీనితో నేమి పని?" అని ఆయన అనుజ్ఞ ఇవ్వగా తలిదండ్రులతో కలిసి తన రాజ్యాన్ని వదలివేసి జీమూతవాహనుడు మలయాద్రికి వెళ్ళిపోయినాడు.

చందన సంఛన్నములైన సెలఏళ్ళతో, గుహలతో నిండిన ఆ పర్వతంపై ఒక ఆశ్రమం నిర్మించుకొని తండ్రిని సేవిస్తూ ఉండిపోయినాడు.

అక్కడ మిత్రావసువనే స్నేహితు డొక డాయనకు దొరికినాడు. అక్కడ సిద్ధరాజుగానున్న విశ్వావసుని కొడు కతను.

ఒకసారి అటూ ఇటూ తిరుగుతూ ఉపవనంలోనున్న గౌరీ దేవాలయాన్ని చూడడానికి జీమూతవాహనుడు వెళ్ళినాడు. అక్కడ ఒక వరకన్యక వీణావాదనం చేస్తున్నది. సఖీజనులందరూ చుట్టూ ఉన్నారు. ఆమె పార్వతీదేవి పూజచేస్తున్నది. ఆ మంజుల

సంగీతాన్ని వింటూ మృగాలు కూడా ఆమె కళ్ళ మెరుపును చూచి సిగ్గుపడినట్టుగా నిశ్చేష్టములై నిలిచిపోయినవి.

తన కళ్ళతో కృష్ణార్జున దర్శన మిస్తూ పాండవసేనవలె కర్ణప్రవేశం చేస్తున్నదామె. పరస్పర విమర్దనంతో ముఖారవింద దర్శనానికై అవకాశమివ్వక అతృప్తములైన, సమ్ముఖములైన స్తనాలతో నున్నది. ఆమెను సృజించుటలో బ్రహ్మగట్టిగా పట్టు కున్నప్పుడు సన్నవడినట్టున్న, వళీమగ్నమైన అంగుళీముద్రను ధరించి చిక్కిపోయి అందంగా నున్నది. అలా ఉన్న ఆ కాంత నాతడు చూచినాడు.

ఆమెను చూడగానే జీమూతవాహనుడు అంతరదృష్టిమార్గ ప్రవిష్టురాలైన ఆమెతో అపహృత చిత్తుడైనాడు. ఆమె కూడా ఆ ఉద్యానానికే భూషణంగానున్న ఉత్కంఠా వికారమైన మన్మ థుని దహించి వేసితినే అని విరక్తి చెంది, మధువనాన్ని ఆశ్ర యించినట్టున్న అతనిని, చూచిఅనురాగవివశురాలై ఆ కన్య విర హస్థ అయినది. ఆమెకు సఖివంటి వీణ ఆకులంగా ఆలపించినది. అంతట ఆమె సఖిని జీమూతవాహనుడు ఇలా ప్రశ్నించినాడు:

"నీ స్నేహితురాలి భవ్యనామ మేమిటి? ఈమె అలంక రించిన వంశ మేది?" ఆ మాట విని ఆ సఖి ఇట్లన్నది: "ఈమె పేరు మలయవతి. మిత్రావసువు చెల్లెలు. సిద్ధరాజైన విశ్వావ సుని కూతురు" అని చెప్పగా సహృదయురాలైన ఆమె, జీమూతవాహనుని నామాన్వయాదులను, అతనితో వచ్చిన ముని పుత్రునిద్వారా అడిగి తెలుసుకున్నది:

ఆ మలయవతితో స్మితమితాక్షరంగా ఇట్లన్నాడు: "ఓ సఖీ! ఈ విద్యాధరునకు ఆతిథ్యమివ్వవా? జగత్పూజ్యుడైన అతిథి

ఈయన!'' అని అనగా ఆ విద్యాధర పుత్రిక సిగ్గుతో తలవంచు కుని మిన్నకున్నది.

"ఈమె లజ్జావతి కాబట్టి నేనే అర్థిస్తాను. మా ఆతిథ్యం గ్రహించండి" అని ఆమె సఖులలో ఒకతె ఆతిథ్యంతో పాటూ పూలమాల నిచ్చినది.

దానిని తీసుకొని జీమూతవాహనుడు ప్రేమనిర్భరుడై ఆ మాలను మలయవతి కంఠంలో వేసినాడు. ఆమె వెనుదిరిగి ఆయన కంఠంలో నీలోత్పలమాలను వేస్తున్నట్టుగా క్రీగంటచూసి నది.

ఈ విధంగా చడీచప్పుడు లేకుండా స్వయంవరం చేసు కొన్న వారి వద్దకు ఒక చేటి వచ్చి ఆ సిద్ధకన్యకతో ఇట్లన్నది: "రాజపుత్రీ! మీ తల్లిగారు మీ కోసమై చూస్తున్నది కాబట్టి త్వరగా రా!''

ఆ మాట విని కామ బాణ కీలితురాలైన ఆమె ఎలాగో దాని నుంచి తప్పించుకొని ఉత్కంఠతో కూడిన ప్రియముఖాకృష్టమైన దృష్టిని మరల్చుకొని ఇంటికి వెళ్ళినది. తద్గతచిత్తుడై జీమూత వాహనుడు కూడా తన ఆశ్రమానికి వెళ్ళిపోయినాడు.

ఆమె తల్లిని చూచి ప్రాణేశ విరహాతురురాలై పర్యంకంపై వాలిపోయినది. అంతట అంతర్గత కామాగ్ని ధూమంతోవలె కనులు కలత చెందగా కన్నీరు పదులుతూ సంతాపాన్ని తెలిపే అవయవాలతో చెలులు చందనాన్ని లేపనం చేసి తామర వీవన లతో వీస్తుండగా పడుకున్నది. కానీ ఆ శయనంపై కానీ, తన అంగంపై కానీ, భూతలంపై కానీ ఎక్కడా ఆమెకు సంతోషం కలుగలేదు.

రక్తురాలైన సంధ్యతో పాటూ ఆ రోజెలాగో గడిచిపోగా, నవ్వుతున్న ప్రాచీముఖాన్ని చంద్రుడు గట్టిగా పట్టుకుని ముద్దిడుతుండగా, మన్మథుడు ప్రేరేపించినప్పటికీ సిగ్గువల్ల దూతిని పంపడంవంటి వాటికి ఆమె అశక్తురాలైనది. చంద్రునితో కుసుమించిన ఆ రాత్రి నెలాగో తామరతీగవలె గడిపి మోహపటలాన్ని ఎలాగో నియమితం చేసుకొని, హృదయాన్ని సంకుచితం చేసుకున్నది.

అక్కడ ఈమెను విడనాడడంవల్ల జీమూతవాహనుడు కూడా శయనస్థుడైనప్పటికీ కుసుమశరుని చేతిలో పడినాడు. నూతన జనితరాగుడైనప్పటికీ పాండురకాంతి కలవాడైనాడు. సిగ్గుతో మూగవాడైనా తన కామజనితమైన పీడను తెలియజేస్తూ ఆ రాత్రిని గడిపి వేసినాడు.

ఉదయమే అత్యుత్సుకుడై ఆ సిద్ధాధిపతి పుత్రిక కనిపించిన గౌరీమందిరానికి వెళ్ళినాడు. అతనివెంట మునిపుత్రుడు ఉండి మదనానల విహ్వలుడైన అతనిని ఓదార్చసాగినాడు. అంతలో ఆమెకూడా అక్కడికివచ్చి నిర్జన ప్రదేశంలో గుప్తంగా విరహాతురురాలై ఆత్మత్యాగానికి సిద్ధమైనది.

చెట్లమాటుననున్న తన ప్రియుని కానక కన్నీరు కురుస్తున్న ఆమె గౌరీదేవి కిలా విజ్ఞాపన చేసుకున్నది: ఓ దేవీ! నీ భక్తితో జీమూతవాహనుడు నాకీ జన్మలో భర్తకాకపోతే మరొక జన్మలోనయినా భర్తకావాలి” అని చెప్పి తన ఉత్తరీయంతో వెంటనే అశోక తరు శాఖకు గౌరీ సన్నిధిలో ఉరితాడును కట్టి తయారు చేసుకున్నది. “ఓ నాథా! విశ్వవిఖ్యాత కరుణాలోలుడవైనప్పటికీ దేవా! జీమూతవాహనా! నన్నెందుకు రక్షింపలేదు”

అని అంటూ ఆ ఉరిని మెడకు తగిలించుకున్నది. వెంటనే ఆకాశం నుంచి దేవిమాట లిలా వినవచ్చినవి:

"కుమారీ! సాహసం చేయవద్దు. నీ భర్త చక్రవర్తి. విద్యాధరేంద్రుడు. ఆ జీమూతవాహనుడే నీకు భర్త కాగలడు" అని దేవి చెప్పగా విని వయస్యునితో పాటూ ఉన్న జీమూతవాహనుడు సంతోషిస్తున్న ప్రియు రాలివద్దకు వచ్చినాడు.

"చూశావా! ఆమెకు దేవి వరమిచ్చినది. నిజంగానే నీకు దత్తం చేసినది'' అని ఆమెను గూర్చి ముని పుత్రకు డన్నాడు.

జీమూతవాహనుడు ప్రణయపేశలమైన మాటలతో తన చేతితోనే, ఆమె మెడకు తగుల్చుకున్న త్రాటిని తీసివేసినాడు. అంతట, అకస్మాత్తుగా వచ్చిన సుధావర్షంవల్ల వారు భావించు కున్నారు. మలయవతి సిగ్గుతో చూస్తూ నేలపై కాలితో రాయ సాగినది. "సఖీ! కల్యాణీ! అభీష్టసిద్ధితో వర్ధిల్లుతున్నావు. ఇప్పుడే మీ తండ్రి విశ్వావసు మహారాజునకు, నేనుండగానే కుమారుడైన మిత్రావసుడు ఇట్లా విజ్ఞప్తి చేసినాడు''

"జగన్మాన్యమైన కల్పతరువువంటి విద్యాధరేంద్ర తన యుడు జీమూతవాహనుడు ఇక్కడికి వచ్చినాడు. అతిథి గనుక మన మాయనను సత్కరించాలి. మరి మన కటువంటి మరొక వరుడు దొరకడు గనుక ఈ మలయవతిని ఆయన కిచ్చి అర్చిం తాము." దానికి సరేనని రా జనగా మీ అన్న విశ్వావసువు ఆయన కోసమై ఈ మహాభాగుని ఆశ్రమానికి వెళ్ళినాడు. మన ఇంటిలో నీ వివాహం వెంటనే జరుగనున్నది. కాబట్టి మనం ఇంటికిపోదాము. ఈ మహాభాగుడు కూడా తన ఇంటికి వెళ్ళనీ!'' అని చెప్పగా ఆ

సఖితోపాటూ ఆ రాజపుత్రి మెల్లగా హర్షంతో ఉత్కంఠతో పదే పదే వెనుదిరిగి చూస్తూ వెళ్ళిపోయినది.

జీమూతవాహనుడు కూడా వెంటనే తన ఆశ్రమానికి వెళ్ళి మిత్రావసువు వచ్చి తన అభీష్టాన్ని తెలియజేయగా విని అభినందించినాడు. పూర్వజన్మ జ్ఞానం కలవాడు గనుక అతనితో తానిట్లన్నాడు: "ఎక్కడైతే మిత్రుడు ఉంటాడో, అక్కడ అతని చెల్లెలే భార్య అవుతుంది.'' అంతట మిత్రావసువు సంప్రీతుడై ఇలా జరిగినందుకు సంతోషిస్తుండగా వెళ్ళి వారి కీ సంగతి చెప్పి వారిని సంతోషపెట్టినాడు.

జీమూతవాహనుని తన ఇంటికి తీసికొని వెళ్ళి తన శక్తికి ఉచితమైన రీతిలో మహావైభవంగా ఉత్సవ సంభారాన్ని సమకూర్చినాడు.

అదే శుభదినాననే విద్యాధర ప్రభువు తన చెల్లెలు మలయవతికి వివాహం జరిపించినాడు. తర్వాత ఆ నవవధువుతో కలిసి జీమూతవాహనుడు సిద్ధమనోరథుడైనాడు.

ఒకసారి కుతూహలం కొద్దీ ఆ మిత్రావసువుతో కలిసి మలయాద్రిలో తిరుగుతూ సముద్రతీర వనానికి వెళ్ళినాడు. అక్కడ అనేకంగా పడిఉన్న అస్థిరాసులను చూచి మిత్రావసువు నిలా ప్రశ్నించినాడు: "ఏ ప్రాణుల ఎముకల ప్రోవు లివి?''

అప్పుడు బావమరది అయిన మిత్రావసువు ఆ దయాళువుతో ఇట్లన్నాడు:

"ఈ వృత్తాంతాన్ని సంక్షేపంగా చెప్తాను విను. పూర్వం నాగమాత అయిన కద్రువ, గరుడుని తల్లి అయిన వినతను

ఏదో పందెంవేసుకుని, ఆ మిషతో తనకు దాసినిగా చేసుకున్నది. ఆ వైరంతో గరుడుడు తల్లిని ఆ దాసీనతనంనుంచి విమోచనం చెందించినప్పటికి బలవంతుడైన ఆయన కద్రువపుత్రులైన నాగులను భక్షించడం ఆరంభించినాడు.

పాతాళంలోనికి వెళ్ళి వానిలో చాలా వాటిని చంపివేసినాడు. కొన్నిటిని చీల్చివేసినాడు. కొన్ని తమంతట తామే భయంతో చనిపోయినవి.

ఇదంతా చూచి ఇది సర్వక్షయానికి కారణమౌతుం దేమోనని అనుమానించి నాగరాజైన వాసుకి గరుడుని ప్రార్థించి ఒక సమయం ఏర్పరచుకున్నాడు.

"ఒకొకరోజు ఒకొక నాగుని నీ ఆహారార్థమై పంపుతాను. దక్షిణసముద్రం ఇసుకతిప్పల వద్దకు ప్రతిరోజూ ఒకనిని పంపుతాను. నాగులన్నీ ఒకేసారి నాశనమైపోతే నీకు వచ్చే లాభమేమిటి?" అని నాగరాజు చెప్పగా స్వార్థదర్శి అయిన గరుడుడు ఆ ఏర్పాటుకు అంగీకరించినాడు. అప్పటినుంచి ఒకొక్క నాగుని వాసుకి పంపగా, దినదినమూ ఆ సముద్రతీరంలో గరుడుడు భుజిస్తూ ఉంటాడు. కాలక్రమంగా గరుడుడు తినివేసిన నాగుల అస్థిసంచయాలు కొండలవలె పెరిగి ఉన్నవి." మిత్రావసు విలా చెప్పగా విని దుఃఖంతో, దయాధైర్యనిధి అయిన జీమూతవాహనుడు ఇట్లన్నాడు:

"అసలా వాసుకిని చూచి జాలిపడాలి. మగసిరి లేక తన చేతులారా శత్రువుకు ప్రతిదినమూ తన ప్రజలను ఉపాహారంగా పంపుతున్నాడు. వెయ్యి ముఖాలు కలిగి ఉన్నప్పటికీ ఒక ముఖంతోనైనా "ఓ గరుడుడా! నన్ను ముందు తిను" అని చెప్పలేక పోయినాడే.

రోజురోజు నాగాంగనలు ఆక్రోశిస్తుండగా వింటూ కూడా దయలేక సత్త్వహీనుడై ఆ గరుడునికోసమై స్వపక్ష క్షయానికి పాల్పడినాడు. పోనీ తార్క్ష్యుడైనా తాను కశ్యపపుత్రుడు, పీరుడూ కృష్ణాధిష్ఠానంతో పవిత్రుడైన వాడూ అయినప్పటికీ ఇలాంటి పాపానికి దొరకొన్నాడు. మోహమెంతటి అధమమైనది"

అని చెప్పి ఆ మహాసత్త్వుడు మనసులో ఇలా అనుకున్నాడు: "ఈ నిస్సారమైన దేహంతో నే నేదో సారాన్ని గ్రహించవలెను. కనీసం ఒక్కనాగుని జీవితాన్నైనా రక్షిస్తాను. బంధుహీనుడు, భీతుడు అయిన నాగునికి బదులుగా నన్ను గరుడునికి అర్పించుకుంటాను." ఇట్లా ఆయన మనసులో అనుకుంటుండగానే తండ్రి విశ్వావసువు దగ్గరనుంచి ప్రతీహారి అతనిని పిలుచుకొని పోవుటకై వచ్చినాడు. "నీవు వెళ్ళు. నేను తర్వాత వస్తాను" అని చెప్పి జీమూతవాహనుడు మిత్రావసువును ఇంటికి పంపించివేసినాడు.

అతనలా వెళ్ళగా ఒంటరిగా తన కోర్కెను నెరవేర్చు కొనుటకై తిరుగుతున్న ఆ దయాళువునకు దూరంనుంచి అతి కరుణమైన రోదనధ్వని వినిపించినది. ఆ వైపు వెళ్ళి, ఎత్తైన శిలాతలం సమీపంలో దుఃఖిస్తూన్న ఒక సుందరాకృతి అయిన ఒక యువకుని చూచినాడు. రాజభటుడు అక్కడికి తెచ్చి వదలి వేసి అతనిని, తిరిగి వెళుతుండగా ఒక వృద్ధస్త్రీ ప్రాధేయపడుతూ ఏడుస్తున్నది.

ఆ కరుణాకులిత ధ్వనితో కదలిపోయిన జీమూతవాహనుడు జిజ్ఞాసతో "ఎవరితను?" అని ఆలోచిస్తుండగనే, దుఃఖభారంతో వియుక్తురాలైన ఆ వృద్ధ స్త్రీ ఆ యువకుని మరీమరి చూచి దుఃఖిస్తూ తిరిగివచ్చినది.

"ఓ శంఖచూడా! దుఃఖశతం నీ మీదపడినది కదా! నీవు గుణవంతుడవు, వంశానికంతా ఒకడవు. కుమారా! తిరిగి ఇక నేను నిన్నెప్పుడు చూస్తాను? నీ ముఖచంద్రుడు అస్తంగతుడు కాగా మీ తండ్రి శోకాంధకారగతుడై వృద్ధాప్యంలో ఏమైపోతాడు? ఈ ఎండవేడిమికి కందిపోతున్న నీ శరీరం ఆ గరుడుడు ముక్కుతో పొడిచి తింటుండగా ఆ బాధను ఎలా భరించగలదు? ఇంత విశాలమైన నాగలోకంలో నాగరాజునకు నీవే దొరికావా? నాకున్న ఒకే ఒక కొడుకువు నీవు? నేనెంత దురదృష్టవంతురాలను" అని ఆమె విలపిస్తుండగా కుమారుడైన ఆ యువకు డిట్లా అన్నాడు:

"ముందే దుఃఖార్తుడనై ఉన్ననన్ను మరింత దుఃఖపరుస్తావెందుకమ్మా? దయచేసి నువ్వు ఇంటికి వెళ్ళు. కడపటి నమస్కారం చేస్తున్నాను. ఇంతలో గరుత్మంతుడు వచ్చేవేళకూడా కావస్తున్నది."

ఆ మాట విని "అయ్యో! నా కొడుకును కాపాడే వాడెవడూ లేడా?" అని ఆ ముసలమ్మ ఆర్ద్రదృష్టితో దిక్కులను పరికించినది.

ఇంతలో బోధి సత్త్వాంశలో పుట్టిన జీమూతవాహనుడు ఆ మాటలను విని, ఆ దృశ్యం చూచి దయాక్రమిత హృదయుడై ఇలా అనుకున్నాడు: "అయ్యో! ఈ శంఖచూడుడనే నాగుడు, ఆ గరుడునికి ఆహారంగా వాసుకి పంపగా వచ్చినట్లున్నాడు. తల్లి పాపం స్నేహంతో అతనివెంట వచ్చినది. ఒక్కగా నొక్క కొడుకున్న ఈ వృద్ధ స్త్రీ దుఃఖంతో అతిదీనంగా విలపిస్తున్నది.

ఎలాగూ నశించిపోయే ఈ శరీరంతో అర్తుడైన ఈ ఒక్క నాగునీ ఇప్పుడు నేను రక్షించలేకపోతే నా జన్మ నిష్ఫలం" అని ఆలోచిస్తూ సంతోషంతో ఆమె వద్దకు వెళ్ళి ఇట్లన్నాడు:

"అమ్మా! నీ కొడుకును నేను రక్షిస్తాను." ఆ మాట విని భయపడుతూ ఇతను గరుడు డేమో అని శంకించి "ఓ గరుత్మంతుడా! నన్ను భక్షించు! నన్ను భక్షించు" అని ఆక్రోశించినది.

అప్పుడు శంఖచూడుడు తల్లితో ఇట్లన్నాడు: "అమ్మా! భయపడవద్దు! ఇతను గరుడుడు కాదు. నయనాహ్లాదకారి అయిన ఇత నెక్కడ? భయంకరుడైన గరుడు డెక్కడ?" అని శంఖచూడు డనగా విని జీమూతవాహను డిట్లన్నాడు:

"అమ్మా! నీ కుమారుని రక్షించుటకై వచ్చిన విద్యాధరుడను నేను. వస్త్రాచ్ఛన్నమైన నా శరీరాన్ని గరుత్మంతునకు అర్పిస్తాను. అత నాకలి గొని ఉండవచ్చును. నీ కొడుకును తీసుకొని నీవు ఇంటికి వెళ్ళిపో."

ఆ మాట విని ఆ వృద్ధురాలు ఇట్లన్నది: "నాయనా! అలా చేయవలసిన పనిలేదు. ఇలాంటి సమయంలో ఈ విధమైన దయను చూపే నీవు నా పుత్రుని కంటె అధికుడవు." ఈ మాట విని జీమూతవాహనుడు తిరగి ఇట్లన్నాడు:

"నా మనోరథాన్ని భగ్నంచేయడానికి మీరు ప్రయత్నించడం భావ్యంకాదు" అని పట్టుదలతో అంటున్న అతనితో శంఖచూడు డిట్లన్నాడు: "ఓ మహాసత్త్వుడా! నీ దయాపరతను చూపించినావు. నీ శరీరంతో నా శరీరాన్ని కాపాడుకోవడం నాకిష్టం లేదు. రత్నాన్ని విసర్జించి రాతిని రక్షించు కోవడం ఏం బాగు? మాలాంటి వాళ్ళు లోకంలో తమపై తాము జాలిపడేవారు అనేకు లున్నారు. నీవలె ఇతరులపై దయచూపేవారు చాలా అరుదు. నేను దుఃఖంతో శంఖపాలకులాన్ని మలినం చేసుకోవడానికి ఇష్టపడను. సూర్యబింబానికి కళంకం ఆపాదించడం నా చేతకాదు."

ఇలా అతనిని వారించి శంఖచూడుడు తన తల్లితో "అమ్మా! నీవు తిరిగి వెళ్ళు. ఇది దుర్గమమైన కానన భూమి. ఈ నేలంతా నాగుల రక్తంతో తడిసి బురద అయి ఉన్నది. ఈ వధ్యశిల కృతాంతలీలా పర్యంకం వలె రౌద్రమై ఉన్నది. నేను సముద్ర తీరానికి వెళ్ళి గోకర్ణేశ్వరునకు నమస్కరించుకొని గరుడుడు వచ్చేలోగా త్వరలో వస్తాను" అని చెప్పి అతి దీనంగా విల పిస్తున్న తల్లికి నమస్కరించి, వీడ్కొని, గోకర్ణేశ్వరునకు ప్రణా మం చేయుటకై శంఖచూడుడు అక్కడినుంచి వెళ్ళిపోయినాడు.

"ఈ సమయంలో ఆ గరుడుడే వస్తే నా కోరిక నెరవేరు తుంది. పరార్థ జీవనుడ నౌతాను" అని జీమూతవాహనుడు తలపోసుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో పక్షీంద్రుడు దాపు నకు వస్తున్నట్టు, అతని రెక్కల గాలికి చెట్లన్నీ కూలిపోసాగినవి.

వానిని చూచి "నన్ను నివారించుటకై ఇవి కదులుతున్నట్టు న్నవి. గరుడుడు వచ్చేవేళ కూడా అయినట్టున్నది" అని పరోప కారార్థమై ప్రాణాలను త్యాగం చేయదలచుకున్న జీమూతవాహ నుడు వధ్యశిలను అధిరోహించినాడు.

మారుతోద్ఘూర్ణితమైన జలనిధి రత్నప్రభా భాసురమై ఆ సత్త్వాతిశయుని విస్మయంతో చూస్తున్నట్లున్నది. వెంటనే గరు డుడు వచ్చి ఆకాశాన్ని కప్పివేస్తూ, ఆ శిలాతలంపై వాలి ముక్కుతో ఆ మహాసత్త్వుని పట్టుకొని కొనిపోయినాడు.

రక్తధార కారుతుండగా శిరోరత్నం జారిపడగా అతివేగంతో వానిని కొనిపోయి మలయాద్రి శృంగంపై పెట్టి తినసాగినాడు.

"ఇదే విధంగా ఇతరులకోసమై నాదేహాన్ని సమర్పించే అవకాశం ప్రతిజన్మలోనూ నాకు కలుగుగాక! పరోపకార వర్జితా

లైన స్వర్గమోక్షాలు నాకవసరంలేదు.'' ఇలా విద్యాధరాధిపతి అయిన జీమూతవాహనుడు అనుకుంటుండగా ఆకసంనుంచి పుష్ప వృష్టి కురిసినది.

ఈలోగా అతని రక్తధారాసిక్తమైన శిరోమణి, అతని భార్య మలయవతి ముందు పడినది. ఆమె ఆ చూడామణిని గుర్తించి వికలురాలై దగ్గరనున్న అత్తమామలకు కన్నీరు విడుస్తూ తెలియ జెప్పినది. వారు కుమారుని శిరోరత్నాన్ని చూచి ఇదేమిటని వెంటనే సంభ్రాంతులైనారు. ఆ తర్వాత తమ విద్యావిజ్ఞానం వల్ల జరిగిన సంగతిని గూర్చి తెలుసుకుని రాజు జీమూతకేతువు, రాణి కనకవతి, వధువు మలయవతితో పాటూ కలిసి గరుడ జీమూతవాహను లున్న చోటికి బయలుదేరినారు.

ఇంతలో శంఖచూడుడు గోకర్ణునకు నమస్కరించి తిరిగి వచ్చి రక్తంతో తడిసిన ఆ వధ్యశిలను చూచి ఉద్విగ్నుడైనాడు.

"హా! హతోఽస్మి, మహాపాపిని. నిజంగానే ఆ మహాత్ముడు నాకోసమై గరుత్మంతునికి తన నర్పించుకున్నాడు. దయాళు వాతడు. కాబట్టి అక్కడి కెళ్ళి తీరుతాను. నే నిలా బ్రతికి ఉంటే అపయశఃపంకంలో మునిగి పోగలను'' అని కన్నీటితో అంటూ ఆ సాధువు వరుసగా నేలపైన జారిపడిన రక్తధారను అనుసరించి బయలుదేరినాడు.

ఈ లోగా జీమూతవాహనుని తింటున్న గరుడుడు సంతుష్టుడై విరమించి మనసులో ఇట్లా అనుకున్నాడు: "ఇదేదో అపూర్వంగా ఉన్నది. నేను తింటున్నప్పటికీ ఈ మహాసత్త్వుడు సంతోషపడుతున్నాడే కానీ ప్రాణాలను వదలడం లేదు.

ఆ మిగిలిన శరీరం రోమాంచ కంచుకితమౌతున్నది. నే నేదో ఉపకారం చేస్తున్నట్టుగా ఆయన దృష్టి నామీద పడుతున్నది. ఇతను నాగుడుకాడు: ఎవరో సాధువు. నే నితనిని అడగలేదు" అని ఆలోచించుకుంటున్న గరుడునితో జీమూతవాహను డిట్లన్నాడు:

"ఓ పక్షీంద్రా! ఎందుకు తినడం మానివేసినావు? ఇంకా నా శరీరంలో మాంసము రక్తము, మిగిలే ఉన్నవి. వానిని కూడా అరగించి సంతుష్టుడవు కా."

ఈ మాట విని పక్షిరాజు ఆశ్చర్యంతో ఇట్లా ప్రశ్నించినాడు: నీవు నాగుడవు కాదు. మహాత్మా! నీ వెవరవో చెప్పు."

ఆ మాటకు "నేను నాగుడనే. ఈ ప్రశ్న ఏమిటి? నీ పని నీవు కానీ. ప్రస్తుతార్థవిరుద్ధమైన దానికి ఎవరు పూనుకుంటారు?" అని అంటుండగా అక్కడికి శంఖచూడుడు వస్తూ దూరం నుంచే గట్టిగా అరచినాడు.

"ఓ వైనతేయా! మహాపాపాన్ని చేయవద్దు. అది సాహసం. ఈయన నాగుడు కాదు. నీ వేదో భ్రమపడినావు. అసలు నాగుడను నేను" అని గబగబా వచ్చి వారిద్దరి మధ్యా నిలుచుని, విభ్రాంతుడైన గరుడుని చూచి శంఖచూడు డిట్లన్నాడు:

"ఏమి టా భ్రమ? నా పడగలు చూడు. నా రెండు నాలుకలనూ చూడు. ఈ విద్యాధరుని సౌమ్యాకృతి నీకు కనబడలేదు" అని శంఖచూడుడు అంటుండగనే జీమూతవాహనుని భార్య, తలిదండ్రులూ, సర్వులూ అక్కడికి గబగబా వచ్చినారు. విలుప్తాంగుడైన అతనినిచూచి తలిదండ్రులు తక్షణమే "అయ్యో! కుమారా! జీమూతవాహనా!" అని విలపించినారు.

"కుమారా! పరార్థజీవీ! నిన్ను వైనతేయుడు అనాలో చితంగా ఎందు కిలా చేసినాడు?"

ఆ మాటవిని గరుడుడు పశ్చాత్తాపం చెంది ఇలా అనుకున్నాడు :

"అయ్యో! బోధిసత్త్వుని అంశలో పుట్టిన వానిని అజ్ఞానంతో నేను భక్షించివేసితినే. ఈ జీమూతవాహనుడు పరార్థ ప్రాణదాయకుడు. ఈయన కీర్తి ముల్లోకాలలో ఘోషిస్తున్నది. నే నీ అధర్మం చేసినందువల్ల అగ్నిప్రవేశమే శరణ్యం. అధర్మ విషవృక్షానికి మధురఫలా లెలా కాస్తాయి?" అని చింతాకులుడైన గరుడుడు చింతిస్తుండగా, బంధువులను చూచి ప్రాణవ్యధతో, జీమూతవాహనుడు మరణించినాడు. అంతట ఆయన తలిదండ్రులు శోకాధీనులు కాగా శంఖచూడుడు తనను తాను నిందించుకున్నాడు.

భార్య మలయవతి ఆకసం చూస్తూ బాష్పగద్గదకంఠంతో తనను పూర్వం అనుగ్రహించిన అంబికా దేవిని ఇలా నిందించినది: "విద్యాధరాధిపుడూ, భావిచక్రవర్తి నీకు పతి కాగలడని ఓ దేవీ! గౌరీ! పూర్వం నాకు వరమిచ్చినావు. అదంతా అబద్ధ మని తేలిపోయినది. నా విషయంలోనే ఇలా జరిగింది." ఈ మాట అంటుండగానే గౌరి ప్రత్యక్ష మైనది.

"కుమారీ! నా మాట ఎన్నటికీ పొల్లుపోదు" అని తన కమండలువునుంచి అమృతాన్ని తీసి జీమూతవాహనుని తడిపినది. అందుతో అతను అక్షతగాత్రుడై పూర్వాధికమైన శోభతో బ్రతికి లేచి కూర్చున్నాడు. ఆయ నలా లేచి అందరకూ నమస్కరింపగా దేవి ఇట్లన్నది:

"నీవు చేసిన ప్రాణత్యాగాన్ని చూచి సంతోషించినాను. విద్యాధరులందరికీ ఆ కల్పాంతం చక్రవర్తిగా నిన్ను నా చేతులతో

అభిషేకం చేస్తున్నాను" అని చెప్పి జీమూతవాహనునిపై కలశాంబుధినుంచి అభిషేకం చేసి శర్వాణీ పూజితురాలై తిరోహితురాలైనది. ఆ సమయంలో ఆకసంనుంచి పూలవాన కురిసినది. గగనంలో దేవదుందుభులు మ్రోగినవి.

అప్పుడు వినమ్రుడై గరుడుడు జీమూతవాహనునితో ఇట్లన్నాడు :

"పురుషాధికుడవైన ఓ చక్రవర్తీ! నీపై నాకెంతో ప్రీతి జనించినది. ముల్లోకాలనూ ఆశ్చర్యంలో ముంచెత్తించే అపూర్వ ఉదారబుద్ధివి నీవు. బ్రహ్మాండకుడ్యంపై ఈ చిత్రం లిఖిత మౌతుంది. నేను మత్తుడనై చేసినపనిని మన్నించి నన్నాదేశించు. నీ కిష్టమైన వరాన్ని కోరుకో" అని చెప్తున్న గరుడునితో ఆ మహాసత్త్వుడిట్లన్నాడు:

"పశ్చాత్తప్తుడవై నీ విక నాగులను భక్షించడం మానివేయవలసింది. నీ వింతకుముందు తిన్నవారి అస్థివిశేషాలన్నీ తిరిగి జీవించుగాక!" అని అనగా అలాగే నని ఇక మీదట నాగులను భక్షింప నని నే నింతకు ముందు తిన్న నాగులు బ్రతుకగలరని గరుడుడు వెళ్ళిపోయినాడు.

పూర్వం అతను భక్షించి అస్థిశేషాలైన నాగులు బ్రతికినారు. అందరూ అక్షతగాత్రులై లేచి కూర్చున్నారు. దేవతలతోను, నాగులతోను, మునులతోను ఆనంద సమ్మేళనాలు జరిగినవి. అందుతో మలయాచలం ముల్లోకాలలో పేరుతెచ్చుకున్నది.

ఆ సమయంలో ఈ అద్భుతమైన జీమూతవాహనుని వృత్తాంతం గౌరీప్రసాదం వల్ల సకల విద్యాధరేశ్వరులు తెలుసుకున్నారు. వారందరూ చరణావనతులై ఒక క్షణంలో బంధు

మిత్ర సమేతంగా హిమాద్రికి వచ్చి పార్వతి స్వయంగా మహాభి షేకం చేసిన ఆ చక్రవర్తికి నమస్కరించినారు.

అంతట అక్కడ తలిదండ్రులు ఇంకా మిత్రావసువు మల యవతి తమ ఇంటికి వచ్చిన అందరితో కలిసి లోకోన్నతుడైన జీమూతవాహనుని చిరకాలం సేవించినారు. సత్త్వోచితమైన విద్యాధర చక్రవర్తి భారాన్ని జీమూతవాహనుడు వహించినాడు.

ఈ ఉదార సరస కథను చెప్పి బేతాళుడు తిరిగి త్రివిక్రమ సేనమహారాజు నిట్లా ప్రశ్నించినాడు.

"ఇందులో శంఖచూడుడు గొప్పవాడా? జీమూతవాహనుడు గొప్పవాడా? ఎవరు మహాసత్త్వులు? చెప్పవలసింది. చెప్పకపోతే నీతల వేయి వ్రక్కలౌతుంది అన్న సంగతి నీకు తెలుసు."

అంతట ఆ శాపభయం వల్ల మౌనాన్ని విస్మరించి మహారాజు నిశ్చలమనస్కుడై ఇలా అన్నాడు:

"బహుజన్మ సిద్ధమైన జీమూతవాహనుని జీవితంలో చిత్రమేమున్నది? శంఖచూడుడు శత్రువుకోసమై మరణోత్తీర్ణుడైనప్పటికీ, అతని కోసమై ఎంతోదూరం పయనించి వెంటనే తన శరీరాన్ని అర్పించడానికి సిద్ధమైనాడు."

ఈ రాజుమాట విని బేతాళుడు గబాలున దిగి వెళ్ళిపోయినాడు.

రాజుకూడా అతని కోసమై అతని వెంటనే బయలు దేరినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
ఇరవైమూడో తరంగం.

# ఇరవై నాలుగో తరంగం

తర్వాత రాజు త్రివిక్రమసేనుడు అశోకవృక్షం వద్దకువెళ్ళి బేతాళుని తీసుకుని బయలుదేరినాడు. భుజంమీదనుంచి బేతాళుడు ఆ రాజుతో ఇలా అన్నాడు:

" రాజా! అలసట కనిపించకుండా నీ కొక కథ చెప్తాను విను:

## 17వ కథ

ధర్మమర్యాదాతిక్రమణం చేయనట్టి గంగాతీరంలో ఉన్నట్టి కనకపురం అనే పేరుగల పట్టణం కలిప్రవేశించడానికి ఆస్కారం లేనిదిగా ఉన్నది. అక్కడ యశోధనుడనే సార్థకనామధేయుడైన భూపతి కలడు.

విప్లవాంబుధినుంచి వసుంధరను వేలాద్రివలె రక్షిస్తూ వచ్చినాడు. జగదాహ్లాదకరుడు, చండప్రతాపుడు, అఖండమండలుడు అయిన ఆ రాజు చంద్ర సూర్యులను ఒకటిగా చేసి బ్రహ్మ నిర్మించెనా అన్నట్టుంటాడు. పరపరీవాదంలో మాత్రమే మౌర్ఖ్యం-శాస్త్రార్థంలో దారిద్ర్యం లేదు. కోశదండములలో లోపం లేదు. అతను పాపభీతి కలవాడు, యశోలబ్ధుడు. పరాంగనల విషయంలో షండుడు. అతను శౌర్య ఔదార్య శృంగారమయుడై జనంలో ప్రకాశిస్తూ వచ్చినాడు.

ఆ రాజు పట్టణంలో ఒక మహావర్తకుడున్నాడు. అతనికి ఉన్మాదిని అను పేరుగల ఒక కుమార్తె కలదు. ఆమె నెవరెవరైతే చూస్తారో వారందరూ ఆమె రూప సంపదతో ఉన్మాదులై పోతారు. మదనునికి కూడా మోహనశక్తితో పిచ్చెత్తించగల దామె. ఆమె

యౌవనవతికాగా తండ్రి అయిన ఆ వర్తకుడు యశోధన మహా రాజు వద్దకు వెళ్ళి అవనతుడై ఇలా విన్నవించుకున్నాడు:

"ముల్లోకాలకూ రత్నం వంటి నా కుమార్తె కన్యాదానానికి సిద్ధంగా ఉన్నది. ఆమె విషయం తమకు చెప్పకుండా మరొకరికి ఇవ్వడానికి నా కిష్టంలేదు. ఈ విశాల భూతలంలో సర్వరత్నాలకూ ప్రభువు మహారాజే కాబట్టి మీరు ఆమెను పరిగ్రహించి నన్ను అను గ్రహించండి, లేదా ఆమెకు విమోచనం కల్పించండి."

ఆ మాటవిని రాజు తన బ్రాహ్మణులను పిలిపించి ఆమె లక్షణాలను పరికించి రావలసిందిగా పంపించినాడు. వారు వెళ్ళి ఆ భువనైక సుందరిని చూచి వెంటనే కలతపడి పోయి ఏలాగో ధైర్యం చిక్కపట్టుకొని ఇలా ఆలోచించినారు.

"రాజు ఈమెను చేపట్టినట్టయితే రాజ్యం నాశనమై పోతుంది. ఈమెతో మోహితచిత్తుడై ఆయన రాజ్యపాలన విష యం పట్టించుకోడు. కాబట్టి ఈమె సులక్షణవతి అని మనం రాజు గారికి చెప్పకూడదు" అని తమలో తాము సంప్రతించుకొని ఆ రాజు దగ్గరకు వెళ్ళినారు.

ఆమె దుర్లక్షణవతి అని అబద్ధం చెప్పినారు. ఆ మాటవిన్న రాజు ఆ వర్తక కుమార్తెను స్వీకరించలేదు. అంతట ఆయన ఆజ్ఞతో ఆ ఉన్మాదిని ఆమె తండ్రి బలధరుడను పేరుగల సేనా పతికి ఇచ్చి పెళ్ళిచేసినారు.

అంతట అతని ఇంటిలో ఆమె సుఖంగా ఉన్నది. తనను లక్షణవతి కాదని రాజు వదలివేసి అవమానించెనే అని మాత్రం కుమిలిపోతున్నది.

ఇట్లా కొంతకాలం జరుగగా వికసిత కుందలతాదంతము, మథితాంబుజిని అయిన హేమంతహస్తిని చంపి, పుష్పమంజరీ కేసరావళి, చూతాంకురనఖము అయిన వసంతకేసరి కాననంలో క్రీడింప సాగినది.

ఆ సమయంలో నగరంలో వసంతోత్సవం ఆరంభమైనది. ఆ ఉత్సవాన్ని తిలకించుటకై యశోధనమహారాజు ఏనుగుపై నెక్కి బయలుదేరినాడు. ఆ భూపాలుని చూచి కళవళ పడిపోకుండా కులకాంతలను వైదొలగండని చెప్పడం కోసం డిండిమములను మ్రోయించినారు. ఆమె ఈ డిండిమ ధ్వనిని విని తన ఇంటి హర్మ్యంపైనెక్కి తన్ను వదలిపెట్టి అవమానించెనన్న బాధతో ఆయనకు తన్ను కన్పింపజేసుకొన్నది.

అత నామెను చూచి పైకిలేస్తున్న జ్వాలవంటి కామాగ్ని మలయానిలంతో పెరిగిపోగా క్షోభిల్లినాడు. ఆమెరూపాన్ని వర్ణించుకుంటున్న అతని మనసులోనికి మన్మథుని విజయాస్త్రం గాఢంగా నాటుకొన్నది. ఆయన వెంటనే మోహించినాడు. పరివార జనులు ఆశ్వాసింపగా రాజధానిలో ప్రవేశించి, ప్రశ్నించి ఆమె తన కింతకు మునుపు ఇవ్వబోగా నిరాకృత అయినదని తెలుసుకున్నాడు.

అంతట ఆమె లక్షణహీనురాలని చెప్పిన బ్రాహ్మలను దేశం నుంచి బహిష్కరించి, ఆమెయందే ఉత్కంఠచెందినాడు. "అయ్యో! ఈ జడాత్ముడైన చంద్రు డెంత సిగ్గులేనివాడు. జగన్నేత్రోత్సవకారి అయిన నిష్కళంకమైన ఆమె ముఖం ఉండగా తాను రోజూ ఉదయిస్తున్నాడే! కఠోరాలైన హేమకలశములు, కర్కశాలైన గజకుంభాలు, ఉన్నతవిస్తృతాలైన ఆమె స్తనాలతో పోల్చదగినవి కావు.

ఆమె జఘనాన్ని అలంకరించే కాంచీనక్షత్రమాల కందర్ప మాతంగ మస్తకాభమై ఎవరినిమాత్రం ప్రలోభపెట్టదు" అని ఈ విధంగా ఆమెనే తలచుకుంటూ దినదినం కృశింపసాగినాడు. కామాగ్ని పుటపాకంలో ఉడికిపోతున్నాడు.

సిగ్గుతో దాచిపెట్టుకున్నప్పటికీ వాటి లక్షణాలు బయల్పడగా చూచి అడుగుతుండగా ఆప్తులకు తన తాపకారణాన్ని ఎంతో కష్టంమీద తెలియజేసినాడు.

"ఎందు కిలా సంతాపం చెందుతారు? ఆమెను మీ స్వాధీనం చేసుకోవచ్చును కదా!'' అని వా రనగా ధార్మికుడైన ఆ రాజు దానికి అంగీకరింపలేదు.

అంతట ఈ సంగతి తెలిసిన సేనాపతి బలధరుడే వచ్చి ప్రభుభక్తిపరాయణుడు గనుక చరణానతుడై ఇట్లా అభ్యర్థించి నాడు :

"దాస స్త్రీ నీకు దాసీమాత్రురాలే. ఆమె పరాంగన కాదు. నా భార్యను నేను స్వయంగా సమర్పిస్తాను స్వీకరించండి. లేదో నే నామెను వదలివేసి దేవకులానికి అర్పిస్తాను: దేవదాసిలను పరిగ్రహించడం దోషం కాదు.'' ఈ విధంగా తన సేనాపతి బలవంత పెట్టినప్పటికీ ఆ రాజు కోపంతో ఇట్లన్నాడు :

"రాజుగా ఉండి ఇలాంటి అధర్మానికి నే నెలా ఒడిగడతాను. నేనే మర్యాద నతిక్రమిస్తే ఇంకెవరు మాత్రం వారి దారిలో వారు నడుస్తారు? భక్తుడవైనప్పటికీ నీవు నన్ను పాపకార్యాని కెలా ఒడబరుస్తావు? క్షణికమైన సుఖంకోసం పరలోక దుఃఖాభమైన ఈ పనికి తలపెట్టి నీవు నీ ధర్మదారను వదలివేసినట్టయితే క్షమింపను. అలాంటి ధర్మవిప్లవాన్ని నాలాంటి వా డెలా సహి

స్తాడు? ఇంతకంటే చావడం మంచిది'' అని చెప్పి ఆ రాజు అతనిని నిషేధించినాడు.

మహాసత్త్వులు ప్రాణాలనైనా వదులుతారు కానీ సన్మార్గాన్ని వదలరు కదా! అలాగే చాలామంది పౌరులు, జానపదులు ప్రార్థించినప్పటికీ దృఢనిశ్చయంతో ఆయన వారి కోర్కెను నిరాకరించినాడు.

ఇలా క్రమంగా ఆ మదనజ్వరభరంతోనే ప్రక్షీణదేహుడై ఆ రాజు కీర్తిశేషుడైనాడు.

సేనాపతి ఆ విధంగా రాజు చనిపోవడం భరించలేక అగ్ని ప్రవేశం చేసినాడు. ప్రభుభక్తుల చేష్టితాలు అనిర్వాచ్యాలు కదా!

ఈ విధంగా బేతాళుడు ఆశ్చర్యకరమైన ఈ కథను చెప్పి త్రివిక్రమ మహారాజు నిలా ప్రశ్నించినాడు: "ఈ సేనాపతి, మహీపతులలో సత్త్వంలో ఎవరు గొప్పవారు? తెలిసీ ఇది చెప్పక పోతివా నీ తల వేయిప్రక్కలౌతుంది."

మౌనాన్ని వదలి ఆ రాజు "వారిలో రాజే అధిక సత్త్వవంతుడు" అని చెప్పినాడు. ఆ మాటవిని బేతాళుడు ఆక్షేపిస్తూ ఇలా అన్నాడు:

"ఇందులో సేనాపతి ఎందుకు అధికుడు కాడో చెప్పవలసింది? స్వామిభక్తితో, అతను చిరకాలం ఆమె సంభోగ సుఖాన్ని ఆస్వాదించినప్పటికీ అంతటి రూపవతిని తెచ్చి ఇచ్చినాడంటే విశేషం కదా! మరి రాజు చనిపోగా తాను అగ్నిప్రవేశం చేయడం విశేషం కదా! రాజేమో ఆమె సంభోగసుఖం రుచి ఎరుగనివాడు గనుక ఆ కాంతను వదలిపెట్టినాడు.''

ఈ బేతాళుని మాటలను విని నవ్వుతూ ఆ రాజు ఇట్లన్నాడు: "ఇది సరైనదైనప్పటికీ ఇందులో చిత్ర మేమున్నది? కుల పుత్రకుడైన సేనాపతి తన ప్రభువుకోసమై భక్తితో ఆ విధంగా ప్రవర్తించినాడు.

ప్రాణత్యాగం చేసి అయినా తమ స్వామిని రక్షించు కొనడం భృత్యుల ధర్మం. రాజులేమో మత్తేభాలవలె నిరం కుశులు. ధర్మమర్యాదా శృంఖలలను విషయోన్ముఖులై త్రెంచి వేస్తూ ఉంటారు. అలాంటి విచిత్రచిత్తులకు అభిషేకజలంతో సమానమైనది వివేకం. అది అన్నిటినీ తనలోనికి లాగుకొని ప్రవహించిపోతుంది. చలచామర మారుతాలతో వృద్ధోపదిష్టశాస్త్రార్థ రజోమశక మక్షికములు ఎగిరిపోతాయి. ఆతపత్రం పట్టుకొనగానే సూర్యుడిక కన్పించడు. వైభవవాయువహనం దృష్టిమార్గాన్ని నిరోధిస్తుంది. అందుకనే అలాంటివారు మారమోహితచిత్తులై జగద్విజయులైనప్పటికీ నహుషాది రాజులు ఆపదలపాలైనారు.

ఈ రాజు పృథ్వికంతా ఏకఛత్రాధిపత్యం వహించినప్పటికీ ఉన్మాదినీ చపల అయిన లక్ష్మితో విమోహితుడు కాలేదు. ప్రాణాల నైనా ఆ ధర్మాత్ముడు త్యజించినాడు కానీ తన మార్గాన్ని తప్ప లేదు. అందువల్ల ఈయనే నా దృష్టిలో అధికుడు."

ఈ మాటను విని తిరిగీ బేతాళుడు అతని భుజంనుంచి క్రిందికి జారిపోయి తన ప్రభావంతో తన చోటికి తాను వెళ్ళిపోయి నాడు.

రాజుకూడా తిరిగీ అతనిని పట్టుకొనివచ్చుటకై వెంట వెళ్ళి నాడు. సత్పురుషులు ఆరంభించిన పనులు దుష్కరాలైనప్పటికీ వారి మధ్య విరామ మెక్కడిది?

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
ఇరవైనాల్గవ తరంగం.

# ఇరవై అయిదో తరంగం

జ్వాలావిలోల రసనాలైన భూతాలతో వలె చితాగ్నులతో పిశాచాలతో ఆవృతమైన పితృవనానికి వెళ్ళి ఏమాత్రం కలత పడకుండా ఆ రాత్రి త్రివిక్రమసేన మహారాజు తిరిగి ఆ అశోక వృక్షం చెంతకు చేరుకున్నాడు.

అక్కడ బేతాళులవలె అదే ఆకారాలుగల, వ్రేలాడుతున్న టువంటి, అనేక ప్రేతకాయాలను జంకు లేకుండా చూచినాడు.

"ఆహా! ఇదేమిటి? ఆ బేతాళుడు తిరిగి మాయాజాలం పన్నినాడా? వీరిలో ఎవరా బేతాళుడని తెలుసుకోవడ మెలాగా? ఈ రాత్రి నేను సిద్ధార్థుడను కాకపోతే హాస్యపాత్రుడను కావడం కంటె అగ్నిప్రవేశం చేయడంమేలు." ఇలా ఆలోచిస్తున్న ఆ రాజు మనసును కనుగొని ఆయన సత్త్వంతో సంతుష్టుడై బేతాళుడు తన మాయను తాను ఉపసంహరించుకున్నాడు.

అంతట మనుష్యకళేబరంలో ఒకే బేతాళుడు కానరాగా వానిని దింపి తన భుజం మీద వేసుకొని ఆ రాజు తిరిగి బయలు దేరినాడు. ఆయన అలా వెడుతుండగా బేతాళుడిట్లా అన్నాడు: "ఈ అద్భుతానికి నీవు ఉత్తేజితుడవు కాకపోయేటట్టుంటే ఓ రాజా! నీ వీ కథను విను:

## 18 వ కథ

గౌరీతపఃక్లేశయుతుడైన త్రిపురారి అసామాన్య మనోత్కర్షలుబ్ధుడై తానే వరించెనా అన్నట్టున్న భోగవతీ అమరావతులకు తర్వాత మూడవదైన ఉజ్జయినీ పట్టణం, పుణ్యంతో నానా భోగాలను అనుభవించుటకు తగినదై ఒకటి కలదు.

అక్కడ కాంతల వక్షోజాలలోనే స్తబ్ధత్వము, కార్కశ్యము కనబడుతుంది. వారి బొమముడులలోనే విరుపులు కనబడుతాయి. వారి కనులలోనే చాపల్యం కనబడుతుంది. చీకటి ఒక రాత్రుల లోనే అక్కడ ఉంటుంది. అక్కడ కవీశ్వరుల మాటలలోనే వక్రత్వం కలదు. మదం ఒక్క ఏనుగులలోనే కానవస్తుంది. ముక్తా మలయజ చంద్రులలోనే జాడ్యం కానవస్తుంది.

ఆ ఊరిలో చంద్రప్రభుడనే రాజు కలడు. ఆయనవద్ద మహా పండితుడైన దేవస్వామి అనే విప్రుడు మంత్రిగా కలడు. ఆయన గొప్ప మేధావి, గొప్పధనవంతుడు. కాలక్రమేణా ఆయనకు చంద్రస్వామి అనే కొడుకు పుట్టినాడు. అతను విద్యాపారంగతుడై నప్పటికీ ద్యూతవ్యసనంలో చిక్కుకున్నాడు.

ఒకసారి ఆ విప్రకుమారుడైన చంద్రస్వామి ద్యూతకార మహాశాలకు జూదమాడుటకై వెళ్ళినాడు. అది విపత్తులతో ఎవరిని చుట్టివేదామా అని చూస్తూ కృష్ణసార నేత్రాలవంటి పాచికలతో అ దెప్పుడూ గలగలలాడుతూ ఉంటుంది.

"నేనిక్కడ ఎవని సంపదనైనా దోచివేస్తాను. వాడు ఇంద్రు డైనా సరే!" అన్నట్టుగా నినదిస్తూ ఉంటుం దది. జూదగాళ్ళం దరూ ఒకరితో ఒకరు కలహిస్తూ కేకలు వేస్తూ ఉంటారు.

అందులో ప్రవేశించి క్రమంగా మెరిసిపోతున్న పాచికలతో కితవులు తన వస్త్రాదులను హరించినప్పటికీ ఉన్న ధనాన్నికూడా అపహరించగా ధనం కోసం వెదకి అది దొరకకపోగా చంద్రస్వా మిని పట్టుకొని ఒక సభ్యుడు కర్రతో బాదినాడు. ఆ దెబ్బలతో ఒడలంతా రాతివలె నిశ్చలం కాగా తాను చనిపోయినట్టుగా ఆ విప్రసుతుడు పడిపోయినాడు.

అలాగే రెండుమూడు రోజులు అతనలా ఆ శాలలో పడి ఉండగా క్రుద్ధులైన తన మిత్రులతో ఇట్లన్నాడు: "వీ డేదో రాయి అయి పోయినాడు. ఎక్కడికైనా ఎత్తి పారవేయండి. ఒక అంధకూపంలో వీని నిశ్చేతన శరీరాన్ని పడవేస్తే మీకు నేను ధన మిస్తాను."

ఈ మాటవిని అక్కడున్న ద్యూతకారులు ఆ చంద్రస్వామిని తీసుకొని కూపం కోసం వెదుకుతూ అరణ్యంలో చాలాదూరం వెళ్ళినారు. అక్కడ ఉన్న ఒక వృద్ధకితవుడు ఇతరులతో ఇట్లన్నాడు: ఇతనేదో బహుశా చనిపోయినట్టున్నది. వీనిని కూపంలో వేయడం మాత్రం ఎందుకు? వీని నిక్కడే వదలివేసి కూపంలో పడవేసినామని చెబుదాము." అక్కడున్న వారందరూ ఆ మాట కంగీకరించినారు.

అతని నలా వదలివేసి వారందరూ వెళ్ళిపోగా చంద్రస్వామి లేచి కూర్చొని ఒక శూన్య శివాలయంలోనికి ప్రవేశించినాడు. అక్కడ కొంత సేదతీర్చుకుని దుఃఖితుడై ఇలా చింతించినాడు: "నేను నమ్మగా ఈ కితవులందరూ మోసం చేసి నా డబ్బునంతా దోచుకున్నారు. ఈ దశలో నే నెక్కడికి వెడతాను? ఇలా నగ్నంగా దుమ్ముకొట్టుకుని వెడితే తండ్రిగానీ, బంధువులుగానీ, మిత్రులుగానీ చూచి ఏమనుకుంటారు? కాబట్టి ఈ రాత్రి ఇక్కడే ఉంటాను. ఆకలి తీరుటకై బయటికి వెళ్ళి పిండి దొరుకుతుందేమో చూస్తాను."

ఇలా నగ్నుడై అలసిపోయి ఆలోచిస్తూ ఉండగా తన ప్రతాపాన్ని తగ్గించుకొని సూర్యుడు అంబరాన్ని త్యజించి అస్తాద్రిని చేరుకున్నాడు.

అంతలో ఒడలంతా బూదిపూసుకొని ఒక తాపసి అక్కడికి వచ్చినాడు. జటాశూలధరుడై అపర హరునివలె ఆ మహావ్రతి ఉన్నాడు. అతను చంద్రస్వామిని చూచి ఎవరు నీవని ప్రశ్నించి అతని కథనంతా విని వినమ్రుడైన వానితో ఆ తపస్వి ఇట్లన్నాడు.

"నీవు నా ఆశ్రమానికి వచ్చినావు. ఆకలితో డస్సి ఉన్నావు. తలవని తలంపుగా వచ్చిన అతిథివి నువ్వు. కాబట్టి లేచి స్నానం చేసివచ్చి నా భిక్షలో భాగం తీసుకో." ఈవిధంగా ఆ మహావ్రతి చెప్పగా చంద్రస్వామి ఇట్లన్నాడు :

"భగవాన్! నేను విప్రుడను. నీ భిక్షాభాగా న్నెలా తింటాను ?"

ఆ మాటవిని ఆ సిద్ధుడు తన మఠం లోపలికి వెళ్ళి ఇష్ట సంపాదినీ విద్యను స్మరించుకున్నాడు. అతిథి ప్రియు డతను. ఆ స్మరణ మాత్రంతో వచ్చిన ఆ విద్య తన్నేం చేయ మంటారని అడగ్గా ఈ అతిథికి ఆతిథ్యం సమకూర్చవలసిందని శాసించినాడు. సరేనని అక్కడ ఉద్యానవనంతోనూ, అంగనాజనంతోనూ కూడిన సౌవర్ణపుర మొకటి ఉత్పన్నం కావడం చంద్రస్వామి చూచి నాడు.

ఆశ్చర్యచకితుడైన అతని దగ్గరకు వచ్చి అక్కడి వారాంగనలు "లేవండి. రండి. స్నానం చేయండి. భుజించండి. అలత తీర్చుకొనండి" అన్నారు. వా రతనిని లోనికి కొనిపోయి స్నానం చేయించి, గంధానులేపనం చేసి చక్కని బట్టలిచ్చి, మరొక వాస గృహంలోనికి కొనిపోయినారు.

ఆ లోపల ఆ యువకుడు ప్రధాన యువతి నొకదానిని చూచినాడు. బ్రహ్మ కుతూహలంతో నిర్మించినట్టున్న సర్వాంగ

సుందరి ఆమె. ఆమె ఉత్కంఠతతో లేచి అర్ధాసనంలో కూర్చుండ బెట్టుకొనగా ఆమెతో పాటూ దివ్యమైన ఆహారాన్ని భుజించినాడు. కలమాగిన పళ్ళను తిని, తాంబూలం వేసుకొని, ఆ పర్యంకంపై చేరి ఆమెతో ఆ రాత్రి సంభోగసుఖం అనుభవించినాడు. తెల్ల వారి లేచి చూచుసరికి ఆ పాడువడిన దేవాలయం మాత్రమే కన్పించినది. ఆ దివ్యాంగనా లేదు. ఆ పట్టణమూ లేదు. ఆ పరి వారమూ లేదు.

అంతట ఆ విప్రుడు విధురుడై, మఠంలోనుంచి చిరునవ్వుతో వచ్చిన ఆ తాపసి, "రాత్రి సుఖంగా గడచినదా?" అని అడు గగా అతనితో ఇట్లన్నాడు:

"నీ ఔదార్యం వల్ల భగవాన్! రాత్రి సుఖంగా గడిపి నాను. కాని ఆ దివ్యస్త్రీ లేక నే నిక బ్రతుకలేను."

ఆ మాటవిని తపస్వి దయాళువు గనుక నవ్వుతూ ఇట్ల న్నాడు: "ఇక్కడే ఉండు. తిరిగి ఈ రాత్రీ ఇదే అనుభవమే కలుగుతుంది" అని ఆ తాపసి చెప్పినాడు. ఆయన యుక్తితో ప్రతిరాత్రీ చంద్రస్వామి, ఆయన అనుగ్రహంవల్ల ఆ యా భోగా లను అనుభవించసాగినాడు.

విధివశాత్తూ ఆ విద్యాప్రభావాన్ని మెల్లగా తెలుసుకొని ఒకసారి ఆ తాపసితో ఆయన అనుగ్రహం అపేక్షించి ఇట్లా అభ్య ర్థించినాడు. "నేను మీ శరణాగతుడను. నిజంగానే నాపై మీకు దయ ఉంటే ఇలాంటి ప్రభావం కల ఆ విద్యను నాకు ఉపదేశించ వలసింది." అని బలవంత పెట్టగా ఆ తపస్వి ఇట్లన్నాడు:

"నీ కీ విద్య అసాధ్యం. అంతర్జలంలో సాధింపవలసిన విద్య ఇది. నీటిలో ఉండి దీనిని జపించిన సాధకునకు మాయాజాలం

విమోహింపజేస్తుంది. దానికి లోబడితే సిద్ధి సాధ్యంకాదు. ఆ నీటిలో నుండి అతను తాను తిరిగి పునర్జన్మ ఎత్తినట్టుగా తన్ను భావనగా చూస్తాడు. తర్వాత యువకుడౌతాడు. ఆ తర్వాత పెళ్ళై సంతానవంతుడౌతాడు. ఇతను మిత్రుడు, అతను శత్రువు అనే మిథ్యా మోహం పాలౌతాడు. ఇది విద్యాసాధనంలో ఒక భాగమని తెలియక తన పూర్వజన్మను మరచిపోతాడు. ఇరవై నాలుగేళ్ళ వయసు వచ్చిన తర్వాత గురువిద్యాప్రబోధితుడై తన జన్మను జ్ఞాపకం చేసుకొని ఆ ధీరుడు మాయా విజృంభణాన్ని కనుగొంటాడు. తద్వశుడై అలాగే అగ్ని ప్రవేశం చేస్తాడు. అప్పుడు జలం నుంచి బయటికి వచ్చి విద్యాసిద్ధిని దర్శిస్తాడు.

కానీ ఇది అందరి శిష్యులకూ సిద్ధించదు. అపాత్రదానం చేస్తే అతని గురువు విద్యకూడా నశిస్తుంది. మరి నా విద్యాసిద్ధి వల్లనే నీకు ఫలం సిద్ధిస్తుండగా మరి దీనికై తాపత్రయమెందుకు? ఈ పొరబాటు జరిగితే నా విద్యా నశిస్తుంది. నీ కీ అనుభవమూ నశిస్తుంది" అని ఆయన అన్నాడు.

ఆ తర్వాత ఆ విద్య నతనికి దానం చేయడానికై తాపసి నిశ్చయించుకున్నాడు. ఆశ్రితులు బలవంతంగా కోరితే సాధువులు ఏమైనా చేస్తారు కదా! నీ విప్పుడు ఉపదేశంచేసే విద్యను జపం చేస్తూ ఆ మాయను చూచినప్పుడు మాయాగ్ని ప్రవేశం చేయాలి, నేను దానిని ప్రబోధిస్తాను. నే నీ నదీతీరంలోనే ఉంటాను" అని చెప్పి తాను శుచి అయి, శుచి అయిన అతనికి ఉపదేశం చేసినాడు,

అంతట తీరంలో తానుండగా ఆ గురువునకు నమస్కరించి చంద్రస్వామి గబగబా నదిలో దిగినాడు. ఆ జలాంతరంలో ఆ

విద్యను జపిస్తూ త్వరలోనే మాయామోహితుడై తన జన్మనంతటినీ మరచి పోయినాడు. తాను మరొక పట్టణంలో ఒకానొక విప్రునకు పుత్రునిగా జన్మించినట్టు భావించుకున్నాడు. ఉపనయనం చేసుకొని వేదాధ్యయనం చేసి పెళ్ళి చేసుకొని ఆ సుఖ దుఃఖాలతో మోహితుడౌతూ క్రమంగా సంతానవంతుడైనాడు.

ఆ తర్వాత పితృస్నేహంతో ఆ యా పనులను చేస్తూ పితృ బాంధవులయందు అనురక్తుడై మిథ్యాజన్మను అనుభవిస్తూ వచ్చినాడు.

కొంతకాలమైన తర్వాత గురువు ప్రబోధినీ విద్యను ప్రయోగించినాడు. ఆ విద్యా ప్రయోగంతో ప్రబోధితుడై తన్నూ తన గురువునూ జ్ఞాపకం చేసుకొని ఇదంతా మాయాజాలమని తెలుసుకున్నాడు. దివ్యమూ, అసాధ్యమూ అయిన ఫలాన్ని పొందడం కోసం అగ్నిప్రవేశానికి ఉద్యమించినాడు. అతని మిత్రులు, ఆప్తులు, గురువులు, బంధువులూ వారించినా వినలేదు. వా రెంత చెప్పినా దివ్యసుఖాపేక్షతో బాంధవులతోపాటూ ఆ నదీతీరంలో చితి నేర్పరచుకున్నాడు. అక్కడ పూజ్యులైన తలిదండ్రులను మరణోద్యుక్తురాలైన భార్యను, ఏడుస్తున్న సంతానాన్నీ చూచి మోహంతో ఇలా చింతించినాడు.

"ఎంత కష్టం! ఎంత కష్టం! ఇక నా స్వజనులందరూ అగ్ని ప్రవేశం చేస్తారే. మా గురువుగారి మాట సత్యమో అసత్యమో తెలియదు! మరి అగ్నిలో ప్రవేశించనా? లేక మానివేయనా? అయినా గురువుగారి వాక్యం అబద్ధమెలా అవుతుంది?" అని అగ్నిప్రవేశం చేయవలెనని నిశ్చయించుకొని ఆ చంద్రస్వామి వహ్నిలో ప్రవేశించినాడు.

ఆ అగ్ని మంచువలె కనబడగా ఆశ్చర్యచకితుడై మాయ శాంతింపగా నదీతటంనుంచి బయటికిలేచి వచ్చినాడు. ఆ ఒడ్డున కూర్చొని ఉన్న గురువును చూచి ఆయన పాదాలకు నమస్కరించినాడు. ఆయన అడుగగా అగ్నిశైత్యం వరకూ తన కథను వివరించినాడు.

అప్పుడా గురు విలా అన్నాడు: "కుమారా! నీ వేదో అపచారం చేసినావని నా అనుమానం! లేకపోతే అగ్ని చల్లగా ఎలా ఉంటుంది? ఈ విద్యాసాధనలో అలాంటి దెప్పుడూ చూడ లేదు" అని గురువు అనగా చంద్రస్వామి ఇట్లా అన్నాడు:

"భగవాన్! నే నేమీ అపచారం చేయలేదు." అప్పుడా సంగతి తెలుసుకుందామని ఆ తపస్వి ఆ విద్యను స్మరించినాడు. అప్పుడా విద్య ప్రత్యక్షం కాలేదు. తనకూ కాలేదు. తన శిష్యునకూ కాలేదు. ఆ విధంగా వా రిరువురూ నష్టవిద్యులై విషణ్ణులై వెళ్ళిపోయినారు.

ఈ విధంగా బేతాళుడు కథను చెప్పి త్రివిక్రమసేనునకు తా మేర్పరచుకున్న సమయాన్ని జ్ఞాపకంచేసి ఇట్లా ప్రశ్నించి నాడు:

"రాజా! నా ఈ సంశయం తీర్చవలసింది. యథారీతిగా విహితమైనప్పటికీ వారిద్దరి విద్యా ఏ కారణంవల్ల నశించింది?"

ఆ బేతాళుని ప్రశ్నను విని రాజచంద్రు డిలా అన్నాడు: "నీవు ఈ విధంగా కాలక్షేపం చేస్తున్నావు. యోగేశ్వరా! అయి నప్పటికీ నేను చెప్తాను. ఎంత దుష్కరమైన కర్మ అయినా పరి శుద్ధమైన దానితోనే పురుషునికి సిద్ధి లభిస్తుంది. వికల్పశుద్ధము,

ధీరమూ, నిర్మలమూ అయిన మనసుంటేనే అది సాధ్యం. ఇక్కడ ఆ మూఢుడైన విప్రయువకుడు చిత్తం ప్రబోధించినా కొంత సంశయించినాడు. అందువల్లనే ఆ విద్య అతనికి సిద్ధింపలేదు. మరి అపాత్రదానంవల్ల గురువు విద్యకూడా నశించినది"

అని ఈ విధంగా రాజు స్పష్టంగా చెప్పగానే తిరిగీ బేతాళుడు భుజంపైనుండి క్రిందికి జారి అదృశ్యుడై తన స్థానానికి వెళ్ళిపోయినాడు.

వానిని వెతుక్కుంటూ రాజు తిరిగీ అతనిని వెన్నంటి నడచినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
ఇరవై ఐదో తరంగం

# ఇరవై ఆరో తరంగం

త్రివిక్రమసేన మహారాజు అశోకవృక్షంనుంచి ఆ బేతాళుని తీసుకొని, భుజంమీద వేసుకొని తిరిగి బయలుదేరినాడు. ఆ వస్తున్న అతనితో తిరిగి బేతాళుడు ఇట్లన్నాడు :

"ఓ రాజా! హృద్యమైన ఒక కథను చెప్తాను విను:

## 19 వ కథ

అమరావతి వంటి వక్రోలకం అనే పట్టణ మొకటి కలదు. అక్కడ సూర్యప్రభుడు దేవేంద్రసన్నిభుడైన రాజు కలడు. సూకరమూర్తిని ధరించి వసుంధరకు ఆనందం కల్పిస్తూ హరివలె భూమిని పైకెత్తి చిరకాలం ఆ భారాన్ని మోసినాడు. ధూమా శృంగంలో వర్షసంపాతము, శృంగారంలో మూర సంకథలు, ద్వారపాలకులలో హేమగండములు ఆ ప్రభుని రాజ్యంలో కాన వచ్చినవి.

సర్వసంపదలలో సమృద్ధుడైనప్పటికీ అతని కొక అసం తృప్తి మిగిలిపోయినది. అంతఃపుర కాంత లెందరున్నా అతనికి సంతానం కలగలేదు. ఈ సందర్భంలో తామ్రలిప్తిఅనే పట్నంలో ధనపాలుడనే ధనవంతుడైన వర్తకు డొక డున్నాడు. అతనికి ఒక్కగా నొక్క కుమార్తె ధనవతి అను పేరుగలది కలదు.

శాపచ్యుతురాలైన విద్యాధరి ఆమె అని ఆమె సౌంద ర్యమే సూచిస్తుంటుంది. ఆమె యౌవనవతి అయ్యేసరికి ఆ వర్తకుడు చనిపోయినాడు. అతని ధనమంతా రాజాభిప్రాయంతో అతని దాయాదులు ఆక్రమించుకున్నారు.

అంతట హిరణ్యవతి అనే ఆ వర్తకుని భార్య దాచిపెట్టిన తన రత్నాభరణాలను తీసుకొని, తన కుమార్తె ధనవతితో పాటూ చీకటిపడగానే దాయాదుల భయంవల్ల తన ఇంటినుంచి పలాయనం చిత్తగించింది.

బయట చీకటివల్లను, తన మనసులోని దుఃఖాంధకారం వల్లను ఆమెకేమీ కన్పించలేదు. ఎంతో కష్టంమీద కూతురు చేతిని పట్టుకొని పట్టణం వెలుపలికి వచ్చినది. ఆ చీకటిలో వెడుతూ దైవవశాత్తూ శూలానికి వేలాడవేసిన దొంగకు తన భుజం తగిలినది. అతనింకా బ్రతికే ఉన్నాడు గనుక ఆ దెబ్బతో మిక్కిలి బాధపడినాడు. "పుండుపై కారం చల్లినట్టు ఈ పని చేసిందెవరు?" అని అన్నాడు.

అప్పుడా వర్తకుని భార్య "నీవెవరవు?" అని ప్రశ్నించింది. అప్పుడా చోరుడు ఇట్లన్నాడు: "శూలానికి వేసిన చోరుడను నేను. ఈ పాపిష్ఠివాని ప్రాణాలు ఇప్పటికీ పోలేదు. అమ్మా! నీవెవరవు? ఎక్కడికి వెడుతున్నావు?''

ఆ మాటవిని ఆమె తన వృత్తాంతాన్ని చెప్పివేసినది. అప్పటికి తూర్పున చంద్రోదయమై ఆ దిఙ్ముఖం తిలకం పెట్టినట్టు ప్రకాశించినది. అప్పుడు దిక్కులు తెల్లవడగా ఆ దొంగ వర్తకుని కుమారి అయిన ధనవతిని చూచి ఆమె తల్లితో ఇట్లన్నాడు: అమ్మా! నా ప్రార్థన ఒకటి విను. నేను వేయి బంగారు దీనారాలను ఇస్తాను. నీ కూతురైన ఈ కన్యకను నాకివ్వు. అపుత్రకునికి గతులు లేవని పెద్దలంటారు. ఈమె నా ఆజ్ఞతో పుత్రునికంటే కనీసం క్షేత్రజుడు నాకొకడుంటాడు. కాబట్టి నేనీ ప్రార్థన చేస్తున్నాను. నీవు నా కోర్కెను తీర్చవలసింది."

ఆ మాట విని ఆ వర్తకుని భార్య లోభంవల్ల అందుకంగీక రించినది. ఎక్కడినుంచో నీరు తీసుకొనివచ్చి, ఆ దొంగ చేతిలో వదలుతూ ఈ నా కుమార్తెను నీకు దానం చేస్తున్నాను అన్నది. అతడు కూడా ఆ కుమార్తెను స్వీకరించి ఇలా అన్నాడు :

ఈ మర్రిచెట్టు క్రిందికి వెళ్ళి స్నానంచేసి ఆ సువర్ణాన్ని తీసుకో. నా ప్రాణాలు పోగానే ఏదో యుక్తితో దహనంచేసి నా అస్థికలను తీసుకొని, నీ కూతురితో పాటూ వెళ్ళి తీర్థంలో కలిపి వక్రోలకపురానికి వెళ్ళు.

అక్కడ సూర్యప్రభు డనే రాజు పరిపాలిస్తుండగా జనం సుఖంగా ఉన్నారు. నీవు కూడా నిరుపద్రవంగా, నిశ్చింతగా స్వేచ్ఛగా అక్కడ ఉండవచ్చును" అని చెప్పి దప్పిగొన్న ఆ దొంగ, ఆమె తెచ్చియిచ్చిన నీటిని త్రావి, శూలవ్యథతో ప్రాణాలు వదలివేసినాడు.

అంతట ఆ వర్తక స్త్రీ వటతరుతలం నుంచి స్వర్ణాన్ని తీసుకొని కుమార్తెతో పాటూ గుప్తంగా తన భర్త స్నేహితుని ఇంటికి వెళ్ళినది. అక్కడే ఉండి ఏదో యుక్తితో ఆ దొంగ కళే బరాన్ని దహనం చేసి ఆ తీర్థంలో అస్థిక్షేపాదులను నిర్వర్తించి నది.

మరునాడు సంగతి తెలుసుకొని కుమార్తెతోపాటూ బయలు దేరి వెడుతూ క్రమంగా వక్రోలకం పట్టణాన్ని చేరుకున్నది.

అక్కడ వసుదత్తాఖ్యుడను వర్తకుని నుంచి ఒక ఇల్లు కొని ఆ కుమార్తెతో పాటూ ఆ ఇంటిలో నివసించసాగినది. అక్కడ విష్ణుస్వామి అనే ఉపాధ్యాయుడు ఒక డున్నాడు. మనస్స్వామి అనే శిష్యుడు అతనికి కలడు. అతను అతి రూపవంతుడు,

విద్యాభిని యుక్తు డైనప్పటికీ యౌవనవశీకృతుడై హంసావళి అనే విలాసినిని మోహించినాడు. ఆమెకూడా ఐదువందల దీనా రాలను గ్రహిస్తూ విటుల నలరిస్తున్నది. తన కా డబ్బు సరిగా అందడం లేదని ఆ విప్రకుమారుని బాధ.

ఒకసారి వణిక్కుమార్తె ధనవతి, తన హర్మ్యంనుండి, పాలిపోయినా అందంగా ఉన్న అతనిని చూచినది. అత నామెతో అపహృత చిత్తుడైనాడు. తన భర్త అయిన దొంగ తనకు అనుజ్ఞ నిచ్చెనని జ్ఞాపకం చేసుకొని, తన వద్దనే ఉన్న తల్లితో యుక్తిగా ధనవతి ఇట్లన్నది:

"అమ్మా! ఈ విప్రకుమారుని రూపయౌవనాలను చూడు. అవి ప్రపంచ నేత్రామృతవృష్టులుగా ఉన్నవి."

ఈ మాట వినగానే కుమార్తె అతనిపై మరులు కొన్నదని గ్రహించి తల్లి మనసులో ఇలా అనుకున్నది: నా కుమార్తె కుమారుని కోసమై ఎవరినో వరించవలెను. అది ఆమె భర్త ఆజ్ఞ. కాబట్టి ఆమె దానినే అడుగుతున్నది" అని ఆలోచించుకొని తన సందేశంతో, రహస్యంతో, రహస్యధారిణి అయిన ఒక చేటిని అతని వద్దకు పంపినది.

ఆ చేటి అతనిని ఒక నిర్జన ప్రదేశానికి తీసుకొని వెళ్ళి ఈ సంగతిని చెప్పి ఇట్లన్నది. ఆ విప్రకుమారుడు వ్యసనంతో ఇట్లన్నాడు: "హంసావళికోసమై ఐదువందల బంగారుదీనారాలనిస్తే దానితో ఒక రాత్రిని ఆమెతో గడిపివస్తాను."

ఆ మాట చెప్పగా ఆ చేటి వెళ్ళి వర్తక స్త్రీకి చెప్పినది. ఆమె ధనాన్ని ఆ చేటి చేతికే ఇచ్చిపంపినది. అది తీసుకొని

మనస్స్వామి ధనవతి పంపిన ఆ చేటికతో ఆమె కూతురు ఇంటికే వెళ్ళినాడు.

అక్కడ అత్యంత ఉత్కంఠతో భూతలానికే భూషణంగా ఉన్న ఆ కాంతను, చంద్రికను చకోరం వలె చూచినాడు. హర్షించినాడు. ఆమెతో పాటూ సంభోగలీలలో రాత్రి గడిపి తెల్లవారు జాముననే వచ్చిన దారినే గుప్తంగా వెళ్ళిపోయినాడు. ఆ ధనవతి కూడా గర్భవతి అయినది. కాలక్రమేణా సులక్షణుడైన పుత్రుని కన్నది.

ఆ విధంగా సంతుష్టురాలైన ఆమెకు కలలో మహేశ్వరుడు కనబడి ఇలా ఆదేశించినాడు: "కాంచన సహస్రంతో ఈ బాలుని, సూర్యప్రభనృపాలుని ద్వారంవద్ద వదలివేసి రావలసింది. అలా అయితే మికు క్షేమం కలుగుతుంది'' అని ఆ హరుడు వచిక్కున్న తకూ, ఆమె తల్లికీకూడా చెప్పగా ఉదయమేలేచి వారిద్దరూ అన్యోన్యం సంప్రతించుకున్నారు.

వారు భగవంతుని మీద విశ్వాసంతో ఆ శిశువును తీసుకొని వెళ్ళి సూర్యప్రభ మహారాజు సింహద్వారంవద్ద బంగారం బుట్టలో దానితో పాటూ ఉంచినారు.

అంతట కొడుకుకోసం దిగులు పడుతున్న సూర్యప్రభ మహారాజునకు కూడా ఈశ్వరుడు కలలో కన్పించి ఆజ్ఞాపించినాడు. ఓ రాజా! లేచి వెళ్ళు. నీకోసమై బంగారంతో పాటూ, సింహద్వారంలో ఒక బాలుడున్నాడు. ఎవరో తెచ్చి మంచకంపై ఉంచిన వానిని తీసుకొమ్ము.''

ఉదయమే నిద్రలేచి ద్వారపాలకులు చెప్పగా బయటికి వచ్చి స్వయంగా చూచినాడు. సింహద్వారంలో ఆ బాలు డలా

కనకోత్కరంతో కనిపించినాడు. "రేఖాచ్ఛత్రధ్వజాదులతో అంకిత మైన హస్తపాదాతుల శుభాకృతిని ఈశ్వరుడు నాకై ఉచితంగా పుత్రుడుగా దానం చేసినాడు" అనుకొని తన చేతులతోనే వానిని ఎత్తుకొని రాజధానికి వెళ్ళినాడు. గొప్ప పండుగ చేసు కున్నాడు. అనంతంగా ధనాన్ని దానం చేసినాడు. అప్పుడు దరిద్ర శబ్ద మొక్కటే నిరర్థకమైనది.

నృత్తవాద్యాదులతో పన్నెండు రోజులు గడిపి ఆ కుమారు నకు చంద్రప్రభుడను నామకరణం చేసినాడు. ఆ పుత్రుడు క్రమంగా వృద్ధిచెందినాడు. అతని శరీరమే కాదు గుణ సమూ హం కూడా ఆశ్రితానందదాయిని అయినది.

క్రమంగా ఆ యువకుడు శౌర్యంతో, ఔదార్యంతో ఆవర్జి తుడై భూభార వహనానికి సమర్థుడైనాడు. అలాంటివానిని చూచి తండ్రి సూర్యప్రభుడు రాజ్యానికి పట్టంకట్టి వృద్ధుడైన తాను వారాణసికి వెళ్ళిపోయినాడు.

మరి పుత్రుడు నీతిశాలి భూమిని పాలించుచుండగా ఆ రాజు తీవ్ర తపస్సుతో తనువును చాలించినాడు. తండ్రికి వచ్చిన విపత్తును గ్రహించి అతనిని గూర్చి దుఃఖించి కృతక్రియుడై చంద్రప్రభ మహారాజు ధార్మికుడు గనుక మంత్రులతో ఇట్ల న్నాడు :

"తండ్రిగారి ఋణం నుంచి నే నే విధంగా విముక్తుడను కాగలను? అయినప్పటికీ నా చేతితో దీని కొక నిష్కృతి కల్పి స్తాను. ఆయన అస్థికలను తీసుకొని వెళ్ళి గంగలో కలువుతాను. గయకు వెళ్ళి అక్కడ పితరులందరకూ పిండ ప్రదానం చేస్తాను. ఆనుషంగికంగా సముద్రం వరకూ తీర్థయాత్రలు చేస్తాను."

ఈ విధంగా చెప్తున్న రాజుతో ఆ మంత్రు లిట్లన్నారు: "దేవా! ప్రభు వెప్పుడూ ఇలాంటి పని చేయకూడదు. బహుచ్ఛిద్ర మైన రాజ్యం సరి అయిన రక్షణ లేకపోతే ఒక క్షణం కూడా ఉండదు. కావున ఈ పితృప్రక్రియను మరొకరిద్వారా చేయించ వలసింది. స్వధర్మపాలనం కంటే మరొక తీర్థయాత్ర మీకు కావ లెనా? నిత్య రక్షితులుగా ఉండవలసిన రాజులకు బహువిపత్తు లతో నిండిన పాంథత్వం ఎలా సరిపడుతుంది?" అని ఆ మంత్రులు చెప్పగా రాజు చంద్రప్రభు డిట్లన్నాడు:

"ఈ వికల్పాలన్నీ ఎందుకు? తండ్రికోసమై నేను తప్ప కుండా వెళ్ళదలచుకున్నాను. నా వయస్సు ఓర్చుకోగలిగినంత వరకూ తీర్థా లన్నిటినీ చూస్తాను. ఆ తర్వాత ఏం జరుగనున్నదో ఎవరికి తెలుసు? శరీరం క్షణభంగురమైనది. రాజ్యాన్ని నేను వచ్చేవరకూ మీరే రక్షించుకోవలసి ఉంటుంది." ఈ రాజు నిశ్చ యాన్ని విని మంత్రులు మిన్నకున్నారు.

ఆ తర్వాత ఆ రాజు ప్రయాణ సన్నాహా లన్నీ చేసు కున్నాడు. ఒకానొక సుదినంలో స్నానంచేసి, హోమంచేసి, విప్రు లను పూజించి, చక్కగా సజ్జీకృతమైన రథాన్నెక్కి శాంత వేషంతో బయలుదేరినాడు. సామంతులను రాజపుత్రులను, పౌరు లను జానపదులను ఎంత ఇష్టంలేకున్నా వెనుకకు వెళ్ళమని నివా రించినాడు. వారు పొలిమేరదాకా రాజును సాగనంపినారు.

బ్రాహ్మలు, పురోహితునితో పాటూ వాహనారూఢులై ఆయ నతో పయనించినారు. రాజేమో మంత్రులపై రాజ్యభారాన్ని ఉంచినాడు. విచిత్ర వేషభాషాదులతో వినోదం కల్పిస్తుండగా క్రమంగా నానావిధ దేశాలను చూస్తూ గంగానదిని చేరుకున్నాడు.

అక్కడ జలకల్లోల పంక్తులతో స్వర్గారోహణానికి జనం కోసమై సోపానాలను సృష్టిస్తున్నదా అన్నట్టున్న ఆ నదిని చూచినారు. హిమవంతంలో పుట్టి ఈశ్వరుని జటాజూటంలో చిక్కి, అంబికాలీలను వహిస్తూ దేవర్షి గణాంకితమైన ఆ నదివద్ద రథం నుంచి దిగి, యథావిధిగా అందులో స్నానంచేసి ఆ రాజు, తన తండ్రి సూర్యప్రభ మహారాజు అస్థికలను అందులో కలిపివేసినాడు. దానాదులను చేసి శ్రాద్ధాన్ని నిర్వర్తించి, రథారూఢుడై అక్కడినుంచి బయలుదేరి క్రమంగా ఋషిసంస్తుతమైన ప్రయాగను చేరుకున్నాడు.

అక్కడ మనుష్యులకు సుగతి కలగడంకోసం అర్చిర్మార్గం, ధూమమార్గంవలె గంగాయమునలు సంగమిస్తుంటాయి. అక్కడ దిగి స్నాన దాన శ్రాద్ధాదులను నిర్వర్తించి చంద్రప్రభభూపతి వారాణసికి వెళ్ళిపోయినాడు. "రండి మోక్షానికి పొండి" అని చెప్తున్నట్టుగా గాలికి ఊగుతూ పైకి లేస్తూ సురసద్మధ్వజాంశుకములు కానవచ్చినవి. అక్కడ మూడురోజు లాగి ఉపవసించి వృషధ్వజుని సేవించి, నిజోచితభోగాలతో గయకు వెళ్ళినాడు. అక్కడ పండ్లతో కొమ్మలు వాలిపోతుండగా, పక్షులు కలకూజితాలు చేస్తుండగా అక్కడి పాదపాలు ఆయన కాళ్ళకు నమస్కరించి స్తోత్రం చేస్తున్నట్టుగా కానవచ్చినవి.

గాలితో రాలిపడుతున్న పూలు అతనిని అర్చిస్తున్నట్టున్నవి. ఇలాంటి నానారణ్యాలను దాటి గయాశీర్షాన్ని చేరుకున్నాడు.

అక్కడకూడా శ్రాద్ధాన్ని విధి విధానం ప్రకారం నడిపించి భూరి సంభావన లిచ్చి, చంద్రప్రభ మహారాజు ధర్మారణ్యాన్ని చేరుకున్నాడు.

దయాకూపంలో తదనంతరం ఆయన పిండప్రదానం చేయగా దానిని తీసుకొనుటకై మూడుచేతులు పైకివచ్చినవి. అది చూడగానే విభ్రాంతుడై ఆ పార్థివుడు ఈ చేతులలో దేనిలో పిండం వేయవలెనని తనతో వచ్చిన బ్రాహ్మలను ప్రశ్నించినాడు.

వారు ఆయనతో ఇట్లన్నారు: "ఇందులో ఒక చేయి లోహ మయమైన మేకు కలిగి వుంది. ఇది చోరుని దనడం నిశ్చయం, రెండవ దేమో బ్రాహ్మణుని చేయి: పవిత్రంతో ఉన్నది. మూడవ దేమో రాజు చేయి: అది అంగుళీయంతో సులక్షణంగా ఉన్నది. కాబట్టి ఈ పిండం ఏ చేతిలో వేయవలెనో అందుతో ఏమౌతుందో మాకు తెలియడం లేదు'' అని బ్రాహ్మలు చెప్పగా రాజు ఏ నిశ్చయానికీ రాలేకపోయినాడు—

ఈ చిత్రమైన కథను బేతాళుడు భుజంపైనుండి త్రివిక్రమ సేన మహారాజుతో చెప్పి తిరిగి ఇలా ప్రశ్నించినాడు:

"ఆ పిండం ఆ మూడు చేతులలో దేనిలో వేయవలెనో చెప్పవలసింది, తెలిసీ చెప్పకపోతే నీ తల వేయి వ్రక్కలౌతుం దన్న మన సమయం నీకు జ్ఞాపకమున్నది కదా!''

ఈ బేతాళుని మాటలు విని మౌనాన్ని వదలి ధర్మజ్ఞుడైన త్రివిక్రమసేన మహారాజు ఇలా అన్నాడు:

"చోరుని హస్తంలోనే ఆ పిండాన్ని వేయాలి. ఇతడు వానికి క్షేత్రజుడు. ఈ చంద్రప్రభుడు అతని కొడుకే కానీ మరొ కని కొడుకు కాదు. అతను ఆమెతో ఒక రాత్రి ఉండి ధనానికి తన్ను అమ్ముకున్నాడు కదా!

రాజు సూర్యప్రభునకు కూడా, సంస్కారాదులతో పెంచి నప్పటికీ కొడుకు కాదు. అతను తనకు కావలసిన ధనాన్ని తనే

పెట్టుకున్నాడు. ఆ శిశువు తల దగ్గర మంచస్థమైన కాంచనం ఉండెను కదా! అదే వానిని పెంచి పెద్దచేయడానికి సరిపోయినది.

కాబట్టి ఆమె తల్లి ఈమెను ఆ దొంగకు ధారాదత్తం చేసినది. ఆమె ధనమంతా ఆమెకే ఇచ్చినది. కాబట్టి ఆ చోరునికి క్షేత్రజుడైన పుత్రుడితను. కాబట్టి పిండం అతని చేతిలోనే పెట్టవలసిందే అని నేననుకుంటాను''

అని ఇట్లా చెప్పగానే బేతాళుడు భుజంమీది నుంచి జారిపోయి తన తావునకు వెళ్ళిపోయినాడు.

తిరిగీ అతనిని వెదకిపట్టుకొనుటకై త్రివిక్రమసేన మహారాజు కూడా బయలుదేరినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీలంబకంలోని
ఇరవై ఆరో తరంగం.

# ఇరవై ఏడో తరంగం

ఆ తర్వాత త్రివిక్రమసేన మహారాజు అశోకవృక్షం వద్దకు వెళ్ళి బేతాళుని తీసుకొని భుజంమీద వేసుకొని తిరిగి బయలుదేరి నాడు.

మౌనంగా వెడుతున్న ఆ రాజుతో బేతాళు డిలా అన్నాడు: "ఓ రాజా! నీ కీ తగులాట మేమిటి? హాయిగా వెళ్ళి రాజ్యసుఖం అనుభవించు. ఆ పాడు భిక్షుకుని వద్దకు నన్ను తీసుకొని పోవడం నీకు తగదు. అ దలా ఉండనీ. ఇంకొక కథ చెప్తాను విను:

## 20వ కథ

చిత్రకూటాఖ్య మనే సార్థకనామధేయం కల చిత్రకూట నగరం కలదు. అక్కడ ప్రణయిచక్షువులకు అమృతాసారవర్షి అయిన చంద్రాలోకం వలె రాజ శిఖామణి అయిన రాజు కలడు. ఆయన శౌర్యహస్తికి ఆలానం వంటివాడు. త్యాగానికి ఉత్పత్తి స్థానం వంటివాడు. రూపానికి విలాసరూపంవంటివాడు అని విచక్షణులు ప్రశంసిస్తుంటారు.

సర్వసంపదలూ ఉన్నప్పటికీ తనకు తగిన భార్య దొరక లేదు. అదొకటే ఆ యువకుని మనసులో ఉన్న చింత.

ఒకసారి ఆ ఉద్వేగాన్ని మరచి వినోదించుటకై అశ్వ దళంతో పాటూ వేటకోసం ఒక మహారణ్యంలోనికి ప్రవేశించినాడు. శ్యామలాంబరరోచిష్ణుడైన సూర్యుడు తనకిరణాలతో చీకటులను భేదించినట్టు నిరంతరాయంగా వదలుతున్న బాణాలతో సూకర బృందాలను వధిస్తూ సమర దుర్మదములైన సింహాలను తెల్లని

జూలుతో భయంకరంగా ఉన్నవానిని అర్జునాధిక విక్రముడైన అతను శరశయ్యలపై పడుకొనజేసినాడు. మహేంద్ర విక్రముడైన అతను వజ్రకర్కశమైన ప్రాసపాతాలతో పర్వత సదృశాలైన శరభాలను విపక్షీకరించినాడు.

ఏదో చూడవలెనన్న కుతూహలం కొద్దీ ఏకాకిగా వనాభ్యంతరంలోనికి వెళ్ళవలెనని తీవ్ర ప్రహారాలతో గుర్రాన్ని ప్రేరేపించినాడు. ఆ కశాఘాతాలతో ఉత్తేజితమైన ఆ అశ్వం ఎగుడు దిగుడులను కూడా గమనించకుండా వాయువేగ మనోవేగాలతో అతనిని వనాంతరంలోనికి కొనిపోయినది.

ఇంద్రియోద్వృత్తి మోహితుడైన అతనిని పదియోజనాల దూరం తీసుకొని పోయినది. అక్కడ ఉన్న ప్రవాహంవద్ద రాజు దిఙ్మూఢుడై ఊరకే తిరుగుతూ, శ్రాంతుడై కొంచెం దూరంలో ఒక విశాలమైన సరస్సును కనుగొన్నాడు. ఎదురుగాలికి వంగుతూ లేస్తూ ఇటు రమ్మని చేతులతో సంజ్ఞచేస్తున్నట్టుగా అక్కడ తామర పూలు కానవచ్చినవి.

అక్కడికి వెళ్ళి గుర్రాన్ని జీను విప్పి, స్నానం చేయించి, నీరు త్రాపి, గడ్డి వేసి ఆ చెట్టు నీడలో కట్టివేసినాడు. తానుకూడా స్నానం చేసి నీరు త్రావి అలత తీర్చుకొని రమణీయాలైన ఆ ప్రదేశాలను అటూ ఇటూ చూచినాడు.

ఒకచోట అశోకవృక్షం క్రింద ఒక మునికన్యకను కనుగొన్నాడు. పుష్పాభరణాలను వేసుకొని వల్కలాంశుకాలతో శోభిల్లుతూ వెంట్రుకలను జటాజూటంవలె కట్టుకొని మనోహరంగా ఉన్నట్టి, సఖీద్వితీయ అయిన, అద్భుత రూపవతి అయిన ఆమెను చూచినాడు.

పుష్పబాణుని శరగోచరుడై ఇలా అనుకున్నాడు: "ఎవరీమె? స్నానం చేయడానికి సరస్సునకు సావిత్రీదేవే వచ్చినదా? లేక మహేశ్వరుని ఒడినుండి పడిపోయి గౌరీదేవి తిరిగి తపస్సు చేస్తున్నదా? పగలు అస్తంగతుడైన చంద్రుని కాంతి వ్రతమాచరిస్తున్నదా? ఈమె దగ్గరకు మెల్లగా వెళ్ళి ఏదో వరాన్ని సంపాదిస్తాను." ఇలా అనుకుంటూ ఆ రాజు ఆ కన్య దగ్గరకు వెళ్ళినాడు.

ఆమె కూడా తనవేపు వస్తున్న అతనిని చూచి అతని రూపంతో చూపుబెదరినదై పూర్వమే అల్లి చేతపట్టుకొని ఉన్న పూలమాలతో ఇలా ఆలోచించినది: "ఇలాంటి అరణ్యంలో ఇత నెవ్వడు? సిద్ధుడా? విద్యాధరుడా? ఇతని రూపం ప్రపంచానికే కనులపండువుగా ఉన్నది." ఈ విధంగా వితర్కించుకొని, సిగ్గుతో ఓరచూపులతో చూస్తూ, లేచి ఊరుస్తంభభారంతోనే వెళ్ళి పోవడానికి ప్రయత్నించినది.

ఆమెను సమీపించి నాగరకుడైన మహారాజు ఇట్లా అన్నాడు. "నిన్ను తొలిసారి చూడగనే దర్శనైక ఫలార్థి అయిన నాకు, దూరంనుంచి వచ్చిన వానికి, స్వాగతాదులివ్వడం మాట అటుంచి ఇక్కడినుంచి వెళ్ళిపోవడం ఆశ్రమ వాసుల ధర్మమా?" అని ఆ రాజు అడుగగా, విచక్షణకల ఆమె సఖి, రాజు నక్కడ కూర్చుండబెట్టి అతిథి సత్కారం నిర్వర్తించినది.

ఆ తర్వాత ఉత్సుకుడై ప్రణయి అయిన ఆ రాజు ఈ విధంగా ప్రశ్నించినాడు: "ఓ కల్యాణీ! నీ సఖితో ఏ పుణ్య వంతుని వంశం అలంకృతమైనది? చెవులకు అమృతవర్షం కురి పించే ఈమె నామాక్షరాలేవి? పుష్పసుకుమారమైన తన శరీరాన్ని తాపసోచితమైన వృత్తితో, విజనమైన ఈ అడవిలో ఎందుకు

వ్యర్థం చేసుకుంటున్నది?" ఈ రాజుమాట విని ఆ చెలి ఇలా జవాబిచ్చినది:

"ఈమె కణ్వమహర్షి కుమార్తె. ఆయన ఆశ్రమంలో పెరుగుతున్నది. మేనకవల్ల జన్మించిన ఈ కన్యపేరు ఇందీవర ప్రభ. పితాజ్ఞతో ఈ సరస్సులో స్నానం చేయడానికై వచ్చినది. ఇక్కడికి సమీపంలోనే ఈమె తండ్రి ఆశ్రమం ఉన్నది'' అని చెప్పగా సంతుష్టుడైన ఆ రాజు, తన తురంగము నెక్కి ఆమెను తన కిమ్మని కణ్వుని యాచించుటకై ఆ ఆశ్రమానికి వెళ్ళినాడు.

అక్కడికి వెళ్ళి బయటనే వాహనాన్ని కట్టివేసి వినీతుడై లోనికి ప్రవేశించినాడు. జటావల్కలధారులైన పాదపములతో వలె తాపసులతో ఆ ఆశ్రమం నిండిఉన్నది. ఆ నడుమ ఋషులతో పరివృతుడై, తేజస్సుతో ఆహ్లాదం కల్పిస్తూ గ్రహపరివృతుడైన చంద్రునివలె ఆ కణ్వముని కనిపించినాడు.

ఆయన దగ్గరకు వెళ్ళి పాదాభివందనం చేసినాడు. ఆతిథ్య విశ్రాంతులను కల్పించి ఆ జ్ఞాని ఇట్లా అన్నాడు: "కుమారా! నేను చెప్తున్న హితవచనాలను విను. ఈ ప్రపంచంలో ప్రాణులకు మృత్యుభయ మన్నది ఉన్నదని నీకు తెలుసు. అకారణంగా పాపం ఈ మృగాల నెందుకు సంహరిస్తావు? శస్త్రాన్ని బ్రహ్మ నిర్మించి క్షత్రియుని కిచ్చినాడంటే అది భయభ్రాంతులైన ప్రాణులను రక్షించుటకే కాబట్టి ధర్మంతో ప్రజలను రక్షించు. కంటకాలను తొలగించు. హస్త్యశ్వ అస్త్రాది యోగ్యాలైన అభ్యాసాలతో చల లక్ష్యాదులను సాధించు. రాజ్య సుఖాన్ని అనుభవించు. ధనాన్ని దానంచెయ్యి. దిక్కులలో నీకీర్తిని వెదజల్లు. కృతాంతక్రీడితమైన హింసాభరితమైన మృగయా వ్యసనాన్ని వదలిపెట్టు. ఇందులో

హంతకూ వధ్యులకూ కూడా ప్రమాదం సమానమే. అనేక అనర్థ కాలకూ కారణమన్న పాండు చరిత్ర నీవు వినలేదా ?"

ఈ విధంగా కణ్వముని చెప్పిన మాటలు విని అభినందించి, అర్థజ్ఞుడైన చంద్రావలోక మహారాజు ఇట్లా అన్నాడు: "భగవాన్, మీ బోధలను అవగతం చేసుకున్నాను. మీరు నాపై ఎంతో అను గ్రహం చూపినారు. నే నిక వేటను విడిచిపెడతాను. ప్రాణు లన్నీ నిర్భయంగా బ్రతుకనీ."

ఆ మాటవిన్న ముని సంతుష్టుడై "ప్రాణులకు నీవు అభయ మివ్వడం వల్ల ప్రసన్నుడనైన నేను నీవు కోరిన వర మిస్తాను, గ్రహించు" అన్నాడు.

ఆ మాటవిని కాలజ్ఞుడైన రాజు ఆ మునితో ఇట్లన్నాడు: "మీరు నా ఎడల సంతృప్తి చెంది ఉంటే మీ కుమార్తె ఇందీవర ప్రభను నాకు ఇవ్వవలసింది" అని రాజు అర్థింపగా అప్సర స్సంభవ, అనురూపవతి అయిన ఆ కన్యను ముని అతనికి దానం చేసినాడు. తర్వాత ముని భార్యలు అలంకరింపగా వివాహం చేసినాడు. రాజువెంట ఆమె బయలుదేరినది. తమ ఆశ్రమం నుంచి వెడుతున్న ఆమెవెంట కన్నీరు పెట్టుకుంటూ తాపసులు వస్తుండగా వారిని అనునయించి తన భార్య అయిన ఇందీవరప్రభను తన గుర్రంపై ఎక్కించుకొని చంద్రావలోక మహారాజు త్వరగా అక్కడినుంచి బయలుదేరినాడు.

అత నలా వెడుతుండగా ఆ దినచేష్టితా లన్నిటినీ చూచిన రవి ఖిన్నునివలె అస్తాద్రి మస్తకంపై అధివసించినాడు. క్రమంగా ఉద్రిక్త మన్మథ అయి మృగనేత్ర అయిన రాత్రి అనే అభిసారిక అంధకార నీల పటచ్ఛన్నరూప అయి వచ్చినది. ఆ సమయంలో

దారిలో ఒక అశ్వత్థ వృక్షం కనబడినది. ఆ చెట్టు దగ్గర ఒక బావి ఉన్నది. సజ్జనాశయమువలె అందలి నీరు స్వచ్ఛంగా ఉన్నది. ఆ కొమ్మలనుంచి రాలిన ఆకులతోనిండి శాద్వల శ్యామలమైన ఆ స్థలంలో ఆ రాత్రికి బసచేయవలె నని ఆయన అనుకున్నాడు.

తర్వాత గుర్రం మీదినుంచి దిగి దానికి తృణోదకాలనిచ్చి ఆ బావి ఒడ్డున విశ్రమించినాడు. ఆ నీటిపైనుంచి వచ్చేగాలి చల్లగా ఉన్నది. ఆ మునిపుత్రికతో పాటూ ఆ చెట్టుక్రింద పూలతో సమకూర్చిన సెజ్జపై ఆ రాజు పడుకున్నాడు. ఆ క్షణంలోనే తిమిరాంశుకాన్ని తొలగించి రాగయుక్తమైన ప్రాచీవదనాన్ని చంద్రుడు చుంబించినాడు.

చంద్రకిరణాలతో సమాశ్లిష్టములై, వీతమానావకాశములై దిక్కులన్నీ తెల్లవడినవి. ఇంతలో లతాగుల్మ వివరాలనుంచి చంద్రకరములు ప్రసారితము లైనవి. వాటితో రత్నదీపాలతోవలె ఆ తరుమూలం ప్రకాశించినది.

ఆ రాజుకూడా ఇందీవరప్రభను ఆలింగనం చేసుకొని నవ సంగమ కుతూహల సరసమైన సురతోత్సవానికి దిగినాడు. ఆమె సిగ్గునువలె ఆమె నీవీ బంధాన్ని విప్పివేసినాడు. ముగ్ధభావం వలె ఆమె అధరాన్ని దంతక్షతాలతో నింపివేసినాడు. యౌవన ద్వీపకుంభాలవంటి ఆమె వక్షోజాలపై నఖక్షతాలతో సద్రత్న నవ నక్షత్రమాలికను సృష్టించినాడు. ముఖాన్ని, కపోలాలను, నేత్రాల్ని పదే పదే చుంబించినాడు. పలుతావులనుండి లావణ్యామృత నిష్యందాన్ని త్రావినాడు.

ఈ విధంగా నిధువన క్రీడా సుఖంతో ఆ కన్యతో పాటూ ఆ రాజు ఆ రాత్రిని ఒక నిముసం వలె గడిపివేసినాడు.

ఉదయమే మేల్కొని సంధ్యావందనాదులు పూర్తి చేసి తన సైన్యాన్ని కలుసుకొనుటకై వధూసఖుడై ఆ భూపతి బయలు దేరినాడు. అంతలో ఆ రాత్రి నిశాసతి లుప్తాబ్జఖండ శోభుడైన చంద్రుని భయంతోవలె అస్తాద్రి కుహరంలో దాచిపెట్టింది. సూర్యుడు క్రోధంతో చంపనెంచిన వానివలె ఎర్రబడి తన కిరణాలను ప్రసారంచేసి మండలాగ్రాన్ని నిక్షిప్తంచేసినాడు.

అకస్మాత్తుగా అక్కడికి మెరుపువలె పచ్చనైన వెంట్రుకలు కలవాడు, కాటుకవలె నల్లనైనవాడు, కాలమేఘం వంటివాడు అయిన ఒక బ్రహ్మరాక్షసుడు ప్రేవులను మాలలుగా తలకు చుట్టుకొని కేశయజ్ఞోపవీతాన్ని వేసుకుని నరశిరోమాంసాన్ని తింటూ కపాలంలోని రక్తాన్ని త్రావుతూ అట్టహాసం చేస్తూ, తన ముఖం నుంచి కోపంతో అగ్నిని వర్షిస్తూ దంష్ట్రాకరాళుడై భీకరంగా ఆ రాజుతో ఇట్లన్నాడు: "ఓ పాపీ! జ్వాలాముఖుడనే బ్రహ్మరాక్షసుడను నేను. ఈ అశ్వత్థం నా నివాస స్థలం. దీనిని వేదాలు కూడా అతిక్రమింపలేవు. అలాంటి నా స్థలాన్ని ఆక్రమించి స్త్రీతో పాటూ అనుభవించినావు. రాత్రిచర్యవల్ల కలిగిన అవినీతికి ఫలాన్ని ఇప్పుడు అనుభవించు.

దురాచారుడా! నేను కామోపహత చేతస్కుడనైన నీ హృదయాన్ని ఉత్పాటనంచేసి భక్షిస్తాను. నీ రక్తాన్ని తాగుతాను."

ఆ మాట విని ఆ ఘోరస్వరూపుని అవధ్యునిగా భావించి తన భార్య భయపడుతుండగా తానూ భయపడుతూ వినయంగా ఇట్లా అన్నాడు: తెలియక నేను చేసిన అపరాధాన్ని మన్నించవలసింది. నీ ఈ ఆశ్రమంలో నేను అతిథిని. శరణాగతుడను. నీవు కోరిన పురుషుని పశువుగా నీకు సమర్పిస్తాను. నీకు తృప్తి కలిగేలా చేస్తాను. కాబట్టి కోపం మాని ప్రసన్నుడవు కా!"

ఈ రాజుమాటలు విని శాంతుడై ఆ బ్రహ్మరాక్షసుడు పోనీలే, ఇందులో తప్పే మున్నదనుకొని ఇట్లా అన్నాడు: "ఎవడైతే సప్తవర్ష దేశ్యుడైన మహాసత్త్వుడు, వివేకవంతుడు అయిన బ్రాహ్మణపుత్రుడు నీ బదులుగా స్వేచ్ఛగా తన్ను తాను అర్పించుకోనీ. అతనిని నేలపై పెట్టి తల్లి చేతులను తండ్రి కాళ్ళనూ పట్టుకొని ఉండగా వానిని నీవు చంపాలి. అలాంటి పురుషుని నాకు ఉపహారంగా ఇవ్వాలి. నీవే నీ ఖడ్గంతో వానిని చంపి ఏడురోజులలో నాకు ఉపహారంగా సమర్పించాలి. అప్పుడు నీ ధిక్కారాన్ని క్షమిస్తాను. అలా కాకపోతే నిన్ను సపరిచ్ఛదంగా ఇప్పుడే నాశం చేస్తాను."

అప్పుడా రాజు భయంవల్ల "సరే" నని ఒప్పుకున్నాడు. ఆ బ్రహ్మరాక్షసుడు కూడా అక్కడినుంచి మాయమైపోయినాడు.

అంతట చంద్రావలోక మహారాజు ఇందీవరప్రభతో పాటూ తురగారూఢుడై మనసంతా కళవళపడగా తన సైన్యాన్ని వెదుక్కుంటూ అక్కడినుంచి బయలుదేరినాడు.

"అకటా! నేను వేటతోనూ, వెలదితోనూ మోహితుడనైనాను. పాండుమహారాజు వలె అకాలంలో వినాశం చెందుతాను. ఆ రాక్షసుడు చెప్పిన అలాంటి ఉపహార పురుషుడు నాకెలా దొరుకుతాడు. కాబట్టి పట్టణానికివెళ్ళి జరిగేదేదో తర్వాత చూస్తాను" అని తలపోసుకుంటూ అటు వస్తున్న తన సైన్యాన్ని కలుసుకొని భార్యాపురస్సరంగా తన చిత్రకూట పట్టణం చేరుకున్నాడు.

అక్కడ, అనురూపవతి అయిన భార్యాప్రాప్తితో వచ్చిన రాజును చూచి ఊరంతా పండుగ చేసుకొనగా, అంతర్గతుడై కుమిలిపోతూ ఆ రాజు ఆ రోజంతా గడిపినాడు.

రెండవరోజు జరిగిన యావద్వృత్తాంతాన్ని మంత్రులకు రాజు వివరించినాడు. అందులో ఒక మంత్రి సుమతి ఇట్లన్నాడు: "దేవా! నీకు విషాదం కలుగకూడదు. అలాంటి ఉపహారాన్ని నే నెలాగో వెదకి తీసుకొని వస్తాను. ఈ భూమి ఎంతో అద్భుతమైనది కదా?" అని రాజును ఓదార్చి వెంటనే బంగారంతో ఏడేళ్ళ బాలకుని ప్రతిమను తయారు చేయించినాడు. రత్నాలతో అలంకరించిన ఆ ప్రతిమను బండిలో ఎక్కించి నగరగ్రామ ఘోషాదులలో త్రిప్పించినాడు.

"ఒక ఏడేళ్ళ పుత్రుడెవరైనా యథేచ్ఛగా సర్వ సత్త్వార్థమై బ్రహ్మరాక్షసునకు తన్ను అర్పించుకోవాలి. తలి దండ్రుల ఆజ్ఞ తీసుకొని ధీరుడై, తలిదండ్రులు కాళ్ళూ చేతులు పట్టుకొనగా బలి కావడానికి సిద్ధం కావాలి. ఆ విధంగా చేయడాని కంగీకరించిన తలి దండ్రులకు ఉపకారం చేసినందులకు, హేమరత్నమయమైన ఈ ప్రతిమను, నూరు గ్రామాలనూ మహారాజు దానం చేస్తాడు" అని ఈ విధంగా ఈ బొమ్మను త్రిప్పుతూ రాజభటులు ఊరూరా చాటింపు వేయిస్తూ వచ్చినారు.

ఒకానొక అగ్రహారంలో ఏడేళ్ళే ఉన్న గొప్ప ధీరుడైన ఒక విప్రబాలుడు, అద్భుతాకృతి గలవాడు విన్నాడు. పూర్వాభ్యాసం వల్ల బాల్యంలోకూడా అతను పరోపకార చింత కలవాడు. ప్రజా పుణ్యపరిపాకం రూపుగొన్నదా అన్నట్టున్నాడు. అతను ఆ చాటింపు వేసేవారి దగ్గరకు వచ్చి "నేను ఇందు ఆత్మార్పణంకై చేస్తాను. తలిదండ్రుల వద్దకు వెళ్ళి ఈ వివరం చెప్పి ఒప్పిస్తాను" అని చెప్పి వారు సంతోషింపగా వారి అనుమతి పొంది ఇంటికి వెళ్ళి తన తలిదండ్రులకు అంజలి ఘటించి ఇట్లా అన్నాడు:

"సర్వ సత్త్వార్థమై ఈ బుద్బుదప్రాయమైన శరీరాన్ని అర్పిస్తాను. మీరు నాకు అనుమతి నీయవలసింది. నేను చని పోయినా ఒప్పుకొనవలసింది. నా ప్రతికృతిని తీసి మీ కిప్పిస్తాను. పైగా ఈ హేమరత్నమయ ప్రతిమతో పాటూ మహారాజు నూరు గ్రామాలను కూడా మీ కిస్తాడు. ఈ విధంగా నేను మీ ఋణమూ తీర్చుకుంటాను. పరోపకారఫలం కూడా నాకు దక్కుతుంది. మీరు దరిద్రంతో కుమిలిపోతున్నారు. మీ దరిద్రం తీరిపోతుంది. తర్వాత అనేకమంది కుమారులను కనవచ్చు" అని చెప్తున్న కుమారునితో ఆ తలిదండ్రు లిట్లన్నారు.

"కుమారా! ఏమి టిలా మాట్లాడుతున్నావు? నీకు గాలి ఏమైనా సోకినదా? లేక ఏ గ్రహమో పట్టుకున్నదా? లేకపోతే ఈ ప్రలాపా లేమిటి? డబ్బుకోసం ఏ తండ్రి పుత్రుని చంపివేస్తాడు? ఏ పుత్రుడు తన దేహాన్ని సమర్పిస్తాడు?"

ఈ తలిదండ్రులమాట విని ఆ బాలుడు తిరిగి ఇట్లన్నాడు: "నేను మతిచెడి ఇలా మాట్లాడడం లేదు. నేను చెప్పే మంచి మాటలను వినండి. "అవాచ్యము, అశుచి సంపూర్ణము, జుగుప్సా కరము, దుఃఖక్షేత్రము అయిన ఈ శరీరం త్వరలోనే ఏలాగూ నశిస్తుంది. సారరహితమైన ఈ శరీరం ద్వారా సుకృతాన్ని సంపాదించాలి. అదే ఈ సృష్టిలో సారమని బుద్ధిమంతులు చెప్తారు. సర్వభూతోపకారం కంటే మరొక సుకృత మేమున్నది? అందు లోనూ పితృభక్తి మిళితమై ఉంటే ఈ దేహానికి ఫలం సిద్ధిస్తుంది." ఇలాంటి మాటలతో ఆ బాలకుడు దృఢనిశ్చయుడై దుఃఖిస్తున్న వారి నెలాగో తన కోరికను అంగీకరించేటట్టుగా చేసినాడు.

ఆ రాజభృత్యుల వద్దకు వెళ్ళి బంగారు ప్రతిమను తీసుకొని నూరుగ్రామా లిస్తున్నట్టుగా రాజశాసనాన్ని కూడా తన తలిదండ్రు లకు అర్పించినాడు.

తర్వాత రాజపుత్రులను ముందుంచుకొని తలిదండ్రులతో పాటూ చిత్రకూటంలోని రాజసన్నిధికి వెళ్ళినాడు. అఖండిత తేజస్వి అయిన చంద్రావలోక మహారాజును చూచినాడు. రక్షా రత్నం ప్రాప్తించినట్టుగా ఆ బాలుని చూచి ఆ రాజు సంతోషించి నాడు.

ఒక ఏనుగపై వాని నెక్కించి గంధానులేపనము, పుష్పాలంకరణాదులు చేయించి, వాని తలిదండ్రులతో పాటూ వెళ్ళి నాడు. ఆ బాలకుని బ్రహ్మరాక్షసుని స్థలానికి కొనిపోయినాడు. ఆ అశ్వత్థవృక్షం ప్రక్కన మండలం గీయించి విహిత పూజలను చేయించి, పురోహితునితో హోమం చేయించినాడు. అప్పుడు వేదాధ్యయనం చేస్తూ, అట్టహాసం చేస్తూ ఆ బ్రహ్మరాక్షసుడు ఘూర్ణిల్లుతూ, రక్తాసవమత్తుడై పదేపదే బుసకొడుతూ ఆవిర్భవించి నాడు.

అతని కళ్ళు మండుతున్నవి. తన దేహచ్ఛాయతో అతను దిక్కు లన్నిటినీ అంధకారభరితం చేసినాడు. మహారౌద్రదర్శనుడై జ్వాలాముఖు డనే ఆ బ్రహ్మరాక్షసుడు కనబడగానే చంద్రావలోక మహారాజు వినమ్రుడై ఇట్లన్నాడు:

"భగవాన్! నీ కోసమై నరబలిని నేను కొనివచ్చినాను. నీవు పెట్టిన గడువు ప్రకారం ఇది ఏడవనాడు. కాబట్టి ప్రసన్నుడవై ఈ ఉపహారాన్ని యథావిధిగా గ్రహించవలసింది" అని రాజు అర్థింపగా ఆ బ్రహ్మరాక్షసుడు ఆ విప్రకుమారుని చూచి నాలుకతో పెదవులు తడుపుకొన జొచ్చినాడు.

ఆ క్షణంలోనే మహాసత్త్వుడైన బాలుడు సంతోషిస్తూ ఇలా అనుకున్నాడు: "ఈ నా స్వదేహదానంతో నేను ఆర్జించుకున్న

పుణ్యాన్ని నాకు స్వర్గంకోసం కానీ, మోక్షంకోసం కానీ ఉపయో గించను. ఇదే విధంగా ప్రతిజన్మలోనూ ఈ దేహాన్ని పరోపకారా ర్థమై వినియోగించడానికి ఆ పుణ్యం కారణం కావాలి.'' ఇలా సంకల్పించుకొనగానే దేవతల విమానాలతో ఆకసం నిండి పోయింది. పుష్పవృష్టి కురిసింది.

అంతట ఆ బాలుని బ్రహ్మరాక్షసుని వద్దకు కొనివచ్చి తల్లి చేతులు, తండ్రి కాళ్ళు పట్టుకున్నారు. అంతట ఆ రాజు కత్తిని దూసి వానిని నరికివేస్తుండగా ఆ బాలకుడు నవ్వినాడు. అందుతో అక్కడున్న వారందరూ బ్రహ్మరాక్షసునితో పాటూ తమ తమ పనులను వదలివేసి విస్మయం చెంది అంజలిపట్టి వినమ్రులై ఆ బాలకుని ముఖమే చూడసాగినారు" అని ఈ విధంగా వ్యాఖ్యా నించి విచిత్రమూ, సరసమూ అయిన కథను చెప్పి బేతాళుడు తిరిగి త్రివిక్రమసేన మహారాజు నిలా ప్రశ్నించినాడు.

"ఓ రాజా! అలాంటి సమయంలో ప్రాణాంతకమైన స్థితిలో బాలుడు ఆ విధంగా ఎందుకు నవ్వినాడు? కారణం చెప్పు. తెలుసుకోవాలని నా కెంతో కుతూహలంగా ఉన్నది. తెలిసీ చెప్పక పోతివా నీ తల వేయివ్రక్కలౌతుంది." ఈ బేతాళుని మాట విని రా జిలా జవాబిచ్చినాడు.

"ఆ బాలుని నవ్వులోని ఆంతర్యాన్ని చెప్తాను విను. దుర్బలమైన ప్రాణి భయకారణం కలుగగా తన ప్రాణంకోసం, తన తలిదండ్రులకోసం ఆక్రందనం చేస్తుంది. అలాంటి స్థితి లే నప్పుడు ఆర్తత్రాణపరాయణుడైన రాజును ప్రార్థిస్తుంది.

అదికూడా లేకపోతే దైవాన్ని ఆశ్రయిస్తుంది. కానీ ఈ ప్రాణికి వాటిలో ఏ ఒక్కటీ అనుకూలంగా లేవు: పైగా ప్రతికూల

మైనవి. ధనాశతో తలిదండ్రులు వాని కాలుచేతులు పట్టుకున్నారు. తన్ను రక్షించుకోవడం కోసం రాజే వాణ్ణి చంపడానికి ఉద్యుక్తుడైనాడు. మరి అక్కడ దైవతంగా ఉన్న బ్రహ్మరాక్షసుడు వానికి భక్షకుడే అయినాడు. అధ్రువమూ, విరసాంతమూ, ఆధివ్యాధి పీడితమూ అయిన దేహంకోసం విమూఢులైనవారు పై విధంగా ప్రవర్తిస్తారు. బ్రహ్మేంద్రవిష్ణురుద్రాదులు కూడా తప్పక వినాశం పొందేవారే! కాబట్టి ఇలాంటి శరీరస్థైర్యవాసన ఎలా ఉంటుంది? ఈ మోహ వైచిత్రిని చూచి తన వాంఛితం సిద్ధించినదని భావించి ఆశ్చర్య హర్షాలతో ఆ విప్రకుమారుడు నవ్వినాడు." ఈ విధంగా చెప్పి రాజు విరమించగా తిరిగీ ఆ బేతాళుడు వెంటనే మాయమై తన స్థలానికి వెళ్ళిపోయినాడు.

రాజుకూడా ఏమాత్రం వికల్పం చెందకుండా వానిని వెదుకుటకై అతి వేగంగా అతనికోసమై వెళ్ళినాడు. సముద్రం వలె మహాత్ముల హృదయం కలత చెందనిది కదా!

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
ఇరవై ఏడో తరంగం.

## ఇరవై ఎనిమిదో తరంగం

త్రివిక్రమసేన మహారాజు అశోకవృక్షం దగ్గరకు వెళ్ళి బేతాళుని తీసుకొని తిరిగి బయలుదేరినాడు. బేతాళుడు దారిలో, ప్రగాఢ ప్రణయకథ నొకదానిని చెప్తాను వినుమని ఇట్లన్నాడు:

### 21 వ కథ

బ్రహ్మదేవుడు స్వర్గచ్యుతులైన పుణ్యాత్ములకోసం మరొక స్వర్గాన్ని నిర్మించెనా అన్నట్టున్న విశాల అనే పట్టణం భూలోకంలో కలదు. అక్కడ పద్మనాభుడు అని ప్రఖ్యాతుడైన ఒక నృపాలుడు కలడు. అతను చక్రనందకములు కలవాడు. శ్రీమంతుడు, ఆక్రాంతబలిరాజకుడు.

ఆ రాజు పట్టణంలో ఒక మహావర్తకుడు ధనాధిపత్యంలో కుబేరుని మించినవాడు అర్థదత్తు డనువాడు కలడు. అతనికి అనంగమంజరి అను కుమార్తె కలదు. స్వర్లోకసుందరుల ప్రతికృతిని బ్రహ్మ భూలోకంలో చూపదలచెనా అన్నట్టుంటుం దామె. ఆ కన్యకను తండ్రి తామ్రలిప్తి నగరంలో నివసించే మణివర్మ అనే వణిక్కుమారునకు ఇచ్చినాడు.

అతివత్సలుడైన ఆ వర్తకుడు ఒకటే సంతానం కనుక మగనితో పాటూ కుమారి అయిన అనంగమంజరిని ఇంటినుంచి పంపించివేయలేదు. ఆ అనంగమంజరికి పతిపై ద్వేషం కలిగింది. రోగికి చేదుమందువలె మణివర్మ తోచినాడు. మరి పతి కేమో ఆమె ప్రాణాధిక ప్రియురాలైనది. లోభి అతికష్టంమీద చిరకాలానికి తాను సంపాదించుకున్న లిబ్బివలె కన్పించినది.

ఒకసారి తండ్రిని చూచుటకై మణివర్మ తామ్రలిప్తిలోని తన పట్టణానికి వెళ్ళిపోయినాడు. ఇట్లా కొన్నాళ్ళు జరుగగా తీక్ష్ణసూర్యకిరణాలతో ప్రవాసితుల మార్గాన్ని అడ్డగిస్తూ వేసవి వచ్చినది. వసంత విరహంవల్ల దిక్కుల నిట్టూర్పులు వేడి ఎక్కినట్లైనవి. మల్లికాపాటల పరిమళభరితాలై గాలులు వీచినవి. పవనోద్ధూతములై రేణుసంతతులు ఆకసమంతా కమ్ముకున్నవి. అవి వర్షాగమనం కోసం తపిస్తున్న భూదేవి గగనాని కంపిన దూతికలా అన్నట్లున్నవి.

తరుచ్ఛాయను కోరుతూ కఠోరాతపతప్తాలై పథికులవలె రోజులు కూడా చిరకాలానికి కానీ ముగియలేదు. చంద్రకాంతితో పాండురాలై, గాఢాశ్లేష సుఖప్రదమైన హేమంతం వినా రాత్రులు దుర్భరాలైనవి.

ఆ సమయంలో చందనానులేపంతో తెల్లవడి పలుచటి పట్టు బట్టలతో ఆ వర్తక కుమార్తె అనంగమంజరి ఒకనాడు ఎత్తుగానున్న తన మేడమీది కిటికీలోనుంచి, తన సఖితో నిలుచుండి, భవ్యుడైన ఒక విప్రయువకుని చూచినది. రతికోసమై తిరిగి పుట్టి తిరుగుతుండే మన్మథుడా అన్నట్లున్న అతను రాజపురోహితుని కొడుకు కమలాకరుడు.

చంద్రమూర్తివలె నున్న ఆ కాంత పైనుండడం చూచి కమలాకరుడు ఆనందంతో కుముదాకరుడైనాడు. అప్పుడు వారి మనస్సుల్లో అపూర్వమైన మనస్సమ్మేళనం జరిగింది. మన్మథ గుర్వాజ్ఞతో ఆ యువతీయువకుల అన్యోన్యసందర్శనం అందుకు కారణమైనది. సిగ్గుతొలగినవారై దూరంగా విడిపోయిన మనస్సుతో మన్మథావేగ ప్రభంజనంతో చెలరేగిన రజస్సుతో వారు అభిభూతులైనారు.

మదనావిష్టుడైన ఆ కమలాకరుని చూచి అతనితో నున్న స్నేహితుడు ఎలాగో తన ఇంటికి కొనిపోయినాడు. ఆ అనంగ మంజరి కూడా, అతనిని అన్వేషించి పేరు అదీ తెలుసుకునివచ్చిన చెలికత్తెతో పాటూ మెల్లగా తన ఇంటిలోనికి వెళ్ళిపోయినది. అక్కడ తన కాంతునే చింతిస్తూ కామజ్వరంతో బాధపడుతూ, మంచంమీద పడుకొని పొరలాడుతూ దేనినీ చూడలేదు: దేనినీ వినలేదు.

ఆమె రెండు మూడు రోజు లిలా జరుగగా సిగ్గుతోనూ, భయంతోనూ కృశించి పాలిపోయి విరహోన్మథనాన్ని సహించ లేక పోయినది. తన ప్రియ సంయోగం దుష్ప్రాప్యమని నిరాశ చెంది ఒకరాత్రి గవాక్షం నుంచి ప్రసరించిన చంద్రకరాలతో ఆకృష్టురాలైనదై పరిజను లందరూ నిద్రిస్తుండగా మరణోన్ముఖు రాలై బయటికి వచ్చినది.

తన ఇంటి ఉద్యానవనంలో తరులతావృతమైన బావి దగ్గ రకు వెళ్ళినది. అక్కడ తన తండ్రి ప్రతిష్ఠచేసిన కులదేవత చండికాదేవికి నమస్కరించి స్తుతించి ఇట్లా విన్నవించుకున్నది: "ఈ జన్మలో కమలాకరుడు నాకు భర్త కాకపోతే కనీసం మరొక జన్మలోనయినా అతను నాకు పతి అగుగాక!'' అని విన్నవించు కొని ఆ దేవికి ఎదురుగా అశోకవృక్షం కొమ్మకు తన ఉత్తరీయంతో ఉరిని తయారుచేసుకున్నది.

ఈ లోగా ఇంటిలో ఆమె ఆప్తసఖి, అనంగమంజరి కన్పిం చక పోవడంతో దైవాత్తూ వెదుక్కుంటూ ఆ ఉద్యానంలోనికే వచ్చి నది. అక్కడ తన మెడకు ఉరిని తగిలించుకుంటున్న ఆమెను చూచి 'వద్దు వద్దు' అని పరువెత్తుకుంటూ వచ్చి దానిని తెంచివేసి

నది. అలా వచ్చి తన ఉరిని తెంచివేసిన చెలికత్తెను చూచి అతి దుఃఖంతో భూమిపై పడిపోయినది.

ఆ తన చెలి తన్నూరడించి ఇందుకు కారణ మేమని అడుగగా తన దుఃఖహేతువు వివరించి తిరిగి ఇట్లన్నది: "ఓ సఖీ! మాలతికా! ప్రియసంగమం నాకు దుర్లభమైనది. తలిదండ్రుల చాటుదానను నేను. ఇక మరణంకంటే నాకు సుఖమిచ్చే దేదీ లేదు" అని చెప్తూనే అనంగశరాగ్ని జ్వలితురాలై, నిరాశతో నిస్పృహురాలై అనంగమంజరి మూర్ఛిల్లినది.

"కామాజ్ఞ దాటరానిది. అదే నన్నీ స్థితికి కొనివచ్చినది. అవినీతలైన ఇతర స్త్రీలకు హాస్యపాత్రమైనది." ఇలా విలపిస్తున్న ఆమెను సఖి మాలతిక చూచి శీతలజలపవనాదులతో ఆశ్వాసింప జేసినది. తాపోపశాంతికోసం తామరాకులతో శయ్యనొకదానిని ఏర్పరచి హిమశీతలమైన హారాన్ని ఎదపై వేసినది. అప్పుడు కన్నీరు విడుస్తూ ఆ చెలికత్తెతో అనంగమంజరి ఇట్లన్నది: "సఖీ! ఇలాంటి హారాదులతో నా అంతర్దాహం చల్లారదు. దేనితో ఇది చల్లారుతుందో దానిని నీ తెలివితేటలతో ఆలోచించు. నేను బ్రతకాలనుకుంటే నా కాంతునితో సంయోగం కుదిరించు" అని ఈ విధంగా చెప్పగా మాలతిక స్నేహంతో ఇట్లన్నది:

"ఈ రాత్రి గడచిపోనీ. ఉదయం నేను ఇక్కడ సంకేతమేర్పరచి నీ ప్రియుని కొనివస్తాను. ఆ నమ్మకంతో గుండెదిటవు చేసుకుని నీ మందిరంలోనికి వెళ్ళు." ఈ విధంగా చెప్పగా అనంగమంజరి సంతోషించి తన మెడలోని హారాన్ని తీసి ఆమెకు పారితోషికంగా ఇచ్చింది.

"ఇప్పుడే నీవు ఇంటికి వెళ్ళు. ఉదయమే నీ ప్రయత్నం చేయి" అని ఆ చెలికత్తెను పంపించివేసి ఆమె తన మందిరం లోనికి వెళ్ళినది.

ఉదయమే మాలతిక ఎవరికీ కనిపించకుండా కమలాకరుని ఇంటికి వెళ్ళినది. అతనికోసమై వెతుకుతూ ఉద్యానంలో ఒక చెట్టు క్రింద చందన మలదుకొని పద్మినీపత్రశయ్యపై పొరలుతుండగా చూచినది. మన్మథాగ్నితో కాలిపోతున్న అతనిని, అతని విశ్వాస పాత్రుడైన స్నేహితుడు అరటాకుల వీవనలతో విసరుతున్నాడు. ఇతని కామావస్థకు మా చెలి కారణమై ఉంటుంది — అనుకొని మాలతిక దానిని నిశ్చయంగా తెలుసుకొనుటకై అక్కడ ప్రచ్ఛన్నంగా దాగి ఉండినది.

అంతట అతని మిత్రుడు కమలాకరునితో ఇట్లన్నాడు: ఒక క్షణం ఈ ఉద్యానవనంపై దృష్టి నుంచు. ఈ మనోహర దృశ్యంతో వినోదించు. అనవసరంగా గుండె చెదరిపోనీకు" అని స్నేహితుడు చెప్పగా విప్రపుత్రుడు అతనితో ఇట్లన్నాడు.

"వర్తకకుమార్తె అయిన అనంగమంజరి నా మనసును హరించినది. ఇక శూన్యహృదయుడైన నేను ఎలా వినోదిస్తాను? స్మరబాణతూణీకృతుడనై ఆ హృదయచోరిని ఎలా పొందాలో ఆ మార్గం చూడు.'' ఈ మాట విని మాలతిక సందేహం తీరి తన్ను కన్పింపజేసుకొని అతనితో ఇట్లన్నది:

"ఓ సుభగుడా! అనంగమంజరి నన్ను నీ వద్దకు పంపినది. ఆమె సందేశాన్ని స్పష్టంగా నీకు విన్పిస్తాను—ఇదేమి శిష్టధర్మమా? హఠాత్తుగా హృదయంలో ప్రవేశించి, ముగ్ధురాలైన నా హృదయాన్ని దొంగిలించి అలా వెళ్ళిపోవచ్చునా?—ఆ వామాక్షి మనో

హరుడైన నీకోసం తన దేహాన్ని, ప్రాణాలను త్యజించడానికి సిద్ధంగా ఉన్నది. రేయింబవళ్ళూ వేడి నిట్టూర్పులను విడుస్తున్నది. ఎదలో రగులుతున్న కామాగ్ని పొగలా అన్నట్టున్నవవి. ఆమె కాటుక కన్నీటిని వదలుతున్నది. ఆమె వదనాంభోజసౌరభం కోసమై ఆశించివచ్చిన ఈగలవలె ఉన్నదా అశ్రుపరంపర. నీవు కావాలంటే మీ ఇద్దరకూ మేలు కలిగే ఉపాయం చెప్తాను'' — అని మాలతిక చెప్పగా ఆ కమలాకరు డిట్లన్నాడు:

"ఓ కల్యాణీ! నీ మాటలు నన్ను ఓదారుస్తున్నప్పటికీ ఏదో భయపెడుతున్నవి. నాపై మనసుపడి ప్రియురాలు విధురావస్థను చెందుతున్నదని వినలేకున్నాను. ఇప్పుడు నాకు గతి నీవు ఒక్కతివే. నీకు ఏది మంచిదని తోస్తే అలా చెయ్యి."

ఆ మాటకు మాలతిక ఇట్లన్నది: "నిన్ను రహస్యంగా అనంగమంజరి వద్దకు చేరుస్తాను. రాత్రి ఆమె భవనోద్యానం ముందు నీవు ఉండవలసింది. తర్వాత ఏదో యుక్తితో నిన్ను లోనికి కొనిపోతాను. అలా ఒకరినొకరు కోరుకునే మీ ఇద్దరకూ సమాగమం సంభవిస్తుంది" అని చెప్పగా విప్రపుత్రుడు ఆనందించినాడు.

తర్వాత మాలతిక వెళ్ళి చెప్పగా కృతార్థురాలైన అనంగమంజరి కూడా ఆనందించినది. తర్వాత పగటితో పాటూ సంధ్యానురక్తుడై సూర్యు డెక్కడికో పోగా తూర్పుదిక్కు చంద్రతిలకంతో ముఖాన్ని అలంకరించుకున్నది. పద్మాకరాన్ని వదలి లక్ష్మి తన వద్దకు వచ్చెనని సంతోషంతో కుముదాకరం ప్రఫుల్లవదన అయినది. అప్పుడు అలంకరించుకొని ఉత్కంఠతో కామి అయిన కమలాకరుడు తన ప్రియురాలి గృహోద్యాన ద్వారం వద్ద బయట నిలుచున్నాడు.

అంతట మాలతిక ఏదో యుక్తితో అనంగమంజరిని, పగలెల్లా కష్టంమీద గడిపి అలసిపోయిన ఆమెను ఆ ఉద్యానంలోనికి కొనివచ్చినది. మామిడి కొమ్మలతో ఏర్పడిన ఒక పొదరింట ఆమెను కూర్చుండబెట్టి బయటకువెళ్ళి కమలాకరుని కూడా కొనివచ్చి ఆకుజొంపములతో నిండిన ఆ చెట్టుక్రింది పొదరింట ప్రవేశపెట్టినది.

బాటసారి నీడను వలె అనంగమంజరి నతను చూచినాడు. అతను దగ్గరకు రాగానే ఆమె కామవేగంతో సిగ్గును వదలి పెట్టి పర్వెత్తివచ్చి కంఠాన్ని కౌగిలించుకున్నది. "ఇంకెక్కడికి వెడతావు? నాకు దొరికిపోయినావు'' అని ఆలపిస్తూ హర్షాతిరేకంతో ఊపిరి ఆగిపోయి మరణించినది. గాలికి పడిపోయిన లతవలె నేలపై పడిపోయినది. కాముని విపాకవిషమక్రమం విచిత్రమైనది కదా!

అది చూచి పిడుగుపాటుతో వలె కమలాకరుడు ఇదేమిటని నేలపై మూర్ఛిల్లి పడిపోయినాడు. కొంతసేపటికి స్పృహవచ్చి ఆమెను ఒడిలో పరుండబెట్టుకొని ఆలింగనం చేసుకుంటూ ముద్దిడుకుంటూ విపరీతంగా విలపించినాడు. ఆ దుఃఖాది భారంతో పీడితుడైన అతని గుండె క్షణంలో పగిలిపోయినది. అంతట వారిద్దరినీ చూచి మాలతిక శోకిస్తుండగా రాత్రి గడచిపోయినది.

ఉదయమే ఉద్యానపాలురు చెప్పగా వారిరువురి బంధుజనులు సిగ్గుతో, ఆశ్చర్యంతో, దుఃఖంతో అక్కడికి వచ్చినారు. ఖేదంతో తలలు వంచుకొని కర్తవ్యతామూఢులైనారు. దుష్టస్త్రీలు కులాన్ని కలుషితం చేసేవారు కదా!

అంతట తామ్రలిప్తినుంచి ఆమె మగడు వచ్చినాడు. అనంగమంజరి మీది ఉత్కంఠతో మణివర్మ తన తండ్రి ఇంటి

నుంచి అత్తవారింటికి వచ్చి జరిగిన వృత్తాంతాన్ని తెలుసుకొని కన్నీటితో కనులు కనబడక పోగా ఏదో ఆలోచించుకుంటూ ఆ ఉద్యానానికే వచ్చినాడు. తన భార్య ప్రాణాలువదలి ఇతరునితో ఉన్నప్పటికీ శోకాగ్ని జ్వలితుడై అనురక్తుడైన అతను వెంటనే ప్రాణాలను వదలివేసినాడు.

అప్పుడు అక్కడున్న జనమంతా ఆక్రోశిస్తూ కోలాహలం చేయగా ఈ సంగతి తెలిసి సర్వ పురప్రజలూ విస్మితులై అక్కడికి వచ్చినారు.

అక్కడ అనంగమంజరి తండ్రి పూర్వం ప్రతిష్ఠించిన చండీ దేవికి ఆమె గణములు ఇలా విజ్ఞప్తి చేసినారు. "నీ ప్రతిమను ప్రతిష్ఠించిన అర్థదత్తుడు ఎల్లప్పుడూ నీకు భక్తుడు. ఆ వర్తకునిపై ఈ దుఃఖ సమయంలో దేవీ! నీవు దయ చూపు" ఈ గణముల ప్రార్థన విని శరణ్యురాలైన శంకరప్రియ "ఆ చనిపోయిన ముప్వురూ బ్రదుకుదురు గాక!" అని ఆదేశించినది.

అంతట ఆ ముప్వురూ నిద్రపోయి లేచిన వారివలె మేల్కొని కూర్చున్నారు. దేవి అనుగ్రహం వల్ల వీతమన్మథులై వారు జీవించినారు. ఈ సంఘటనను ఆనందంతో చూస్తున్న సకలజనులు ఆశ్చర్యపడుతుండగా అప్పుడు కమలాకరుడు సిగ్గుతో తలవంచు కొని తన ఇంటికి వెళ్ళిపోయినాడు. అర్థదత్తుడు కూడా సిగ్గుపడు తున్న కూతురు అనంగమంజరిని ఆమె భర్తతో పాటూ తీసుకొని తన ఇంటికి వెళ్ళిపోయినాడు.

ఈ విధంగా ఆ రాత్రి దారిలో బేతాళుడు ఈ కథను చెప్పి త్రివిక్రమసేన భూపాలునితో తిరిగి ఇట్లన్నాడు:

"ఓ రాజా! అనురాగ మూఢులైన వీరిలో ఎవరి మోహం అధికమైనది? ఇది తెలిసీ చెప్పకపోతే నీతల వేయి వ్రక్కలౌతుంది." ఈమాటలు విన్న ఆ రాజు ఇలా జవాబిచ్చినాడు.

"వీరిలో ఆ మణివర్మ మాత్రమే అధికరాగ మూఢుడుగా నాకు కనబడుతున్నాడు. మిగతా ఇద్దరూ కాలక్రమంగా మన్మథావస్థ పరిపక్వమైన వారు. అన్యోన్య అనురక్తులై ప్రాణాలువదలారంటే విశేష మేం లేదు. మరి అతి మోహమూఢుడు గనుకనే మణివర్మ తనభార్య అన్యపురుషాసక్త అని తెలిసినప్పటికీ చూడగానే కోపించవలసినది పోయి, పైగా ఇంకింత అనురక్తుడై దుఃఖంతో ప్రాణాలను వదలి వేసినాడు."

ఈ రాజు మాటలు వినగానే బేతాళుడు తిరిగి అతని భుజం నుండి క్రిందికి దిగి తన చోటుకు వెళ్ళిపోయినాడు.

అతనిని వెతుక్కుంటూ రాజుకూడా వెంటనే వెళ్ళిపోయినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
ఇరవై ఎనిమిదో తరంగం.

# ఇరవై తొమ్మిదో తరంగం

అంతట రాజు త్రివిక్రమసేనుడు అశోకవృక్షంవద్దకు వెళ్ళి తిరిగి బేతాళుని భుజంమీద వేసుకొని బయలుదేరినాడు.

వస్తుండగా ఆ రాజుతో బేతాళుడు దారిలో ఇట్లన్నాడు: "ఓ రాజా! నీవు సాధువు. ధీరుడవు. ఈ అపూర్వ కథను విను.

## 22 వ కథ

పూర్వం కుసుమపురమనే నగరానికి అధీశ్వరుడు ధరణీ వరాహుడనే పేరుగలవాడు కలడు. అతని రాష్ట్రమంతా బ్రాహ్మణ భూయిష్ఠమైనది. దానిపేరు బ్రహ్మస్థలం. అందులో ఒక అగ్రహారంలో విష్ణుస్వామి అనే విప్రుడొకడున్నాడు. అగ్నికి స్వాహా దేవివలె ఆయనకు అనురూపవతి అయిన భార్య కలదు. ఆ దంపతులకు క్రమంగా నలుగురు కుమారులు కలిగినారు. వారు వేదాలను అధ్యయనం చేసి బాల్యం దాటుసరికి విష్ణుస్వామి దివంగతుడైనాడు. భార్యకూడా ఆయననే అనుసరించినది.

ఆ తర్వాత ఆ కుమారులు దాయాదులు సర్వస్వం అపహరింపగా దుస్థితిపాలై ఒకచోట చేరి పరస్పరం సంప్రతించుకున్నారు. "ఇక్కడ మన కిక గతిలేదు. కాబట్టి మన మాతామహుని ఇంటికి యజ్ఞస్థల గ్రామానికి మన మెందుకు వెళ్ళకూడదు?" ఆ విధంగా ఆలోచించి నిశ్చయించుకుని భిక్షతో భోజనం చేస్తూ చాలారోజులు నడిచి తాతగారింటికి చేరుకున్నారు. మాతామహుడేమో అప్పటికే చనిపోయినాడు. మేనమామలు వారికి ఆశ్రయమిచ్చినారు. స్వాధ్యాయతత్పరులై వారింట భోజనం చేస్తూ ఉండిపోయినారు.

కాలక్రమేణా మేనమామలు భోజనాచ్ఛాదన విషయంలో కించపరచసాగినారు. ఆ విధంగా తమవారే తమ్ము అవమానింపగా దుఃఖితులై రహస్యంగా కూడబలుక్కుంటూ ఉండగా అందులో పెద్దవాడిట్లన్నాడు: "సోదరులారా! విధి చేష్టితం ఇలా ఉన్నప్పుడు మనమేం చేయగలం? ఎక్కడా ఏ కొంచెం ఎప్పుడూ ఏ పురుషుడూ తానుగా ఏమీ చేయలేడు. నేనేమో ఉద్వేగంతో తిరుగుతూ శ్మశానానికి వెళ్ళినాను. విపన్నుడై విభిన్నాంగుడై నేల మీద పడిఉన్న పురుషునొకనిని చూచినాను. అతని గతిని చూచి నేనిట్లా అనుకున్నాను:

"ఏ దుఃఖభారమూ లేకుండా విశ్రాంతి తీసుకుంటున్న ఇతనెవ్వడో?" ఆ ఆలోచన రాగానే మరణించ వలెనని నిశ్చయించుకొని చెట్టునకు త్రాటితో ఉరివేసుకున్నాను. అందుతో నాకు స్పృహ తప్పినది కానీ ప్రాణాలు పోలేదు. ఈ లోగా ఆ ఉరిత్రాడు తెగి నేలమీద పడిపోయినది.

తిరిగి స్పృహవచ్చేసరికి దయాళుడైన ఒక పురుషుడు నాకు సపర్య చేస్తూ ఆకులతో విసరుతుండడం చూచినాను.

"మిత్రమా! నీవు విద్వాంసుడవై ఉండీ ఎందు కిలా ఖేదం చెందుతున్నావు? సుకృతంకొద్దీ సుఖమూ, దుష్కృతంకొద్దీ దుఃఖమూ ఏర్పడుతుంటాయి. దీనికి తిరుగులేదు. ఒకవేళ నీవు దుఃఖంవల్ల ఉద్వేగం చెందుతూ ఉంటే పుణ్యకార్యాలు చెయ్యి. ఆత్మత్యాగం చేసుకొని నరకదుఃఖాన్నెందుకు సముపార్జించు కుంటావు?" అని నాతో అతను చెప్పి ఓదార్చి వెళ్ళిపోయినాడు.

ఆ ఆత్మహత్యోద్యమాన్ని వదలివేసి నేనిక్కడికి తిరిగి వచ్చినాను. విధి అనుకూలించనందువల్ల చచ్చే అవకాశం కూడా

కలుగలేదు. ఇప్పుడు నేను తీర్థయాత్రలకు వెళ్ళి తపస్సుతో నా తనువును తపింపజేసుకుంటాను. తిరిగి నేను దరిద్రతా దుఃఖాన్ని తెచ్చుకోను" అని పెద్దవా డిలా అనగా అంతలో చిన్నవా డిట్లా అన్నాడు:

"ధనం లేదని ప్రాజ్ఞుడవై కూడా దుఃఖిస్తా వెందుకు? ధన మన్నది శరత్కాల మేఘంవలె చంచలమైనదని తెలియదా? కష్ట పడి సంపాదించి ధనాన్ని రక్షించుకున్నా అది తుదకు విరక్తికే కారణమౌతుంది. దుర్జన మైత్రి, వేశ్య, లక్ష్మి ఇవన్నీ ఎప్పుడు మాత్రం ఎవరివద్ద మాత్రం స్థిరంగా ఉన్నవి? కాబట్టి ఏదో ప్రయత్నించి మనస్వి అయిన వాడు ఏదో ఒక గుణాన్ని సాధించు కోవాలి. అర్థమృగాలను అది హఠాత్తుగా బంధించుకొని రాగలదు."

ఈ విధంగా సోదరులు ధైర్యం చెప్పగా ఆ బలంపై పెద్ద వాడు "అలా సంపాదించుకొనవలసిన ధనం ఏది?" అని ప్రశ్నించి నాడు. దానిపై వాళ్ళందరూ ఆలోచించుకొని పరస్పరము ఒక అంగీకారానికి వచ్చినారు.

మనం దేశాటనం చేసి ఏదో ఒక విజ్ఞానాన్ని సముపార్జించు కుందాము. ఈ విధంగా ఒక నిశ్చయానికి వచ్చి తిరిగివచ్చిన తర్వాత కలుసుకునేందుకు ఒక సంకేత స్థలాన్ని నిర్ణయించుకొని ఆ నలుగురూ నాలుగు దిక్కులకు వెళ్ళిపోయినారు.

ఇట్లా కాలం గడువగా వారందరూ తిరిగి ఆ సంకేతస్థలంలో కలుసుకున్నారు. ఒకరినొకరు నీ వేం నేర్చుకున్నా వంటే నీ వేం నేర్చుకున్నా వని ప్రశ్నించుకున్నారు.

అంతట వారిలో ఒకడు ఇలా అన్నాడు: "నేను నేర్చు కున్న విద్య ఇది: ఏదో ఒక ప్రాణి ఎముక ముక్క దొరికితే చాలు దానికి అనుగుణమైన మాంసభాగాన్ని ఉత్పత్తి చేయగలను."

అంతట రెండవవా డిట్లా అన్నాడు: "నే నలా మాంసంతో కలిసిన అస్థిశకలంపై ఆ ప్రాణికి తగిన రోమశ చర్మాన్ని సృష్టించ గలను"

ఆ మాట విని మూడవవాడు అన్నాడుకదా: "ఆ విధంగా రోమ చర్మమాంసాలు కల ఆ ప్రాణీ రూపానికి కావలసిన అవ యవాలన్నీ సృష్టించగలను."

అంతట నాల్గవవాడు ఇలా అన్నాడు: "అలా రూపు గొన్న ప్రాణికి నేను ప్రాణం పోయగలను."

ఈ విధంగా తాము తాము నేర్చుకున్న విద్యావిశేషాలను చెప్పుకొని ఆ అన్నదమ్ములు నలుగురూ ఎముక ముక్కకోసం అడ వికి వెళ్ళినారు. అక్కడ ఒక సింహం అస్థిఖండం విధివశం వల్ల కనిపించినది. దాని విశేషమేమిటో తెలియకుండా అలాగే దానిని గ్రహించినారు. అందులో ఒకడు దానికి కావలసిన మాంస భాగాన్ని చేసి ఇచ్చినాడు. రెండవవాడు దానికి తగిన చర్మ కేశసంతతిని సమకూర్చినాడు. మూడవవాడు ఆ ఆకారానికి తగిన అవయవా లన్నింటినీ కల్పించినాడు. నాల్గవవాడు ఆ సింహప్రతి మకు ప్రాణప్రతిష్ఠ చేసినాడు.

వెంటనే ఆ సింహం అతిభారమైన జూలును విదిలించు కుంటూ, అతిభయంకరమై దంష్ట్రాకరాళమైన, కఠోరమైన గోళ్ళతో నిలిచి తన్ను నిర్మించిన నలువురనూ చూచి వారిపైనికి పరుగెత్తి అందరినీ వధించి సంతృప్తిగా అడవిలోనికి వెళ్ళిపోయినది.

ఈ విధంగా ఆ సింహ నిర్మాణ దోషంవల్ల ఆ బ్రాహ్మలు నాశనమై పోయినారు. దుష్టజంతువును లేపి ఎవడు మాత్రం సుఖింపగలడు?

ఈ విధంగా ప్రయత్నార్జితమైన గుణంకూడా విధి వక్రించి నపుడు సంపత్తికి కాక, విపత్తికే కారణ మౌతుంది. మూలంలో దైవం వక్రించనపుడు ప్రజ్ఞాజలంతో అనుసిక్తమై నీతిపాదుగాగల పురుషప్రయత్నపాదపం తరుచూ ఫలిస్తూ ఉంటుంది.

ఇలా ఆ రాజుతో బేతాళుడు భుజంమీద నుండి త్రివిక్రమ సేన మహారాజుకు చెప్పి తిరిగీ ఇట్లన్నాడు :

"ఓ రాజా! ఆ సింహ నిర్మాణంలో భాగహారులైన ఆ నలుగురిలో ఎవరు అపరాధి? నీవు తెలిసీ చెప్పక పోతే నీ తల వేయి వ్రక్కలౌతుంది." ఈ బేతాళుని మాటలు విని రాజిలా అనుకున్నాడు :

"నాకు మౌనభంగం చేసి ఇతను తప్పించుకొనదలచినాడు. పోనీ తిరిగీ కొనివస్తాను" అని మనసులో నిశ్చయించు కొని ఆ మహీపాలుడు బేతాళునితో ఇలా అన్నాడు :

"వారిలో సింహానికి ప్రాణమిచ్చినవాడే పాపపాత్రుడు. ఆ ప్రాణి ఏదో తెలియక మిగతావారు దానికి మాంస చర్మరోమాంగాదులను నిర్మించి తమ శక్తిని వినియోగించినారు. ఇందులో వారి యుక్తిబలమే తెలుస్తుంది కానీ వారి దోష మేమీ లేదు. అజ్ఞానమూ లేదు.

సింహాకారాన్ని చూచికూడా తన విద్యను ప్రదర్శింపవలెనన్న ఉబలాటంతో దానికి ప్రాణం పోసిన వానివల్లనే అది బ్రహ్మహత్య చేయగలిగినది. ఆ బ్రహ్మహత్యాదోషం వానిదే."

ఈ రాజు చెప్పిన మాటను విని బేతాళుడు అతని భుజం మీదినుంచి జారి వెళ్ళిపోయినాడు. అతను మాయావి కదా!

రాజుకూడా అతనికోసం తిరిగీ వెన్నంటి వెళ్ళినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
ఇరవై తొమ్మిదో తరంగం.

# మంప్రయెన్నా తరంగం

త్రివిక్రమసేన మహారాజు తిరిగీ అశోకవృక్షం చెంతకు వెళ్ళి బేతాళుని పట్టుకొని భుజంమీద వేసుకున్నాడు. ఆ బేతాళుడు అనేక వికారాలను చూపించినాడు. మౌనంగా వస్తున్న రాజుతో బేతాళు డిట్లా అన్నాడు:

"ఇది చేయగూడని పని అయినా నీ పట్టుదలను తొలగించడం సాధ్యం కాదు గనుక నీకు అలసట తెలియకుండా ఒక కథ చెప్తాను విను:

## 23వ కథ

కళింగదేశంలో, స్వర్గంలో అమరావతిలోవలె, శుభకర్మలకు స్థానమైన శోభావతి అను పట్టణం కలదు. అక్కడ ఐశ్వర్య వీర్యాతిశయ విశ్రుతుడైన ప్రద్యుమ్నునివలె ప్రద్యుమ్ను డను పేరుగల ఒకరాజు పరిపాలిస్తూ ఉన్నాడు. గుణాపకర్షం ధనస్సుల లోనే, కరాహతి మురజములలోనే, ప్రజ్ఞలలోనే తీక్ష్ణతా ఆ పట్టణంలోనే కలి కనుగొన్నాడు.

ఆ పట్టణంలో ఒక భాగంలో యజ్ఞస్థలమనే పేరుగల అనేక విప్రులుగల అగ్రహారాన్ని ఆ రాజు నిర్మించినాడు. అక్కడ యజ్ఞసేనుడనే బ్రాహ్మడు ఉన్నాడు. అతను వేదపారంగతుడు. మహాధనవంతుడు. అగ్నిహోత్రి. అతిథిదేవతలను పూజించేవాడు.

అతనికి అనేక కాంక్షలతో తారుణ్యం కరిగిపోగా అనురూపవతి అయిన భార్యకు ఒకే ఒక కుమారుడు కలిగినాడు. సులక్షణుడైన ఆ బాలుడు విధిపూర్వకంగా దేవసేనుడని బ్రాహ్మలు నామకరణం చేయగా, తండ్రి ఇంట పెరుగుతూ వచ్చినాడు.

విద్యావినయ సంపన్నుడైన ఆ బాలకునకు పదహారేళ్ళు నిండినవి. జనులను ఆకర్షించిన అతను అకస్మాత్తుగా జ్వరం వచ్చి చనిపోయినాడు. అలా ప్రాణాలు వదలిన కుమారునిపై ప్రేమతో, వాని తండ్రి, అతని భార్యా, వానిని కౌగిలించుకొని చిరకాలం దుఃఖిస్తూ దహన సంస్కారాలను చేయనే లేదు.

"సంసార గంధర్వ నగరం సంగతి నీకు తెలియదా? ముందువెనుకలు తెలిసికూడా నీకీ బుద్ధేమిటి? అశాశ్వతమైన జీవితం సంగతి తెలియదా? మనోహర హర్మ్యాలతో భూమినంతా ఆవహించిన సైన్యంతో, సంగీత రాగాలతో ప్రతిధ్వనించే మంది రాలలో రత్న పర్యంకాల మీద ఉన్నవారు, చందనాది ద్రవ్యా లతో అనులిప్తులైనవారు, పరస్త్రీ పరివృతులూ అయిన నరాధిపు లెందరో, ఈ భూలోకంలో తామేదో అమరుల మనుకున్నట్టు జీవి స్తుంటారు. అలాంటివారుకూడా, అనుయాయులు ఏడుస్తూ పీనుగ వెంటరాగా, శ్మశానాలలో చితులపై ఎక్కి అగ్ని జ్వాలలకు ఆహుతి అవుతుంటారు.

ఆ చుట్టుపట్లనున్న నక్కలకు, కాలక్రమేణా కబళంగా పరిణ మిస్తుంటారు. దీనిని వారెవరూ ఆపలేక పోయినారు. ఇక మిగత వారి సంగతేమిటి? ఓ విద్వాంసుడా! ఈ ప్రేతాన్ని ఆలింగనం చేసుకొని నీవు చేయబోయే దేమిటి?"

ఇలాంటి మాటలతో అక్కడ చేరిన వృద్ధులు ఆ విప్రుని ఉద్బోధించినారు

కడకు ఎలాగో ఆ శవాన్ని ఆయననుంచి లాగుకొని ప్రేతా లంకారాదులను చేసి శిబికలో పెట్టి బంధువులు ఇతరులు కన్నీళ్ళు కార్చుకుంటూ కోలాహలంతో శ్మశానానికి కొనిపోయినారు.

ఈ లోగా ఒకటి జరిగింది. ఆ శ్మశానంలో ఒక తాపసి, వృద్ధుడు, పాశుపతుడు, యోగి అయినవాడు ఒక మఠంలో ఉన్నాడు. వయస్సుతోనూ, అతి తీవ్రమైన తపస్సుతోనూ అతని శరీరం బాగా కృశించి పోయినది. అది విరిగి పోవునేమో అని తన నరాలూ, అంగాలూ గట్టిగా తన్ను పట్టుకున్నట్టున్నవి. అతని పేరు వామశివుడు. భస్మంతోనూ, తెల్లని వెంట్రుకలతోనూ నిండిన ఆకారం కలవాడు. మెరపులవలె తెల్లనైన జటాజూటం కలవాడు అయిన అతను మరొక మహేశ్వరుడా అన్నట్టుంటాడు.

ఆ తాపసి ఆ సమయంలో బయటి జనకోలాహలాన్ని విని ఖిన్నుడై, మూర్ఖుడూ శఠుడూ ధ్యాన యోగాదులలో అహంకారం పెంచుకున్నవాడూ భిక్షాఫలవంతుడూ అయిన తన దగ్గరనున్న శిష్యు నొకని పిలిచి ఇలా అన్నాడు:

"లేచి వెళ్ళు. ఆ బయట ఇంతకు మున్నెన్నడూ శ్మశానంలో వినబడని ఆ తుముల శబ్ద మేమిటో తెలుసుకొని రా.''

ఈ మాటకు ఆ గురువుతో శిష్యు డిట్లా జవాబిచ్చినాడు: "నేను వెళ్ళను. మీరే స్వయంగా వెళ్ళండి. నాకు భిక్షావేళ దాటుతున్నది."

ఆమాట విని ఆ గురువు తిరిగీ ఇట్లన్నాడు: "ఛీ మూర్ఖుడా! ఉదరపరాయణుడా! పగ లింకా అరజాము దాటినదో లేదో ఇంతలోనే నీకు భిక్షావేళ అయిపోయినది!"

ఈ మాట విని క్రుద్ధుడై ఆ దుష్టశిష్యుడు ఆ తపస్వితో ఇట్లన్నాడు:

"ఛీ ముసలితొక్కా! నేను నీకు శిష్యుడను కాదు. నీవు నాకు గురువు కాదు. నే నింకోచోటికి పోతాను. నీవే ఈ భిక్షాపాత్రను

పట్టుకో" అని చెప్పి లేచి ఆయనముందు దండకుండికను వదలి వేసి నవ్వుతూ వెళ్ళి పోయినాడు.

అంతట నవ్వుతూ ఆ తాపసి మఠంనుంచి బయటికివచ్చి, విప్రకుమారుని అగ్నిసాత్కారం చేయుటకై కొని వచ్చిన చోటికి వెళ్ళినాడు. జనమంతా ఏడుస్తుండగా మంచి యౌవనంలో ఉన్న ఆ బాలుని చూచి వృద్ధాప్యంతో సడలిపోయిన తన దేహాన్నివదలి ఆ శరీరంలో ప్రవేశించవలెనని ఆ యోగి తలంచినాడు.

ఏకాంతస్థలానికి వెళ్ళి గట్టిగా ఏడుస్తూ నృత్యంచేస్తూ యథో చితమైన అంగరాగాదులను అతను కూర్చుకున్నాడు. యోగంతో ఆ ద్విజపుత్ర కళేబరంలోనికి ప్రవేశించినాడు. చితిపైనున్న ఆ బాలుడు వెంటనే ఆవులిస్తూ లేచి కూర్చున్నాడు.

అది చూచి బంధువర్గమంతా 'దైవానుగ్రహం వల్ల బ్రతి కాడు' అని అన్నారు. అక్కడున్న ఆ జన సందోహంలో అదే మాట ప్రతిధ్వనించినది. అంతట తన వ్రతాన్ని చాలించిన యోగీ శ్వరుడు, వారందరితో విప్రపుత్ర శరీరంలో ఉన్న తపస్వి ఇట్ల న్నాడు:

"లోకాంతర గతుడనై తిరిగీ వచ్చిన నేను మహా పాశుపత వ్రతాన్ని పాలించాలి. ఆ శర్వుడే స్వయంగా ఈ జీవితాన్ని నా కిచ్చినాడు. ఇప్పుడే నేను వెళ్ళి ఏకాంతంలో ఆ వ్రతధారిని కావాలి. అన్యథా నాకు జీవితం లేదు. కాబట్టి మీరు తిరిగి వెళ్ళండి. నా అంతట నేను వెడతాను" అని అక్కడున్న వారందరినీ సంబో ధించి దృఢనిశ్చయంతో ఆ వ్రతి హర్షశోకాకులులైన వారి నంద రనూ తమ ఇళ్ళకు పంపివేసినాడు.

స్వయంగా తాను వెళ్ళి తన పూర్వశరీరాన్ని ఒక గుంటలో పడవేసి మహాయోగి యువకుడై మరొకచోటికి వెళ్ళిపోయినాడు."

బేతాళుడీ కథను ఆ రాత్రి దారిలో ఆ రాజునకు చెప్పి తిరిగి ఇట్లన్నాడు: "ఓ రాజా! హరపురంలో నివసిస్తున్న ఆ తాపసి ఎందుకు ఏడ్చినాడు? ఎందుకు నృత్యం చేసినాడు? తెలుసుకోవాలని నాకు కుతూహలంగా ఉన్నది'' అని బేతాళు డడుగగా శాపశంకతో ఆ భూపతి మౌనం వదలి ఈ విధంగా అన్నాడు:

"ఆ యోగి అభిప్రాయ మేమిటో చెప్తాను. చిరకాలం ఈ శరీరం సిద్ధిసాధనలో ముసలిదై పోయినది. తలిదండ్రు లెంతో ప్రేమతో బాల్యంలో దీనిని పెంచినారు. అలాటి దానిని వదలి పెడుతున్నానే అని దుఃఖించినాడు. దేహస్నేహం త్యజింపరానిది గనుక ఆ వృద్ధతాపసి శోకించవలసి వచ్చినది.

'మరి కొత్తశరీరంలో ప్రవేశిస్తాను. ఇంతకంటే గొప్ప సిద్ధులను సాధిస్తాను' అనుకొని ఆ సంతోషంతో నృత్యం చేసినాడు. యౌవనం అంటే ఎవరికి మాత్రం ఇష్టముండదు?''

ఈ విధంగా ఆ రాజు చెప్పగా విని భుజంమీది నుంచి క్రిందికి జారి బేతాళుడు మృతపురుషాంతర్గతుడై అశోకవృక్షం చెంతకు వెళ్ళినాడు.

తిరిగి అతనిని పట్టుకొనుటకై ఆ రాజుకూడా అధికోత్సాహంతో వెంట పరుగెత్తినాడు. కులపర్వతాలకంటే అచంచలమైన ధీరాత్ముల స్థైర్యం కల్పాంతంలో కూడా కదలిపోదుకదా!

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
ముప్పైఏయ్యో తరంగం.

# పంపెన్ఫై ఒకటో తరంగం

అంతట అంధకార వినీలము, చితాగ్ని జ్వలితేక్షణము అయిన రజనీ రాక్షసిని ఎంతఘోరమైనా లెక్కించక భీషణమైన ఆ శ్మశానంలో రాజు అశోకవృక్షం వద్దకు వెళ్ళి ఆ బేతాళుని పట్టుకున్నాడు. భుజంమీద వేసుకొని పూర్వంలాగే వస్తుండగా తిరిగీ బేతాళుడు ఆ రాజుతో ఇట్లన్నాడు:

"ఓ రాజా! నేను ఉద్విగ్నుడనై ఉన్నాను. కానీ ఈ రాకపోకలతో నీవు మాత్రం యథాప్రకారమే ఉన్నావు. నే నిప్పుడొక మహాప్రశ్నను వేస్తాను విను:

## 24 వ కథ

దక్షిణాపథంలో ఒక సామంత రా జున్నాడు. అతని పేరు ధర్ముడు. అనేక సాధువులను రక్షించువాడు. ఆయన భార్య చంద్రవతి. ఆమె మాళవదేశానికి చెందినది. గొప్ప కులంలో పుట్టినది. వరస్త్రీ మౌళిమాలిక వంటిది.

ఆ రాజదంపతులకు లావణ్యవతి అను సార్థక నామధేయం కల ఒకే ఒక కుమార్తె జన్మించినది. ఆమెకు వివాహవయస్సు రాగా ఇంతలో ఆ రాష్ట్రాన్ని విచ్ఛిన్నం చేయదలచిన దాయాదులందరూ కలిసి ఆ ధర్మభూపతిని రాజ్యభ్రష్టుని కావించినారు.

అంతట ఆ దేశాన్ని వదలి భార్యతోనూ, కుమార్తెతోనూ కలసి అతను పలాయితుడైనాడు. తగినన్ని రత్నాదులను తనతో తీసుకొని రాత్రికిరాత్రి మాళవదేశానికి బయలుదేరినాడు. అక్కడ అత్తగారి ఇల్లున్నదికదా! ఆ రాత్రంతా ప్రయాణం చేసి భార్యాపుత్రికలతో కూడా అతను వింధ్యాటవిని చేరుకున్నాడు.

అందులో ప్రవేశించగా మంచుబిందువులవంటి కన్నీళ్ళు కారుస్తూ రాత్రి తన్ను సాగనంపెనా అన్నట్టున్నది.

అంతలో తన కిరణాలను వెదజల్లుతూ సూర్యుడు పూర్వాద్రిని అధిరోహించినాడు. తన కరరాజితో 'ఇది దొంగలతో నిండిన అడవి, నీవు వెళ్ళవద్దు' అని వారిస్తున్నట్టున్నాడు. అంత కుశ కంటకాలతో కాళ్ళు గాయపడగా, పదాతి అయి భార్యాపుత్రికలతో పాటూ వెడుతున్న ఆ రాజు ఒక భిల్లుల పల్లెను చేరుకున్నాడు.

ఇతరుల ప్రాణ సర్వస్వాన్నీ హరించే పురుషులతో నిండినదా పల్లె. ధార్మికులకు దూరమైనది. యమపట్టణం వలె దుర్గమమైనది. అక్కడ వస్త్రాభరణాదులతో కూడిన రాజును దూరం నుంచే చూచి దోచుకుందామని వివిధాయుధాలతో అనేక శబరులు ఆయనవైపు పర్వెత్తివచ్చినారు.

అప్పుడతను భార్యాపుత్రికలను చూచి ఇట్లన్నాడు: "ఆ మ్లేచ్ఛులు మొదట మిమ్ములను పట్టుకుంటారు. కాబట్టి అడవిలోనికి పారిపొండి." అంతట ఆ రాజాజ్ఞతో రాణి చంద్రవతి కుమార్తె లావణ్యవతితో పాటూ భయంతో విపిన మధ్యం లోనికి దూరిపోయినది.

రాజు కూడా కత్తీ, డాలు ధరించి ఎదురుగా వస్తున్న వారినెదుర్కొన్నాడు. ఆ బాణాలను కురిపిస్తున్న శబరులలో అనేక శూరులను వధించినాడు.

అంతట ఆ పల్లెపల్లే, నాయకుడు ఆదేశింపగా వచ్చిపడి ఆ డాలును విరుగగొట్టి, ఒంటరిగా నున్న ఆ రాజును చంపివేసినారు. అతనిమీద నున్న ఆభరణాల నన్నిటినీ తీసుకొని ఆ

దొంగలగుంపు వెళ్ళిపోగా, దూరంలో పొదరింట దాగి చూస్తున్న రాణి, భర్త నిహతుడు కావడం చూచి, కూతురితో పాటూ విహ్వల అయినది.

మరింతగా పర్యేత్తుతూ ఆ అడవిలో చాలా దూరం వెళ్ళి పోయినది. అక్కడ మధ్యాహ్నం కాగా చెట్ల మొదళ్ళు తాపంతో ఆర్తమైనవి వలె నుండగా, చల్లని నీడలు పాంథులతో పాటూ అక్కడ ప్రవేశించినవి.

ఒకచోట తామర కొలను గట్టున అశోక వృక్షం క్రింద శోకార్తురాలై విలపిస్తూ అలసిపోయి తన కూతురుతో పాటూ ఆ రాణి ఆ నీడలో కూర్చున్నది.

అంతట ఆ అడవికి దగ్గరలోనున్న మహా మనుష్యు డొకడు వేటకోసమై పుత్రునితో పాటూ గుర్ర మెక్కి అటు వచ్చినాడు. ఆ చండసింహనాముడు తన కొడుకు. సింహపరాక్రమునితో ఆ నేలపై అడుగుజాడలను చూచి ఇట్లన్నాడు: "సద్రేఖాసముంచితాలైన, మంగళకరాలైన ఈ అడుగుజాడలను అనుసరించి వెళ్ళినామంటే మనకు ఇద్దరు స్త్రీలు కనబడుతారు. అందులో నీకు నచ్చిన ఒక యువతిని స్వీకరంచు."

ఈ మాటను విన్న పుత్రుడు సింహపరాక్రముడు ఇట్లన్నాడు: "ఇందులో సూక్ష్మపాదాలుగల ఆవిడే నాకు భార్య కాగలదను కుంటాను. ఆమె చిన్నదే అయి ఉంటుంది. ఆమె నాకు తప్పకుండా అనురూపవతి కాగల దనుకుంటాను. కాస్త పెద్ద అడుగులుగల ఇంకొకామె వయసులో పెద్దదయి ఉంటుంది. ఆమె నీకు యోగ్యురాలు కావచ్చును."

ఈ కుమారుని మాటలువిని చండసింహుడు ఇట్లా అన్నాడు: "ఇప్పు డా ప్రసక్తి ఎందుకు? ముందే మీ తల్లి గతించినది కదా!

అంత మంచి భార్య చనిపోయిన తర్వాత ఇంకొక ఆమెపై ఆశ ఎందుకు?" ఆ మాట విని ఆ పుత్రుడు చండసింహునితో ఇట్లన్నాడు:

"నాన్నా! అలా కాదు. భార్యలేకపోతే గృహస్థుని గృహం శూన్యమౌతుంది. మూలదేవుని గాథ మీరు వినలేదా?

యత్ర ఘనస్తన జఘనా నాస్తి మార్గావలోకినీ కాంతా,
అజడః కస్తద నిగడం ప్రవిశతి గృహ సంజ్ఞకం దుర్గమ్.

(ఏ ఇంటిలో ఘనస్తన జఘన అయిన కాంత ఎదురు చూస్తూ ఉండదో, గడెవేయని నామమాత్ర గృహమైన ఆ దుర్గంలోనికి జడుడుకానివా డెవ్వడు ప్రవేశిస్తాడు?)

కాబట్టి నాన్నా! ఆమెను మీరు భార్యగా స్వీకరించకపోతే నా శాపానికి పాత్రులౌతారు."

ఈ పుత్రుని మాట విని అతను తోడు రాగా చండసింహుడు ఆ అడుగుజాడలనే అనుసరించి మెల్లగా వెళ్ళినాడు. ఆ సరస్తీరం రాగా ముత్యాల హారాలతో వెలిగిపోతూ ప్రౌఢ అయిన చంద్రవతీ మహారాణిని అక్కడ కనుగొన్నాడు.

కుమార్తె లావణ్యవతి వెన్నెలవలె తెల్లనిదై నిశాగగనంలో ఉండవలసినది పోయి మధ్యాహ్నం తరుచ్ఛాయలో కూర్చొని ఉండడం గమనించినాడు. కుతూహలంతో తన కొడుకుతో పాటూ ఆమెను సమీపించినాడు. రాణి అతనిని చూచి దొంగ యేమో నని భయభ్రాంతురాలై లేచి నిలుచున్నది.

"అమ్మా! భయపడవలసిన పనిలేదు. వీరు దొంగలు కారు. సౌమ్యాకృతులుగా కనబడుతున్నారు. చక్కని వస్త్రధారణ గల

వీరు తప్పకుండా వేటకోసం వచ్చి ఉంటారు'' అని తన కుమార్తె అనగా డోలాయమాన మానసురాలైన రాణి చూస్తుండగానే ఆ గుర్రం నుంచి దిగి చండసింహుడు వారితో ఇట్లన్నాడు :

''భయపడవలసిన పనిలేదు. ప్రణయంతో మిమ్ములను చూడడానికి మేము వచ్చినాము. కాబట్టి మమ్ములను నమ్మి నిరాటంకంగా మీరెవ్వరో చెప్పవలసింది. హరనేత్రానలజ్వాలతో మన్మథుడు దగ్ధమైపోగా దుస్థితులైన రతి ప్రీతులవలె ఈ అరణ్యానికి మీరు వచ్చినట్లు కన్పిస్తున్నారు.

ఈ నిర్జనమైన వనంలోనికి మీ రెలా ప్రవేశించినారు? మీ ఆకారాలను చూస్తే రత్నప్రాసాదాలలో ఉండవలసినవారుగా కనబడుతున్నారు. వరాంగనల ఒడిలో ఉండవలసిన మీ పాదాలు కంటక భూయిష్ఠమైన ఈ భూమిపై ఎలా తిరుగుతున్నవి? అని మా మనసు వ్యథపడుతున్నది.

ఇదేదో చిత్రం. ఇక్కడి దుమ్మూ ధూళి గాలికి రేగి మీ ముఖాలపై పడుతూ మా ముఖాలను మలినపరుస్తున్నవి. మీ పుష్పపేశలాలైన అంగాలపై ఆతపోష్ణం చూడగా చండదీధితి అయిన సూర్యుని కిరణసంతతి మమ్ములను దహించివేస్తున్నది.

మా మన సెంతో కలవరపడుతున్నది. మీ వృత్తాంతం తెలియజేయండి. క్రూరమృగావృతమైన అరణ్యంలో మీ ఉనికి మేము చూడలేము.''

ఇలా చండసింహుడు చెప్పగా రాణి మెల్లగా నిట్టూర్చి లజ్జాశోకాకుల అయి అతనికి తమ వృత్తాంతాన్ని వినిపించినది.

అంతట ఆమె భర్తృహీనగా ఎంచి ఆమెనూ ఆమె కూతునూ ఓదార్చి, మధురవాక్యాలతో చండసింహుడు అనురంజింపజేసి

రించినాడు. పుత్రికతో పాటూ ఆమెను తమ గుర్రాలవెనుక
ఎక్కించుకొని కుబేరపట్నం వలె సమృద్ధమైన తమ పట్టణా
నికి తీసుకొని వెళ్ళినాడు.

రాణి కూడా జన్మాంతరగతురాలివలె అవశురాలై అతని
వశమై సహకరించినది. అనాథురాలు, కష్టాలలో చిక్కుకున్నది అయిన
పరదేశంలో ఇంకేమి చేయగలదు?

అంతట సూక్ష్మపాదం కలది గనుక సింహపరాక్రముడు,
చండసింహసుతుడు చంద్రవతిని భార్యగా చేసుకున్నాడు. ఆమె
పుత్రి లావణ్యవతిని నృపతి కన్యకను, పాదాలు పెద్దవైనందు
వల్ల చండసింహుడు భార్యగా చేసుకున్నాడు.

మొదట ఆ చిన్నా పెద్ద అడుగుల జాడలను చూచి అలా
నిర్ణయించుకున్నారు గనుక దాని నెలా అతిక్రమింపగలరు?

ఈ విధంగా పాదవిపర్యాసంవల్ల ఆ తండ్రీ కొడుకులకు
కూతురు తల్లీ భార్యలుగా అయి, అత్తాకోడళ్ళయినారు. కాలక్రమంగా
ఆ భర్తలవల్ల వారిద్దరకూ బిడ్డలు కలిగినారు. క్రమంగా
మనుమలు కొందరు కూడా కలిగినారు. అలా చండసింహ, సింహపరాక్ర
ములు లావణ్యవతీ చంద్రవతులతో ఉండిపోయినారు

అని ఈ విధంగా బేతాళుడు ఆ రాత్రి దారిలో త్రివిక్రమ
సేన మహారాజునకు చెప్పి తిరిగి ఇలా ప్రశ్నించినాడు:

"ఆ మాతా, దుహితులకు, పుత్రపితరులకు కలిగినవారు
ఉభయ పక్షాలలోని వారు పరస్పరం ఒకరికొకరు ఏమౌతారు?"

పూర్వం ఒక శాపమున్నది కదా, తెలిసీ చెప్పకపోతే నీ తల
వేయి వ్రక్కలౌతుంది.

స్వీకరించినాడు. పుత్రికతో పాటూ ఆమెను తమ గుర్రాలవెనుక కూర్చుండబెట్టుకొని కుబేరపట్నం వలె సమృద్ధమైన తమ పట్టణానికి తీసుకొని వెళ్ళినాడు.

రాణి కూడా జన్మాంతరగతురాలివలె అవశురాలై అతని సంగీకరించినది. అనాథురాలు, కష్టాలలో చిక్కుకున్నది అయిన స్త్రీ విదేశంలో ఇంకేమి చేయగలదు?

అంతట సూక్ష్మపాదం కలది గనుక సింహపరాక్రముడు, చండసింహసుతుడు చంద్రవతిని భార్యగా చేసుకున్నాడు. ఆమె కుమార్తె లావణ్యవతిని నృపతి కన్యకను, పాదాలు పెద్దవైనందు వల్ల చండసింహుడు భార్యగా చేసుకున్నాడు.

మొదట ఆ చిన్నా పెద్ద అడుగుల జాడలను చూచి అలా నిర్ణయించుకున్నారు గనుక దాని నెలా అతిక్రమింపగలరు?

ఈ విధంగా పాదవిపర్యాసంవల్ల ఆ తండ్రీ కొడుకులకు పిల్లాతల్లీ భార్యలుగా అయి, అత్తాకోడళ్ళయినారు. కాలక్రమంగా తమ భర్తలవల్ల వా రిద్దరకూ బిడ్డలు కలిగినారు. క్రమంగా ఇంకొందరు కూడా కలిగినారు. అలా చండసింహ, సింహపరాక్రములు లావణ్యవతీ చంద్రవతులతో ఉండిపోయినారు

అని ఈ విధంగా బేతాళుడు ఆ రాత్రి దారిలో త్రివిక్రమసేన మహారాజునకు చెప్పి తిరిగి ఇలా ప్రశ్నించినాడు:

"ఆ మాతా, దుహితులకు, పుత్రపితరులకు కలిగినవారు ఉభయ పక్షాలలోని వారు పరస్పరం ఒకరికొకరు ఏమౌతారు?"

పూర్వం ఒక శాపమున్నది కదా, తెలిసీ చెప్పకపోతే నీ తల వేయి వ్రక్కలౌతుంది.

ఈ ప్రశ్నను బేతాళుడు చెప్పగావిని ఎంతకూ జవాబు తెలియక ఆ రాజు మౌనంగా నడచి పోసాగినాడు.

అంతట ఆయన భుజంమీద నున్న బేతాళుడు మనసులో నవ్వుకొని మృత పురుష దేహాంతర్గతుడైన తాను ఇట్లా అను కున్నాడు: "ఈ రాజు ఈ మహాప్రశ్నకు జవాబు తెలియక మాట లాడకున్నాడు. సంతోషంగా అతి చతురగతితో, మౌనంగా నడచి పోతున్నాడు. సత్త్వరాశి అయిన ఇతనిని ఇక వంచించడం సాధ్యంకాదు.

ఆ భిక్షువు మాతో ఆడుకుంటున్నాడు. ఇక శమింపడు కాబట్టి ఆ దురాత్ముని ఏదో ఉపాయంతో వంచించి భావికల్యాణ ప్రదమైన సిద్ధిని, వానికి లభించకుండా, ఈ రాజుకు లభించేటట్టు చేస్తాను" అని ఆలోచించుకున్న బేతాళుడు ఆ రాజుతో ఇట్లన్నాడు:

"ఓ రాజా! కృష్ణనిశాఘోరమైన ఈ శ్మశానంలో ఈ రాక పోకలతో సంక్లిష్టుడవై సుఖార్హుడవైన నీవు ఏ మాత్రం వికల్పం చెందకుండా ఉన్నావు. కాబట్టి ఆశ్చర్యంతో నీధైర్యం చూచి సంతుష్టుడనైనాను. ఈ శవాన్ని నీవు తీసుకెళ్ళు. ఇందులో నుంచి నేను బయట పడతాను. నీ హితం కోరి నేను చెప్తున్న మాట విను. అలా చెయ్యి.

ఎవడికోసమైతే ఈ నరశవాన్ని నీవు కొనివచ్చినావో ఆ దుష్టభిక్షువు నన్నిందులోనికి ఆహ్వానించి అర్చిస్తాడు. నిన్నే ఆ శఠుడు బలి ఇవ్వ దలచుకున్నాడు. భూమిపై సాష్టాంగనమస్కారం చేయమని నీకు చెప్తాడు. నీవు అదెలాగో ముందు చేసి చూపితే అలానే చేస్తానని చెప్పు. ఓ మహారాజా! ఆ శ్రమణునకు నీ విలా చెప్తే అతను భూతలంపై సాష్టాంగనమస్కారం చేసి చూపుతాడు.

ఈ లోగా నీవు నీ కత్తితో వాని తలను నరికివేయి. అందుతో వాడు కోరిన విద్యాధరైశ్వర్య సిద్ధి నీకు లభిస్తుంది. వానిని ఉపహారం చేసి రాజ్యాన్ని అనుభవించు. ఇలా చేయకపోతే ఆ భిక్షువు నిన్ను బలి ఇస్తాడు. అందుకోసమై విఘ్నం కల్పిస్తూ ఇంతసేపు కాలహరణం చేసినాను. ఆ సిద్ధి నీకు లభించుగాక! వెళ్ళు'' అని చెప్పి అతని భుజంపై నున్న ప్రేతకాయంలోనుంచి బయలువెడలి బేతాళుడు వెళ్ళిపోయినాడు.

అంతట ఆ నరపాలుడు బేతాళుని వాక్యాలతో సంప్రీతుడై ఆ శ్రమణుడు అహితుడే నని భావించి ఆ మృతశరీరాన్ని తీసుకొని సంతోషంతో ఆ వటవృక్షం క్రిందికి బయలుదేరినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీలంబకంలోని
ముప్పై ఒకటో తరంగం.

# మున్పై రెండో తరంగం

ఆ తర్వాత త్రివిక్రమసేన భూపతి భుజంపై శవాన్ని వేసుకొని ఆ శాంతిశీలు డనే భిక్షువు దగ్గరకు వెళ్ళినాడు. ఆ శ్రమణుడు తనరాక కెదురుచూస్తూ ఒంటరిగా ఉన్నాడు. కృష్ణపక్ష రాత్రి వలె రౌద్రంగా ఉన్న ఆ శ్మశానంలో ఆ చెట్టుక్రింద కూర్చున్నాడు. రక్తంతో అలికి తెల్లనైన ఎముకల చూర్ణంతో నిర్మితమైన మండలంలో అన్ని దిక్కులా రక్తంతో నింపిన పాత్ర లున్నవి.

మహాతైలప్రదీపాఢ్యమైన హోమకుండంలో అగ్ని రగులుతుండగా పూజాసంభారా లన్నిటినీ తెచ్చిపెట్టుకొని తన ఇష్టదేవతా పూజకై సిద్ధంగా ఉన్నాడు. అతని దగ్గరకు రాజు వెళ్ళగా భిక్షువుకూడా ఆయనను చూచి, ఆయన కొనివచ్చిన శవంతో హర్షంచెంది, ప్రశంసిస్తూ లేచి నిలుచుకొని ఇట్లన్నాడు :

"ఓ మహారాజా! నాకు దుష్కరమైన పనిని మీరు అనుగ్రహించి పూర్తిచేసినారు. మీలాంటి వా రెక్కడ? ఈ పని ఎక్కడ? దేశకాలాలెలాంటివి? తమవంటి భూపతులకు నిర్భయత ముఖ్యమని పెద్దలు సత్యమే చెప్పినారు. అందువల్లనే మీ సంగతి మీరు చూచుకొనకుండా పరార్థాన్ని సాధించగలిగినారు. ఇదే మహాత్ముల గొప్పతనమని విజ్ఞులు చెప్తారు. ప్రాణాలకు భంగం కలుగుతూ ఉన్నా అనుకున్నదానినుంచి వెనుకంజ వేయకపోవడం గొప్పతనం."

ఇలా అంటూ సిద్ధికోసమై ప్రయత్నిస్తున్న ఆ భిక్షువు ఆ రాజు భుజంపైనున్న శవాన్ని క్రిందికి దింపినాడు. దానికి స్నానం చేయించి పూలమాలలను కట్టి తాను నిర్మించిన మండలం

మధ్యలో ఆ మటకాన్ని (శవాన్ని) ఉంచినాడు. భస్మాన్ని ఒడలంతా అలదుకొని కేశయజ్ఞోపవీతధారి అయి ప్రేతవస్త్రాన్ని కట్టుకొని కాసేపు ధ్యానస్థితుడైనాడు. మంత్రబలంతో ఆహ్వానించిన ఆ బేతాళుని ఆ నరకళేబరంలోనికి ఆవహింపజేసి ఆ భిక్షువు క్రమంగా పూజించసాగినాడు.

స్వచ్ఛమైన మానవరక్తాన్ని కపాలార్ఘ్య పాత్రంలో నింపి అర్ఘ్య మిచ్చినాడు. సుగంధ పుష్పాలతోనూ, విలేపాలతోనూ పూజించినాడు. తర్వాత మనిషి కనులతో ధూపంవేసి. మాంసంతో బలినిచ్చి పూజను సమాప్తిచేసి తన ప్రక్కనున్న రాజుతో ఇట్లా అన్నాడు:

"ఓ రాజా! ఇక్కడ ఈ మంత్రాధి రాజ సన్నిధిలో భూమిపై అష్టాంగాలూ అంటునట్టుగా పడి ప్రణామం చేయవలసింది. అందుతో ఈ వరప్రదుడు నీకు అభీష్టసిద్ధిని చేకూరుస్తాడు."

ఈ మాటవిని బేతాళుని వచనాలను జ్ఞాపకం చేసుకొని ఆ రాజిలా జవాబిచ్చినాడు: "పూర్వం నాకీ ప్రణామ మెలాంటిదో తెలియదు. అదెలాగో మీరు ప్రదర్శించి చూపండి. అప్పుడు నే నలాగే చేస్తాను."

అంతట దానిని చూపుటకై ఆ భిక్షువు నేలపై సాష్టాంగ పడగానే ఆ రాజు కత్తిదూసి వాని తలను నరికివేసినాడు. వాని కడుపును చీల్చి గుండెకాయను తీసి, వాని తలను ఆ హృదయ కమలాన్ని బేతాళున కర్పించినాడు. అందుతో ప్రీతులై భూత గణములు సాధువాదాలు చేస్తుండగా ఆ బేతాళుడు ఆ శవంలో నుంచి ఆ రాజుతో ఇట్లన్నాడు:

"ఓ రాజా! ఏ విద్యాధరేంద్ర పదవిని ఈ భిక్షువు కోరు కున్నాడో అది నీకు ఈ భూసామ్రాజ్యభోగం తర్వాత లభిస్తుంది. నేను నిన్ను చాలా క్లేశపెట్టినాను. నీకు వలసిన వరం కోరుకో" అంటున్న ఆ బేతాళునితో ఆ రా జిట్లా అన్నాడు:

"నీవు ప్రసన్నుడవైన తర్వాత ఏ కోరికమాత్రం తీరదు? అయినప్పటికీ నీవు అమోఘవచనుడవు గనుక ని న్నడుగు తున్నాను. ఈ ప్రశ్న కథలు నానాఖ్యాన మనోహరాలైనవి విన్నాను. ఆ ఇరవై నాలుగు కథలతో పాటూ ఇది ఇరవై అయిద వదై ఈ కథాసంపుటి సమాప్తి చెందుగాక!'' అని ఆ రాజు కోరగా బేతాళు డిట్లన్నాడు:

"అలాగే కానీ. మరొక విశేషం చెప్తాను విను: ముందు చెప్పిన ఇరవై నాలుగూ, ఈ సమాపనకథా కలిసి ఈ కథావళి బేతాళ పంచవింశతిక అనే పేరుతో విశ్వవిఖ్యాతమై, పూజ్యమై, మంగళకరమగు గాక! ఇందులో ఒక శ్లోకమాత్రమైనా ఆదరంతో చదివినా, విన్నా వారు పాప విముక్తులౌతారు. యక్ష బేతాళ కూష్మాండ రాక్షసాదులు ఈ కథలు చెప్పే చోట ప్రవేశింపలేరు'' అని చెప్పి ఆ బేతాళుడు ఆ శవంనుంచి బయటకువచ్చి యోగ మాయతో తన ఇచ్ఛవచ్చిన చోటికి వెళ్ళిపోయినాడు:

"సాధు! కుమారా సాధు! నీ విప్పుడు చంపివేసిన దొంగ సన్యాసి విద్యాధర మహాచక్రవర్తిత్వమే కావలెనని పట్టుపట్టినాడు. నిన్ను నా అంశతో పూర్వం విక్రమాదిత్యుడుగా సృష్టించినాను. మ్లేచ్ఛరూపంలో అవతరించిన అసురులను శాంతింప జేయుటకై ని న్నిప్పుడు సృష్టించాను. ఇప్పుడు దుర్వృత్తుల దమనంకై తిరిగి నేను నిన్ను త్రివిక్రమసేనుడుగా సృష్టించినాను. సకల

ద్వీప పాతాళాలతో పాటూ ఈ భూలోకాన్ని కూడా నీ స్వాధీనంలో ఉంచుకొని త్వరలోనే నీవు విద్యాధరాధిపతివి కానున్నావు. దివ్య భోగాలను ఉద్వేగరహితుడవై చిరకాలం స్వేచ్ఛగా అనుభవించి స్వచ్ఛందంగానే వానిని వదలివేసి తుదకు నాలో సాయుజ్యం చెందుతావు. ఇందులో సందేహం లేదు.

ఇప్పుడు నే నిస్తున్న అపరాజిత మనే ఈ ఖడ్గాన్ని తీసుకో. నా అనుగ్రహంవల్ల వేను చెప్పినవన్నీ నీకు లభిస్తాయి'' అని చెప్పి ఆ ఖడ్గరత్నాన్ని ఆ రాజున కిచ్చి అతని వాక్పుష్పాలతో అర్చితుడై ఉమాపతి తిరోధానం చెందినాడు.

ఈ విధంగా తనకార్యం ఆ రాత్రి తెల్లవారేలోగా ముగించు కొని త్రివిక్రమసేన భూపాలుడు తన పట్టణం ప్రతిష్ఠానంలోనికి ప్రవేశించినాడు.

ఆ తర్వాత అక్కడకు వచ్చిన ప్రజలందరూ ఆ రాత్రి జరిగిన వృత్తాంతమంతా తెలిసి వేడుకలు చేసుకున్నారు. స్నానా దులతో ఈశ్వరార్చనతో నృత్యగీతవాద్యాలతో ఆ రోజంతా ఆ రాజు గడిపివేసినాడు.

కొన్నిరోజులలోనే ఆ రాజు మహేశ్వరు డిచ్చిన ఖడ్గ ప్రభా వంతో సర్వద్వీపాలతోనూ, రసాతలంతోనూ కూడిన భూమిని నిష్కంటకంగా అనుభవించినాడు.

ఈశ్వరుని అనుగ్రహంతో విద్యాధరాధీశత్వాన్ని కూడా పొంది చిరకాలం అనుభవించి తుదకు భగవత్సాన్నిధ్యాన్ని చెంది నాడు.

ఇది బేతాళ పంచవింశతిక.

— అని శాప వియోగంవల్ల తప్పిపోయి; చాలా కాలానికి తన్ను కలుసుకొన్న మంత్రి విక్రమకేసరి మృగాంకదత్తునకు చెప్పి ప్రకృతార్థాన్ని ఈ విధంగా విన్నవించినాడు :

"ఓ దేవా! ఈ విధంగా వృద్ధుడైన విప్రుడు ఈ బేతాళ పంచవింశతికను చెప్పి తిరిగి నాతో ఇట్లన్నాడు: "ఓ కుమారా! త్రివిక్రమసేన మహారాజు ఆ విధంగా నిర్భీకుడై బేతాళుని అనుగ్రహంవల్ల ఎన్నింటినో పొందలేదా! కాబట్టి నీవు కూడా నేను ఉపదేశించే ఈ మంత్రాన్ని గ్రహించి, విషాదాన్ని త్యజించి బేతాళ ముఖ్యుని ప్రసన్నుని చేసుకొని నీ ప్రభువు మృగాంకదత్తుని కలుసుకొనగలవు. ఉత్సాహవంతులకు లభింపని దేదీ ఉండదు. భగ్నోత్సాహుడైన వాడు దేనిని మాత్రం సాధించగలడు?

కాబట్టి నీపై ప్రీతితో చెప్తున్నాను. నేను చెప్పినట్టు చెయ్యి. పాముకాటుతో ఆర్తుడవై ఉన్న నన్ను కాపాడిన స్నేహితుడవు నీవు."

ఈ విధంగా చెప్పి ఆ విప్రుడు ఆ మంత్రాన్ని ప్రయోగ క్రియా సముపేతంగా ఉపదేశించగా నే నక్కడినుంచి ఉజ్జయినికి వెళ్ళితిని. అక్కడ శ్మశానంలో రాత్రి శవాన్ని సంపాదించి స్నానాదులతో దానిని అలంకరించి ఆ మంత్రంతో అందులోనికి బేతాళుని ఆహ్వానించి యథావిధిగా అర్చించినాను.

భోజ్యమైన మహామాంసాన్ని ఆయనకు నైవేద్యం చేయగా తృప్తిచెంది ఆయన దానిని భుజించి 'తృప్తికాలేదు. నీవింక ఎవరి మాంసమూ తే నక్కరలేదు' అని మానుషమాంసాభిలాషి అయిన అతను అన్నాడు. కాలం గడచి పోతున్నది గనుక నా మాంసాన్నే ఉత్తరించి ఆయనకు సమర్పించినాను. అందుతో ఆ యోగీశ్వరుడు సంతోషించినాడు.

"మిత్రమా! నీ దృఢసత్త్వంతో సంతోషించినాను. నీ శరీరం పూర్వంలాగే అక్షతమౌతుంది. నీ కేం వరం కావలెనో కోరుకో" అన్నాడు.

అప్పుడు నే నిలా జవాబిచ్చినాను. "దేవా! నా ప్రభువైన మృగాంకదత్తుడు ఎక్కడున్నాడో అక్కడికి నన్ను కొనిపోవలసింది. అంతకంటే నేను కోరే వర మేమీ లేదు."

ఇది విని బేతాళపతి "నా భుజంపై ఎక్కవలసింది. నేను వెంటనే నీ ప్రభువు వద్దకు కొనిపోతాను" అని చెప్పగా నే నాయన భుజంపై కూర్చున్నాను. అతను ప్రేత తనుప్రవిష్టుడై నన్నెత్తుకొని గగనమార్గంలో ఇక్కడికి కొనివచ్చి నీ మార్గంలో నన్ను గగనంనుంచి దించినాడు.

ఈ విధంగా బేతాళ వరప్రసాదంతో నేను నీ చరణసన్నిధికి చేరుకున్నాను. మిమ్ములను చూడనే చూచినాను. అతను తన పని ముగించి వెళ్ళిపోయినాడు. నాగశాపంతో మీనుంచి విడిపోయిన నా మహోదంత మిది"

అని విక్రమకేసరి తన కథ చెప్పగా విని మృగాంకదత్తుడు తన కాంతకోసమై ఉజ్జయినికి వెడుతున్నవాడు మార్గంలోనే తన మరో మంత్రి నిలా కలుసుకున్నాడు.

పారావతుని శాపంతో భ్రష్టమై క్రమంగా మిళితమైన అమాత్య బృందంతో ఆ రాజపుత్రుడు సకలసాధ్య సంపత్తినీ చేకూర్చుకొనగల నన్న నమ్మకంతో సంతోషించినాడు.

ఇది మహాకవి సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో శశాంకవతీ లంబకంలోని
ముప్పైరెండో తరంగం.